# హిందూమతము

(ఈ గ్రంథము రాజమండ్రి హిందూసమాజమువారి "భగవద్గీత" పరీక్షకును, విజయవాడ సనాతన ధార్మికయువజనసంఘమువారి "ధర్మప్రచారక" ప్రాథమిక పరీక్షకును పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడినది.)


గ్రంథకర్త:

జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ.,

యస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్. కాలేజి,

విజయవాడ.




"వేదకాలపు స్త్రీలు", "స్మృతికాలపు స్త్రీలు" మున్నగు గ్రంథముల రచయిత.

 [వెల రూ [illegible]-0-0

# ఉపోద్ఘాతము



హిందూశబ్దమునుగూర్చి మూడువిధములైన నిర్వచనములు చెప్పబడుచున్నవి. (1) భారతదేశమునకు పశ్చిమోత్తరదిశకు కొనలో సింధునది యుండుటచే పై దేశముల వారీదేశమును సింధుదేశమని వ్యవహరింపజొచ్చిరి. పర్షియన్ భాషలో 'స'కారము 'హ'కారముగ మారుటచే నీదేశమునకు పర్షియా మున్నగు దేశములలో హిందూదేశమను వ్యవహారము గల్గినది. అందువలన నిచ్చటిమతముగూడ హిందుమతమను పేర బరగజొచ్చినది. ఇదియొక నిర్వచనము. (2) శ్రీవినాయక సావర్కరు మున్నగువారు హిందుశబ్దము 'సప్తసింధు' నుండి వచ్చినదనియు, సప్తసింధుదేశము ఆర్యులకు నివాసమనియు, సకారము హకారముగ మారుట మనదేశపు ప్రాకృతములలో గూడ జరుగుననియు, దీనికై యీ పదము విదేశములనుండి వచ్చినదని తలపనక్కఱలేదనియు నుడువుచున్నారు. (3) హిందూపదము 'మహామేరు తంత్రము' అను ప్రాచీనగ్రంథములలో గన్పట్టుచుండుటచే హిందునామము విదేశస్థులనుండి వచ్చినది కాదని కొందరు చెప్పుచున్నారు. మేరుతంత్రములో హిందుశబ్దమునకు 'హీనుని దూషించువాడు' అను నిర్వచనము చెప్పబడినది. మఱియు హిందూధర్మమనుమాటకూడ మేరుతంత్రములో వాడబడినది. కలియుగములో చక్రవర్తులు హిందూధర్మమును లోపింపచేయు

వారయ్యేదరని మేరుతంత్రములోకలదు. 'హీనంచ దూషయ త్యేవ హిందు రిత్యుచ్యతే ప్రియే! హిందూధర్మప్రలోప్తారో భవేయుశ్చక్రవర్తినః॥' హిందూశబ్దముగల యీశ్లోకము ప్రక్షిప్తమని కొందఱి మతము. ఈశ్లోకము ప్రక్షిప్తము కానిచో, మేరుతంత్రము సంప్రదాయశుద్ధవైదికమతమునకు చెందినదే యగుటచే నిట హిందూధర్మమునకు సనాతన వర్ణాశ్రమధర్మమనియే యర్థము.

ఈమూడు వాదములపైనను విమర్శింపవలసిన యంశములు చాలకలవు; కాని నేనీగ్రంథమునకు హిందూమత నామము పెట్టుటకు గలకారణమును తెల్పుట కావిమర్శన మనవసరములేదు. (1), (2) నిర్వచనములనుబట్టి హిందుశబ్దము దేశవాచకమేకాని మతవాచకముకాదు. అయినను, 'హిందుమత' మను పేరుకూడ వాడుకలోనికి వచ్చినది. నేటికి ప్రభుత్వమువారి లెక్కలలోను, విదేశస్థుల వ్యవహారములోను గూడ హిందూమతశబ్దము గలదు. దేశవాచకశబ్దమును మతపరముగ ప్రయోగించుటలోనే గొప్ప చిక్కు గలదు. ఏమన: నేడీ దేశములో నున్నవారందఱిది యొకే మతముకాదు. హిందూమహాసభవారు చెప్పినట్లు, హిందూదేశములో పుట్టిన యేమతమునకు చెందినవారైనను హిందువులని వ్యవహరింపవలయుననినను, అందు చిక్కుగలదు. ఎట్లన, ఈమతములన్నిటికిని సామాన్యధర్మ మొక్కటియు లేదు. వేదకు ప్రమాణములలోనే యైక్యములేదు.

బౌద్ధమతము, జైనమతము, సిక్కుమతము, ఆర్య సమాజము బ్రహ్మసమాజము మున్నగునవి యంతకు పూర్వము నుండియు నున్న హిందూమతముయొక్క మూల సూత్రములనే త్రోసివైచినవి. ఇవియన్నియు నొకే మతము గుచో క్రైస్తవ మహమ్మదీయాదిమతములనుగూడ నీమతము లోనికే దూర్చవచ్చును. ఒకమతముయొక్క మూలసూత్ర ములనే త్రోసివైచుచు, ప్రమాణములనే నిరాకరించుచు బయలుదేరినసంస్థ యామతములోనే యంతర్భూత మనుట కంటెను, నామతమునకు చేయబడు మహాపచారముండదు.

పైన తెల్పిన మతములన్నియు నేమతమును ధిక్క రించి బయలుదేరినవో యామతమునకు గల కొన్ని మూల సూత్రములేవన : (1) శ్రుతిస్మృతీతిహాసపురాణసదాచార ప్రామాణ్యము (2) వర్ణవ్యవస్థ (3) పునర్జన్మ (4) దైవ పిత్ర్యకర్మలు (5) కాశ్యాదిపుణ్యక్షేత్రమహాత్త్వవిశ్వాసము (6) అవతారములు (7) లోకాంతరములు (8) విగ్రహారా ధనాద్యధికారానుగుణములైన యారాధనోపాసన విధాన ములు (9) స్త్రీల ప్రత్యేకధర్మములు ఇటువంటిదానిని గూడ నంగీకరింపని మతములు కొన్ని పైన పేర్కొనబడిన వానిలో కలవు. అందనేకమతములు ఈసిద్ధాన్తములలో నొకటి రెంటినిమాత్రమే యంగీకరించును. పైదెల్పిన ప్రామాణ్యము నంగీకరించునం దింకొక్కమతముకూడ లేదు. కావున నివి యన్నియు నొకేమతమనికాని, భిన్నసంప్రదాయములనికాని చెప్పుట యర్థములేని మాటయనక తప్పదు.

ప్రధానాంశమేమన: హిందూశబ్దము దేశపరమా? మతపరమా? దేశపరమగుచో, నీదేశమునపుట్టిన మతముల కన్నిటికిని ముఖ్యధర్మములలోకూడ సామ్యము లేకపోవుటచే దాని నెన్నడును మతపరముగ వాడుటకు వీలులేదు.

దేశపరముగనున్న దానిని మతపరముగ వాడవల దనినను నేడు వినువారు లేనిమాట వాస్తవమే. కావున నే యట్లు వాడబడు హిందూశబ్దమునకు తగినయర్థము చెప్ప వలసిన యవసరము గల్గుచున్నది. ఇందు పుట్టిన మతముల కన్నిటికిని హిందూమతములనుటకు వీలులేదని పైన చూచి యుంటిమి. ఒక్కవిధముగ మాత్రము దేశపరమైన హిందూ శబ్దమును, మతపరముగ వాడుటను సమర్థింపవచ్చును. ఎట్లన, ఈహిందూ దేశమునకు సహజమైనదియే హిందూ మతమని చెప్పవచ్చును.

ఈదేశమునకు సహజమైన మత మెద్ది యనునదియే యిప్పుడుప్రశ్న. జైన, బౌద్ధ, బ్రహ్మసమాజార్యసమాజమతము లదివర కీదేశముననున్న మతముపై తిరుగుబాటు బయలు దేరిన వగుటచే నవి యీ దేశమునకు సహజములుకావనుట స్పష్టము. ఏమత మదివర కీహిందూ దేశముననుండిన మత ముపై తిరుగుబాటుగ బయలుదేరలేదో, లేక యేమతము పారంపర్యముగ నవిచ్ఛిన్నముగ వచ్చుచున్నదో, యదియే కదా హిందూమతమని చెప్పదగినది? ఆమతమే శ్రుతిస్మృతీతి హాసపురాణ సదాచార ప్రమాణనిబద్ధమైన మతము. ఇంత

విశాలమైన భారతదేశచరిత్రలో నెచ్చోటనుగూడ నీ మత మదివరకుండిన మతముపై తిరుగుబాటుగ బయలుదేరినట్లు కన్పట్టదు. లేదా దీనికి పూర్వమున దీనికి విరుద్ధమైన మత మొకటి యుండినట్లు చెప్పుటకు వీలుగల్గుటలేదు. కావున నిదియే భరతఖండమునకు సహజమైనమతము. జైన బౌద్ధాది మతములు బయలుదేరుటకుపూర్వమే మత మిట నుండెనో యేమతము నేటికిని, అనగా నీయితరమతములు బయలుదేరిన పిమ్మటకూడ విశేషసంఖ్యాక భారతీయులచే ననుసరింపబడు చున్నదో యదియే హిందూమతమని యిట్లు తేలుచున్నది.

అంతియేకాదు. ఇతర దేశస్థులు హిందూపదమును ప్రాచీనకాలములో, మొట్టమొదట వాడినపుడు వారికి హిందూమతమునుగూర్చి వర్ణాశ్రమధర్మము మున్నగు భావములే తట్టుచుండెననుట కనేకాధారములు గలవు. నేటికిని ఇతర దేశములలో హిందూమతమన నాయభిప్రాయమే ప్రజలకు తట్టును.

ఈహిందూమతమునకులేని లక్షణములను కొన్నిటిని దీనికారోపించుచు, "హిందూమత" శబ్దముయొక్క సహా యముచేత కొందరు నేడు ప్రచారము చేయుచున్నారు. కావుననే, సనాతన వర్ణాశ్రమధర్మ ప్రతిపాదకమైన యీ గ్రంథమునకు నేను "హిందూమత" మనుపేరు పెట్టితిని. నేడాంధ్రదేశములో మతశబ్దము ధర్మ (రిలిజన్) పరముగా రూఢి యగుటచే దీనిని నే నట్లే వాడితిని.

జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.

# విషయసూచిక

నాస్తికో వేదనిందకః (మను 2–11)

ఈనాస్తికతను హృదయములో నాటు బోధలు నేడు మన బాలురకు ప్రారంభమునుండియు పాఠశాలలలో చేయబడుచున్నవి.ఒకటవఫారము మొదలుకొని నేడు తరగతికి సంబంధించిన చరిత్రపాఠ్యగ్రంథమును (హిస్టరీ టెక్స్టుబుక్కు) తీసికొనినను, అందు వేదములను గురించి యిట్లుండును. "వేదములను ఆర్యులనువారు క్రీ పూ. 1500 సంవత్సరముల ప్రాంతమున రచించిరి. అది నాగరకతయు ప్రారంభదశ ; నాగరకత తరువాత క్రమముగ పెరిగినది." ఈవాక్యములనే వేదముగ నమ్మిన మన బాలురకు మూఁడభిప్రాయములు దృఢముగ నేర్పడినవి. "(1) వేదములను మానవులే రచించిరి. (2) ఆ రచించినవారు మనయంత నాగరకులు బుద్ధిమంతులుకారు, (3) అవి వ్రాసినాలుగు వేల సంవత్సరములలోపుగ నేయైనది" ఈయంశములకు మకుటముగ బోధింపబడు మరొకయంశ మేమన, "ఆర్యులీ వేదములనువ్రాయుటకు పూర్వముహిందూ దేశములో లేనేలేరు. వారు పైనుండివచ్చిరి." చరిత్రగ్రంథములను వ్రాయువారీయంశములను తాముచూచివచ్చినట్లు వ్రాయుచున్నారు. కాని యిందేమాత్రమును సత్యములేదు. ఈసిద్ధాంతము లెట్లుబయలుదేరినవో, యెట్లువ్యాపించినవో, యెట్లుపండితులచే ఖండింపబడియుగూడ సంధపరంపరగ పాఠ్యగ్రంథములను వ్రాయువారిచేగ్రహింపబడుచున్నవో చూతుమేని వీనిబండారముబయటబడును. సుమారు 150 సంవత్స

రములక్రిందట సర్ విలియంజోన్సు అనునాయన యీసిద్ధాంతములను లేవదీసియుండెను. ఈసిద్ధాంతముల కాయన తగినంత ఋజువునిచ్చి యుండలేదు. అయినను. ఆయన గొప్ప పండితుడగుటచే మాక్సుముల్లరువంటి మహావిమర్శకుడుగూడ నావిషయమై తాను ప్రత్యేకవిమర్శకు గడంగక యీ యంశములనే యంగీకరించినాడు. మాక్సుముల్లరే యంగీకరించినపుడితరులమాట చెప్పనేల ? వానిని శంకించు వారెవ్వరును లేకపోయిరి. ఇంత ముఖ్యమైన చారిత్రికసిద్ధాంతములను లేవనెత్తుటకు తగినంత ఋజువున్నదా యని తర్కించువారుకూడ లేకుండిరి. మొట్టమొదటనీసిద్ధాంతములు తప్పని నుడివినవారిలో శ్రీవివేకానందస్వాముల వారొకరు. ఈసిద్ధాంతములను ఖండించుచు నొక గ్రంథమును వ్రాయవలయునను కోరికగూడ తమకున్నట్లు శ్రీవివేకానందులువ్రాసి యుండిరి. (చూ. East and West) కాని వారి యకాల నిర్యాణము దాని కంతరాయమైనది.

వేదములు క్రీ. పూ. 1500 ప్రాంతమున రచింపబడినవను సిద్ధాంతమును శ్రీలోకమాన్య బాలగంగాధరతిలకుగారు పటాపంచలు చేసి, క్రీ. పూ. 4500 సంవత్సరములప్రాంతముననే కొన్ని వేదఋక్కులుండినట్లు జ్యోతిషశాస్త్రాధారముచే సిద్ధాంతము చేసిరి. (చూ. 'Orion') శ్రీఅవినాశచంద్రదాసుగారు భూగర్భశాస్త్రముయొక్క (Geology) యాధారముచే వేదకాలమును నిర్ణయింపబూని తిలకుగారికంటెను

20 వేల వత్సరముల వెనుకకు ఋగ్వేదమును కొనిపోయిరి. (చూ. Rig Vedic India) మన యాంధ్రులలో కీ. శే. శ్రీ నడింపల్లి జగన్నాథరావుగారు ఆర్యులు పైనుండివచ్చినారను సిద్ధాంతమును సంయుక్తికముగ ఖండించి వేదముల యతి ప్రాచీనతను స్థాపించిరి. (చూ. ఆంధ్రమహాసామ్రాజ్యము).

వేదములనుగూర్చి యింతవరకునుజరిగినపరిశోధనలను బట్టిచూడ తుదకు వేదములయాదిని కనుగొనుటతమకసాధ్యమని యే పండితులందరునంగీకరింతురనునభిప్రాయముకలుగక మానదు. అట్లే వేదముల కర్తృత్వమునుగూర్చికూడ నెవ్వరును నిర్ధారణ చేయలేకపోయినారు. వేదకర్తను తెలిసికొనుటకు మనచారిత్రికు లెంతప్రయత్నించినను చివరకు తేలుసది దాని యపౌరుషేయత్వమే యనుటకు సందియములేదు.

వేదము లనాగరకులగు మానవులు రచించిరనియు, మనకున్నంతవిజ్ఞానము వారికి లేదనియు నిదివరలో చెప్పబడుచుండిన నిరాధారవాక్యము లిపుడిపుడు సన్నగిలుచున్నవి. శ్రీ దయానందసరస్వతులును గొప్పయాంగ్లవిద్యా పాండిత్యమునకు నిధులని చెప్పదగిన వారిశిష్యులును వేదములలోనాధునిక శాస్త్రముల (Sciences) రహస్యములన్నియునున్నవనుటకు కొన్ని యుదాహరణాదుల నిచ్చియున్నారు.

అట్లేకొందరు వేదములలోనున్న వైద్యశాస్త్రమునకు నేటి పాశ్చాత్యవైద్యశాస్త్రముసాటికాదనిచూపియున్నారు.

ఆవిధముగనే కొందరు వేదములలో సత్యద్భుతజ్యోతిషరహస్యములు కలవని వ్యక్తముచేసియున్నారు. అట్లే కొందరు తర్వాత బయలుదేరిన యితిహాసములను, పురాణములను నేటిదేశచరిత్రలనుగూడ వేదము బీజరూపమునుసూచించుచున్నదని చెప్పుచున్నారు.

వేదమంత్రమును సస్వరముగ నుచ్చరించుచో నామంత్రములో నేదేవత యుద్దేశింపబడినదో యాదేవత సూక్ష్మరూపముతో నాస్థలమున ప్రత్యక్షమగునని దివ్యజ్ఞాన సమాజమువారు పరిశోధనలచే కనిపెట్టిరి. (చూ. Bharat Samaj Puja Journal.)

శ్రీ అరవిందఘోషుగారు వేదములలో (ఉపనిషత్తుల లోనేకాక మంత్రభాగములలోగూడ) పరమవేదాంత సత్యములున్నవని స్ఫుటీకరించి యున్నారు. (చూ Arya సం.)

వేదము సమస్తజ్ఞాన విజ్ఞానములకునునిధియనుసంశ నే క్రమక్రమముగ లోకమునకు వెల్లడియగుచున్నది. ఇంకను ప్రాతకాలపు మాటలనే పట్టుకొని వేదముల నాగరికులచే రచింప బడినవనియు, మనమంతకంటె నాగరికులమనియు తలచువారికి ప్రాచీన వైదికజ్ఞానమును, నవీనపరిశోధనజ్ఞానమునుగూడ శూన్యములని చెప్పదగును.

వేదముల మహాత్త్వమును మనపూర్వులు బాగుగ నెఱిగియుండిరి. కావుననే యంతశ్రద్ధతో దానినింతకాలము

కాపాడియుండిరి. ఏధర్మశాస్త్రమును తీసినను, ఇతిహాస పురాణములను తీసినను వేదముపట్ల మహాభక్తిని వెల్లడించు వాక్యములసంఖ్యాకములుగ గోచరించును.

వేదములయొక్క ప్రాశస్త్యము నన్నివిధములవర్ణించి నను, అది యసంపూర్ణమేయగును. అట్టివేదములను ప్రమాణ ముగ నంగీకరింపనివాడు హిందువుడనిపించుకొనడు. సమస్త ధర్మములకును, జ్ఞానవిజ్ఞానములకును వేదము పెన్నిధానము హిందూమతసౌధము వేదమను పునాదిపైననే నిర్మింపబడినది.

ఇట్లు ప్రమాణభూతములైన వేదములు నాలుగు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వవేదము, ఇందొక్కొక్క వేదములో నాల్గేసి భాగములు కలవు. మంత్ర ము, బ్రాహ్మణ, ఆరణ్యకము, ఉపనిషత్తు.

## స్మృతులు.

సమస్త వేదము ధర్మమునకు మూలమనిపైన జెప్పబడి నదికదా. వేదములు అనంతములని తైత్తిరీయబ్రాహ్మణము చెప్పుచున్నది.

'అనంతా వై వేదాః' (తై. బ్రా. 3–10–11)

ఇపుడు మనకుగోచరించుచున్న వేదము పరిమితము. ఇది వేదములోని యేక దేశముమాత్రమే; కాని, పూర్ణ వేదము కాదు. కావునకొంత వేదమిపుడులుప్తమైనదని చెప్పవలయును.

లభ్యమైన వేదమొక్క ప్రమాణమో, లుప్తమైన వేదముకూడ నట్లే ప్రమాణము. ధర్మమనంతము, అదియంతయు ప్రస్తుతము నిలచియున్న వేదములో మనకు కన్పట్టకపోవుట సహజమే. నిలచియున్న వేదములోని ధర్మములను తెలిసికొన్నచో చాలదు. లుప్తమైన శ్రుతిలోని ధర్మములనుగూడ తెలిసికొనవలయును. అప్రత్యక్షమైన వేదములోని ధర్మములను మనకు తెల్పునవే స్మృతులు. వానిని మహర్షులు రచించిరి. ఆయా వేదభాగములు పఠనపాఠములనుండి తప్పిపోవుచుండినకాలములో, దూరదృష్టిగల మహర్షులు మానవులయందు తమకుగల యవ్యాజకరుణచే నావేదభాగములోని ముఖ్యవిషయములను తీసి తమ సొంతమాటలలో వానిని తేటతెల్లముగను, సంగ్రహముగను రచించి వానిని తమ శిష్యులకు బోధించి వైదికధర్మములను లోకములో నిలబెట్టిరి.

ఈమహర్షులు కేవలము లుప్తవేదములోని ధర్మములనే చెప్పలేదు. ప్రచారములోనున్న వేదభాగములలోని ముఖ్యధర్మములనుగూడ తమగ్రంథములలో వ్రాసియున్నారు. కొందరు వేదము నధ్యయనము చేయలేక పోవచ్చుననియు, నధ్యయనము చేసియు నందలి ధర్మరహస్యముల నెరుగలేక పోవచ్చుననియు వారిట్లు చేసిరి. అంతియేకాదు. ఒకే వేదములోని యొక శాఖకు చెందినవారికి మరొక శాఖలోని ధర్మములు తెలియుటకుకూడ ఋషులీధర్మగ్రంథములను రచిం

చిరి. ప్రధానముగ వీనిప్రయోజన మప్రత్యక్షములైన వేద భాగములోని ధర్మములను లోకమున కందజేయుటయే. వేదములకు వ్యతిరిక్తముగ మాత్రము వీరు తమగ్రంథములలో నేమియు చెప్పదలంపలేదు. వారేమాట చెప్పినను వేదమును దృష్టిలో నిడికొనియే చెప్పిరి. ఇట్లు వేదమును స్మరించుచు చెప్పినగ్రంథములు కనుకనే వీనికి 'స్మృతులు' అని పేరు వచ్చినది.

"శ్రుతిం పశ్యన్తి మునయః
స్మరన్తి చ తథా స్మృతిం"

(మునులు వేదమును చూతురు. దానిని చూచినట్లే స్మరించుచు స్మృతిని పల్కుచున్నారు.)

అని స్మృతికారులే చెప్పిరి. నేటికిని నీగ్రంథములకు నిలచియున్న స్మృతియను నామమే దీనిసత్యమును మనకు తెల్పుచున్నది.

కావున నొకధర్మము స్మృతిలోగన్పట్టుచున్నచో, దానికి ప్రస్తుత వేదములో నాధారముకన్పట్టకపోయినను, లుప్తమైన వేదభాగములో దాని కాధారముండునని మన మూహించుచుకొనవలయును. శ్రుతియొక్క యడుగుజాడలలోనే స్మృతి నడచుచుండును. ఈయంశమునే కాళిదాసు రఘువంశములో నుదాహరణముగ తీసికొని సుదక్షిణాదేవి నందినీధేనువు

యొక్క యడుగుజాడలలో పోవుచు దానిని శ్రుత్యర్థమును స్మృతి యనుసరించు నట్లనుసరించెనని వ్రాసినాడు.

"మా·ర్గం మనుష్యేశ్వర ధర్మపత్నీ
శ్రుతేరివార్థం స్మృతి రన్వగచ్ఛత్"

ఈవిధముగా బయలుదేరిన ధర్మగ్రంథములే గౌతమ ధర్మసూత్రములు, వసిష్ఠధర్మసూత్రములు, ఆపస్తంబ ధర్మ సూత్రములు, మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, పరాశర స్మృతిమున్నగునవి. ఈస్మృతులు వేదమునకు పిమ్మట వేదమంత ప్రమాణగ్రంథములు. తత్కర్తలు వేదవిదులై పూర్ణముగా వేదోక్తమైన జీవితమును నడపుకొనుచు, బ్రహ్మ సాక్షాత్కారము నొందినవారనునదియే ముఖ్యవిషయము. బుద్ధిచేతను, ఆచరణముచేతను వేదము నెఱిగినవారగుట చేత వీరిగ్రంథములు వేదమునకు పిమ్మట ప్రమాణములని చెప్పబడినవి. వీరిమాటలేకాక వీరిచేష్టలుకూడ మనకనుసర ణీయములే, ఈయర్థమును గౌతమధర్మసూత్రము

తద్విదాంచ స్మృతిశీలే (1–2)
అను సూత్రముచే నుడువుచున్నది.

దీనివలన నొక సందేహము గల్గును. వేదవిదులైన వారేమిచేసినను మనకు ప్రమాణమే యగునా ? యనునది.

శ్రుతిస్మృతులకు విరుద్ధముగా వీరుసాధారణముగా నేమియు చేయనిమాట వాస్తవమే కాని, యొకవేళ వారట్లు శ్రుతిస్మృత్యుక్తధర్మములకు వ్యతిరేకముగ సంచరించుచో మన మావిషయమున వారి ననుకరింపరాదని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. మహానుభావులకుగూడ ధర్మవ్యతిక్రమము, కొందరపాటు నుండవచ్చునని మనము గుర్తెఱుగవలయును. అట్టిపట్ల మనము వారి ననుసరింపరాదు.

"దృష్టో ధర్మవ్యతిక్రమస్సాహసంచ మహతాం.
నతుదృష్టార్థోఽవరదౌర్బల్యాత్" (గౌ. ధ. 1-3)

ఈ స్మృతికర్త లెంత మహాజ్ఞానులైనను, మానవులే; కావున వారివాక్యము సాక్షాదీశ్వరవాక్యమైన వేదముతో సమప్రమాణము కాజాలదు. అనగా: స్మృతివాక్యమేదియైన వేదమునకు విరుద్ధముగ గన్పట్టుచో నది ప్రమాణము కాజాలదు. ఈ యంశమును స్మృతికర్తలే మనకు చెప్పియున్నారు. వీ రహంకారమమకార రహితులైన మహాజ్ఞానులు. కావుననే యీవిధముగ తమన్యూనతను వేదఘనతను చెప్పుకొనినారు.

అంతియేకాదు: ఒకఋషి చెప్పినయంశమునకు మరొకఋషి చెప్పినది భిన్నముగనున్నచో నట్టిపట్ల తనమాటనే నమ్మవలయునని యేఋషియు నుడువుటలేదు. అట్లు భిన్నము

త్రైసవాసిలో దేనినైనను నాచరింపవచ్చునని యే స్మృతులలో చెప్పబడినది "ఇద్దరు ఋషులు చెప్పినది భిన్నముగ నున్నది, గావున నే నిం దెవ్వరిని ననుసరింపను" అని చెప్పుట తప్పనియే స్మృతులు కంఠోక్తిగ చెప్పుచున్నవి. మహర్షులు తుల్యబలముగలవారు. ఒకే స్మృతిలో రెండుమార్గములు సూచింపబడుచో నప్పుడు రెంటిలో నేదోయొకటి యనుసరించెయవచ్చు. అట్లే రెండు భిన్నస్మృతులలో రెండుమార్గములు సూచింపబడుచో నందేదైనను ననుసరింపదగినదే. దీనినే ఋషులు.

"తుల్యబలవిరోధే వికల్పః" (గౌ. ధ. సూ 1–4)

అని స్పష్టపరచియున్నారు. అట్టి వికల్పములుగల స్థలములలోగూడ మనము కేవలము స్వాతంత్ర్యము వహింపనక్కఱలేదనియు, నందేపక్షము మన కులగోత్రములలో మన పెద్దలచే నాచరింపబడుచున్నదో దానినే మన మనుసరింపవలయుననియు సంప్రదాయజ్ఞులునుడువుదురు. ఒకస్మృతి యొకవిధముగను నొకస్మృతి మఱొకవిధముగను చెప్పుచుండుటచే స్మృతుల కన్నిటికిని సున్నచుట్టవలయునని యాధునిక వాదము సర్వస్మృతి గర్హితము.

స్మృతులన్నియు ప్రమాణములే యైనను మనుస్మృతి లోకముచేతను, స్మృతికర్తలచేతను, పురాణేతిహాసప్రణేతలచేతను విశేషగౌరవమును పొందినది. ఇందులకు రెండు కారణములుగలవు. (1) ఇంత సమగ్రముగ ధర్మమును వివ

రించు స్మృతి మరొకటిలేదు (2) వేదార్థము నింతచక్కగా వివరించిన స్మృతి మరొకటిలేదు. ఈ రెండవకారణము చేతనే మనుస్మృతికి ప్రాధాన్యమని బృహస్పతిస్మృతి నుడువు చున్నది.

వేదార్థోప నిబంధృత్వాత్
ప్రాధాన్యంతు మనోః స్మృతౌ".

సామాన్యముగా మనుస్మృతియే సర్వోత్తమమైనను, కలియుగములోని విశేషధర్మములను చెప్పునది పరాశర స్మృతి యగుటచే, దానికి కలియుగములో నావిధమైన ప్రాముఖ్యము వచ్చినది. కలియుగప్రత్యేకధర్మములలో తప్ప, మిగిలిన విషయములలో మనుస్మృతి కగ్రస్థానము నిలచియే యున్నది కృతత్రేతా ద్వాపర కలియుగములలోని ప్రత్యేక ధర్మములను తెల్పుటలో నెన్నదగినవి క్రమముగ మను, గౌతమ, శంఖలిఖిత, పరాశర ధర్మశాస్త్రములని పరాశర స్మృతి చెప్పుచున్నది.

"కృతేతు మానవాః ప్రోక్తాః
త్రేతాయాం గౌతమాః స్మృతాః
ద్వాపరే శంఖలిఖితౌ
కలౌ పారాశరీస్మృతిః." (1-24)

ఒక్కవిషయమును జ్ఞప్తియం దుంచుకొనవలయును. పరాశరుడు కలియుగమునకై ధర్మశాస్త్రమును రచించినా డన నాతడు వైదికధర్మమును మార్చినాడని యర్థముకాదు. పూర్వధర్మములనే ప్రజ లాచరించువిధమును చూపుటకై

కొన్ని కట్టుబాట్లు చేసినాడు. ఏస్మృతికర్తయు కూడ ధర్మ మును మార్చుటకు పూనలేదు. అట్లు పూనువానికి స్మృతి చేయు నధికారమే పోవును. బుద్ధిచేతను, ఆచరణముచేతను వేదధర్మమును తెలిసికొనినవాడే స్మృతికర్తయగుట కర్హు డని పైన సూచితిమిగదా! మరియు మన్వాది స్మృతులు గూడ వేదార్థబోధకములే యనికూడ చూచియుంటిమి కదా! కావున వేదములు, మనుస్మృతి, పరాశరస్మృతి, గౌతమసూత్రములు మున్నగు సమస్త ధర్మగ్రంథములను పూర్తిగ ననుసరించుచున్నవాడు మాత్రమే స్మృతికర్త కాగలడు. పరాశరాదులందరు నట్టి శ్రుతిస్మృత్యుక్తజీవి తము గడిపినవారేకాని, తద్విరుద్ధముగ నడచుచు, తమకు తోచిన ధర్మములను చెప్పినవారుకారు.

పారంపర్యముగ ప్రమాణములుగ భావింపబడుచున్న ముఖ్యస్మృతుల నామము లీక్రింద నీయబడినవి. (1) మను స్మృతి (2) పరాశరస్మృతి (3) గౌతమధర్మసూత్రములు (4) వసిష్ఠధర్మసూత్రములు (5) శంఖస్మృతి (6) లిఖిత స్మృతి (7) ఆపస్తంబధర్మసూత్రము (8) అత్రిస్మృతి (9) విష్ణుస్మృతి (10) హారీతస్మృతి (11) యమస్మృతి (12)అంగిరస్స్మృతి (13)బోధాయనధర్మసూత్రము (14)ఉశన స్స్మృతి (15) సంవర్తస్మృతి (13) బృహస్పతిస్మృతి (17) కాత్యాయనస్మృతి (18) దక్షస్మృతి (19) వ్యాస స్మృతి (20) యాజ్ఞవల్క్యస్మృతి (21) శాతాతపస్మృతి.

## స్మృతిసమములు.

అతీంద్రియవిషయద్రష్టలైన మహర్షులు, పైన తెల్పబడిన ధర్మశాస్త్రగ్రంథములనేకాక, యితరములనుగూడ రచించియున్నారు. సాధారణముగ స్మృతిశబ్దము ధర్మశాస్త్రములకే చెల్లుచున్నను, మహర్షులు వ్రాసిన గ్రంథముల నన్నిటినిగూడ స్మృతులని వ్యవహరించుటకూడకలదు. ఋషులచే రచింపబడిన యీయితరగ్రంథము లెవ్వియన:– శ్రౌతసూత్రములు, గృహ్యసూత్రములు, మంత్రతంత్రశాస్త్రగ్రంథములు, ఆగమములు, ఇతిహాసములు, పురాణములు మున్నగునవి. శ్రుతిస్మృతులలో సూచింపబడిన సోమయాగాదిక్రతువులు, దర్శపూర్ణమాసేష్టులు మున్నగువాని విధానములను తెల్పునవి శ్రౌతగ్రంథములు. శ్రుతిస్మృతిసూచితములైన జాతకర్మనామకరణాన్నప్రాశనచౌలోపనయవివాహాదికర్మకాండ విధానమును తెల్పునవి గృహ్యసూత్రములు. సులభమైన మార్గములో దేవతలను మెప్పించి వారివలన నైహికాముష్మికలాభములను మోక్షమునుగూడ నందుటకుగల విధానమును వివరించునవి మంత్రతంత్రగ్రంథములు. దేవాలయనిర్మాణవిధానాదులను తెల్పునవి యాగమములు. సృష్టిక్రమమును, ఈశ్వరమహిమను ప్రధానముగ తెల్పునవి పురాణములు. స్మృతులలో నాదేశింపబడిన ధర్మములు మానవుని జీవితములో నెట్లనుసరింపబడవలయునో, భిన్నధర్మములకు సంఘర్షణ కలిగినపుడు మానవు డెట్లు

ప్రవర్తింపవలయునో, యనునంశములను విపులముగ దెల్పుచు ధర్మమునం దాసక్తియు, నధర్మమునందు ద్వేషమును పాఠకునకు గల్గించువిధమున రచింపబడినవి. యితిహాసపురాణములు.

ఇ తి హా స పు రా ణ ము లు.

హిందూమత మింతవరకు నీవిధముగ నిలువగల్గుటకును, నికముందుగూడ నిది నశింపదని యూశించుటకును కారణములైనవి యితిహాసపురాణములు. వైదికధర్మముపట్ల మానవుని బుద్ధిని బలాత్కారముగ ద్రిప్పి దానియందు మానవుడు ప్రవర్తించునట్లు వానిని నడపునట్టి కొరడాలవంటి గ్రంథములు ఇతిహాసపురాణములు. ప్రపంచములోని క్రైస్తవమహమ్మదీయాది మతములన్నియు సత్కర్మలనే యాదేశించుచున్నవి. మతములన్నియు సత్యము పల్కవలెననియు, భగవంతుని సేవింపవలెననియు, వ్యభిచారము కూడదనియు నుడువుచున్నవి. అట్లయినను సత్యసంధత, భక్తి, పాతివ్రత్యమున్నగు నుత్కృష్టధర్మములు హిందూదేశములో నున్నంత హెచ్చుగ ప్రపంచములో మరెక్కడను లేవు. నేటికి 1500 సంవత్సరముల క్రిందట మన దేశమునకు వచ్చిన ఫాహియన్ అను నొకచైనా దేశీయు డిట్లు వ్రాసియున్నాడు. "హిందువులెల్లరు సత్యసంధులగుటచే వారిగృహముల కెన్నడును తాళము లక్కరలేదు; ఋణాదికములకు పత్రములుకూడ వారికక్కరలేదు." అరియన్ అను నొకగ్రీసు దేశస్థుడు "హిందువు డెన్నడును నసత్యమాడినట్లులేదు"అనివ్రాసియున్నాడు.

మన దేశపు వర్తకులతో వ్యవహారము చేసిన ప్రాచీన విదేశ వర్తకులు "హిందూదేశములో వర్తకులుగూడ నసత్యమాడ"రని యాశ్చర్యముగ నుడివినారు. ఈవాక్యములలో కొంత యతిశయోక్తి యుండవచ్చును, కాని జాతి మొత్తముపైన భారతీయు లెంతసత్యసంధులో దీనివలన తేలగలదు. మతములన్నియు సత్యసంధతనే బోధించుచున్నను నొక హిందుమతస్థులే హెచ్చుగ సత్యసంధులగుటకు కారణము మన మతములో ఇతిహాసపురాణము లుండుటయు వారికి లేకుండుటయే. మానవు నసత్యమునుండి మరలించుటకు హరిశ్చంద్రుని కథ యొక్కటియే చాలును.

ప్రహ్లాదచరిత్రను చదివినపిమ్మట మహాభక్తులుగ మారినవారు మనలో నెందరులేరు ? మానవుని చిత్తవృత్తిని మార్చుటలో గారడివానివలె పనిచేయగలది ప్రహ్లాదచరిత్ర. నేటికిని మన దేశములో నితర దేశములన్నిటిలోను గలపినను గన్పట్టనంతమంది మహాభక్తులు, విరాగులు, సాధువులు, సన్యాసులు గన్పట్టుటకు కారణ మిట్టిపురాణగాథలే యనుటలో నతిశయోక్తి లేదు.

నేటి భారతీయస్త్రీలకుగల్గు పాతివ్రత్యము ప్రపంచములో నేజాతిస్త్రీలకును లేదని యెల్లరు నంగీకరించుచున్నారు. పాతివ్రత్యమను నీయుత్కృష్టధర్మమును లోకములో నింత దృఢముగ నిలబెట్టినవి యితిహాసపురాణములే.

సీత, సావిత్రి, దమయంతి మున్నగు సతీమతల్లుల పవిత్ర నామమును స్మరించి వారిచరిత్రలను నిత్యము పురాణరూపమునను, పాటలరూపమునను, కథాదిరూపమునను వినుచుండుట చేతనే మన సతీమతల్లులు తమ శీలమును లోకమునకంతటికిని నాదర్శప్రాయమగు విధమున నడపుకొనుచున్నారు. ప్రతిహిందూస్త్రీయొక్క హృదయసీమయందును రాజ్యము చేయుచు నామె చిత్తవృత్తులను నడపించునది సీత. ప్రతిస్త్రీకిని కష్టాంధకారములో నాశాజ్యోతిని కన్పరచువారు సావిత్రి, చంద్రమతి మున్నగు పావన నారీమణులు.

హిందూధర్మరక్షణవిషయమున నితిహాసపురాణముల ప్రభావ మింతింతయని చెప్పజాలము. విధినిషేధరూపమున నెన్నిధర్మములు స్మృతులలో బోధింపబడగలవు ? కొన్ని ప్రత్యేక క్లిష్టపరిస్థితులలో, కొన్ని ధర్మసూక్ష్మసందేహములు పొడసూపుచుండును. ఆధర్మసూక్ష్మములు మానవుని జీవితము నుదాహరణముగ తీసికొని కథారూపమున ప్రదర్శించినపుడే బోధపడగలవు. అట్టిధర్మసందేహములను ప్రదర్శించుటకును, తీర్చుటకును ఇతిహాసపురాణములే తగినవి.

నాల్గువేదములలోని ముఖ్యధర్మములును ఇతిహాసపురాణములలో బాగుగా వివరింపబడినవని యీక్రింది పురాణవాక్యమువలన తెలియగలదు.

'ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్.'

శ్రుతిస్మృతులలోనున్న సమస్త ముఖ్యధర్మములును ఇతిహాసపురాణములలో లభింపగలవనుటలో నతిశయోక్తి లేదు. అందునను సమస్త ధర్మరత్నములకును మహాభారతము సముద్రము. వేదములను చదువుట కర్హతలేని స్త్రీలు, శూద్రులు, సంస్కార రహితులైన ద్విజకులోత్పన్నులు వేదములోని ధర్మములను తెలిసికొనగల్గుటకై వ్యాసమహాముని యీగ్రంథమును రచించినట్లు భాగవతములోని యీ క్రిందిశ్లోకములో చెప్పబడినది.

"స్త్రీ శూద్రద్విజబంధూనాం, త్రయీ నశ్రుతిగోచరా
ఇతి భారత మాఖ్యానం, కృపయా మునినా కృతం."

కావున హిందూజన సామాన్యములో ధర్మమును, దైవభక్తిని నేటికిని నిలబెట్టుచున్న రామాయణ భారతములును, ఈక్రింద పేర్కొనబడిన అష్టాదశ పురాణములును, అష్టాదశోప పురాణములును ప్రజలలో నింకను హెచ్చు వ్యాప్తిలోనికి తెచ్చు బాధ్యత హిందూధర్మాభిమానుల పైన కలదు.

పురాణములు: 1 భాగవత, 2 పద్మ, 3 విష్ణు, 4 నారద, 5 వరాహ, 6 గరుడ, 7 బ్రహ్మాండ, 8 బ్రహ్మ, 9 బ్రహ్మవైవర్త, 10 మార్కండేయ, 11 భవిష్య, 12 లింగ, 13 వామన, 14 శివ, 15 స్కాంద, 16 అగ్ని, 17 మత్స్య, 18 కూర్మ—సంజ్ఞలుగలవి.

ఉపపురాణములు : 1 సనత్కుమార, 2 నరశింహ, 3 బృహన్నారదీయ, 4 శివరహస్య, 5 దూర్వాస, 6 కపిల, 7 వామన, 8 భార్గవ, 9 వారుణ, 10 కలికి, 11 సాంబ, 12 నంది, 13 సూర్య, 14 పరాశర, 15 వసిష్ఠ, 16 దేవీ భాగవత, 17 గణేశ, 18 హంస—సంజ్ఞలు కలవి

సదాచారము.

ధర్మ మపారము. మనకిపుడు లభించు శ్రుతిస్మృతీతిహాసపురాణవాఙ్మయము పరిమితము. కావున శ్రుతిస్మృత్యాదుల వలన కొన్నిధర్మములను తెలిసికొ'నుటకు వీలులేకుండుట సహజము. మహర్షులు వ్రాసియుండిన ధర్మగ్రంథములు కొన్ని నశించియుండును. మరియు మహర్షులు కొన్ని ధర్మములను గ్రంథస్థముచేయక స్వీయాచరణపూర్వకముగ పుత్రశిష్యాదుల కందచేసి యుండిరి. ఆధర్మములే నేటికిని శిష్టాచారరూపమున లోకములో గన్పట్టుచున్నవి. ఇవియు ప్రమాణములే. వేదశాస్త్రోక్తజీవితమును గడపుచు నిష్కాములై సంచరించు మహాపురుషులనుండి యీసదాచారము గ్రాహ్యము.

మఱియు శ్రుతిస్మృతులలో భిన్నములుగ గన్పట్టు ధర్మములపట్ల వికల్పము నవలంబింపవచ్చునని పైన తెల్పబడినదికదా ! మన మావికల్పమును వినియోగించుకొనుటలో శిష్టాచార మేపక్షమున నున్నదో, దానినే యనుసరింపవలయును. "మహాజనో యేన గతస్సపంథా" అనుదాని

కిదియే యర్థము. "ఆచారః ప్రథమోధర్మః శ్రుత్యుక్తః స్మార్తయేవచ" (శ్రుతిస్మృత్యుక్తమైన శిష్టాచారమే మొదటిధర్మము), అని మనుస్మృతికూడ చెప్పుచున్నది.

వేదమునకు విరుద్ధముకాని స్మృతినిబట్టి, దాని కాధారమగు శ్రుతి యుండవలయునని యెట్లూహింతుమో, యట్లే శ్రుతి స్మృతులకు విరుద్ధముకాని సదాచారమునుబట్టి దాని కాధారమగు శ్రుతి యుండవలయునని యనుమానింతుము. కాని శ్రుతిస్మృతులకు విరుద్ధముగనున్న యాచారమునుబట్టి దానికి శ్రుతియుండవలయునని యూహించుటకు వీలులేదు. ఈయంశము నీక్రింది అపస్తంబ ధర్మసూత్రము తెల్పుచున్నది.

శ్రుతిర్హి బలీయస్యానుమాని కాదాచారాత్.

[ఆ. ధ. సూ. 1-4-8]

కొన్ని దేశములలోను, కొన్ని జాతులలోను, కొన్ని కులములలోను కొన్ని యాచారము లుండును. ఆ యాచారములు శ్రుతిస్మృతులకు విరుద్ధములుకానిచో నవియు నా దేశజాతి కులములవారికి ప్రమాణములే యని గ్రహింపనగును.

దేశజాతి కులధర్మాశ్చామ్నా
యైరవిరుద్ధాః ప్రమాణం. [గౌ. ధ. సూ. 11-20]

## ఆత్మతుష్టి.

ఇట్లు హిందూమతమునకు వేదము ప్రమాణము; వేదమునకు పిమ్మట స్మృతులు ప్రమాణము; పిమ్మట స్మృతి సమ

ములైన శ్రౌతసూత్ర గృహ్యసూత్రాదులు, ఇతిహాసపురాణములు ప్రమాణము; పిమ్మట సదాచారము ప్రమాణము. పై యంశములను జూడ, మానవున కేమియు ధర్మనిర్ణయ స్వాతంత్ర్యము లేదని తెలియగలదు. శ్రుతిస్మృతి సదాచారము లేవిషయమై యేమియు చెప్పుటలేదో, యావిషయములో మాత్రమే మానవుడు తన యిచ్ఛవచ్చినట్లు సంచరింపదగును. అట్టిపట్ల తనకు మనస్తుష్టి కల్గువిధమున ప్రవర్తింపక వ్యర్థముగ శ్రమకల్గునట్లు ప్రవర్తించుచో నది యధర్మమే యగును. వృథా క్లేశము తమోలక్షణమని భగవద్గీతాది గ్రంథములు చెప్పుచున్నవి. తనశక్తినిబట్టియే, యేకర్మనైనను, చేయుటకు మానవుడు పూనవలయును. కాని శక్తికి మించిన పనిపూని తన్ను తాను హింసించుకొనరాదని

'అనుబంధం క్షయం హింసామనపేక్ష్యచ పౌరుషం
మోహాదారభ్యతే కర్మ తత్తామసముదాహృతం'
(18-25)

అను గీతాశ్లోకమువలన తెలియుచున్నది. ఇట్లు శరీరమును క్లేశపెట్టుకొనకుండుట, అనాయాసమను ఉత్తమగుణమని గౌతమధర్మసూత్రము (8-22) చెప్పుచున్నది.

శ్రుతిస్మృతి సదాచారములు వికల్పమును వదలినపట్లకూడ, మానవుడు తన కేపక్షము సుఖముగా నాచరించుటకు వీలుగా నుండునో యాపక్షమునే తీసికొనవలెను.

లేనిచో నది తమోగుణ మగును. కనుక ఆత్మతుష్టియు ధర్మలక్షణముగ చెప్పబడినది.

ప్రమాణముల యీక్రమము మనుస్మృతిలో సంగ్రహముగ నిట్లు చెప్పబడినది.

వేదః స్మృతి స్సదాచారః స్వస్యచ ప్రియామాత్మనః
ఏతచ్చతుర్విధం ప్రాహుః, సాక్షాద్ధర్మస్య లక్షణం
(మను 2-13)

## ఉపసంహారము.

పండితులందరు నొకపరిషత్తుగ నేర్పడి నేటికాలమున కవసరమగు మార్పులను ధర్మములో గావింపవలెననియు అట్టి పరిషత్తులు పూర్వముకూడ నుండినిట్లు మన్వాది స్మృతుల వలన నే తెలియుచున్నదనియు నేటివారు కొందరు చెప్పుచున్నారు. ఇది భ్రాంతిమూలకము. మనువు శిష్టపరిషత్తులను పేర్కొనినమాట వాస్తవమే కాని యాశిష్టపరిషత్తునకు ధర్మములో మార్పు చేయుట కధికారములేదని యాతడే చెప్పుచున్నాడు. మనువు ధర్మములనుచెప్పి, గ్రంథాంతమందు తానుచెప్పినవికాక యింకను ధర్మములుగలవనియు, తాను పూర్ణముగ నన్నిధర్మములను చెప్పినట్లు భావించి, యెవ్వరును మనుస్మృతిలో చెప్పబడనిపట్ల స్వేచ్ఛగ ప్రవర్తింపవచ్చునని తలంపరాదనియు, నితర ధర్మములను వేదశాస్త్రవిదులై నిష్కాములైన పండితుల నడిగి తెలిసికొనవలెననియు చెప్పినాడు. అట్టి చెప్పబడని ధర్మములను తెలిసి

కొనుటకే శిష్టపరిషత్తు లుపకరించును. శ్రుతిస్మృతిసదాచార రూపధర్మసందేహములను తీర్చుటకుకూడ నట్టిపరిషత్తులు సాయపడునని వేరుగ చెప్పనక్కఱలేదు. కాని ధర్మమును మార్చుటకు కాదని యీక్రింది శ్లోకమువలన తెలియగలదు

అనామ్నాతేషు ధర్మేషు కథంస్యాదితిచేద్భవేత్
యంశిష్టా బ్రాహ్మణా బ్రూయు, స్సధర్మస్స్యాదశంకితః.
(మను 12–108)

ఇచట "అనామ్నాతేషు ధర్మేషు" అను పదములకు "చెప్పబడని ధర్మములలో" అని యర్థము. వేదశాస్త్రము లలో చెప్పబడిన ధర్మములను మార్చుట కెవ్వరికి నధికారము లేదు. ఇదియే ధర్మముయొక్క కట్టుబాటు. ఇట్టి నియమము లేనివి శృంఖలనృత్తి యధర్మమని సమస్త హిందూధర్మ గ్రంథసాగరమును మథింపగ దేలిన సారామృతము.

అధ్యాయము ౨.

# నవయుగము



## రెండుమార్గములు.

హిందూమతమును రక్షించుటకు రెండువిధములైన యుపాయములు నేడు సూచింపబడుచున్నవి. శ్రుతిస్మృతీతిహాసపురాణ సదాచారముల ప్రచారముల నిప్పటికంటె లోకములో హెచ్చుగ వ్యాపింపచేయవలెననియు, సంధ్యావందనాదికర్మలను, ఆర్యసంప్రదాయములను దేశములో హెచ్చుగ వ్యాప్తిలోనికి తేవలెననియు కొందఱు చెప్పుచున్నారు. ఇట్లు చెప్పువారిని హిందూమత పునరుజ్జీవన వాదులని చెప్పవచ్చును. హిందూమతధర్మములు నేడాచరించుటకు కష్టముగ నున్నవనియు, కర్మకాండను కొంతవఱకుగాని, పూర్తిగాకాని తగ్గించివేయవలెననియు, ప్రజలకు నిగ్రహశక్తి తగ్గిపోవుటచే స్త్రీ పునర్వివాహాది విషయములలో కొంత సడలింపును గల్గింపవలెననియు, స్వేచ్ఛాస్వాతంత్ర్యసౌభ్రాత్రములను సిద్ధాంతములపై నాధారపడియున్న యాధునికనాగరకతలో వర్ణభేదములను రూపుమాపవలెననియు, స్త్రీ స్వాతంత్ర్యము, రజస్వలావివాహము మున్నగువానిని బాహాటముగ నంగీకరింపవలెననియు మరికొందరు చెప్పు




చున్నారు. వీరు పునర్నిర్మాణవాదులు, లేక సంస్కరణ వాదులు. పునరుజ్జీవన విధానమున కాంగ్లమున Revival అని చెప్పవచ్చును. సంస్కరణ విధానమును Reform అని నుడువదగును.

మతమెప్పుడును ఉత్కృష్టధర్మమును బోధించును. మనము నికృష్టులమై యాధర్మము నాచరింప లేనపుడా ధర్మమును గూడ నికృష్టస్థితిలోనికి దింపరాదు. పాశ్చాత్య దేశములలోని క్రైస్తవులు ఘోరసంగ్రామములో దగు లొక్కని, దారుణమైన హింసను సల్పుకొనుచుందురు. వారి మతగ్రంథమగు బైబిలన్నో అహింసను బోధించుచున్నది. ఒక చెంపమీద నెవ్వరైన కొట్టినచో, రెండవచెంపనుగూడ చూపవలెనని బైబిలు చెప్పుచున్నది. తమ యాచరణము నకును తమధర్మమునకును, వ్యత్యాసమున్నదను కారణ మున నేయొక్క క్రైస్తవుడైనను మతమును దిద్దుటకుగాని, సంస్కరించుటకుగాని యత్నించుచున్నాడా? అట్లే మహమ్మ దీయు లందరు తమమతగ్రంథములో చెప్పబడిన ట్లాచరించు చున్నారా? ఆచరింపనంతమాత్రమున తమ మతమును మార్చుకొనవలె ననుచున్నారా? అట్టిచో నొక్క హిందువులే మతమును మార్చుకొనవలెననుట వింతగ లేదా?

మతమును సంస్కరించుకొనవలెనను విచిత్రమగు నాం దోళనమును హిందువులే లేవతీయ[illegible] విచారించి చూతుమేని, ప్రామాణ్యము లేని గ్రంథములయొక్క

కారణముయొక్క స్వరూపమని తెలగలదు. మనలో పాశ్చాత్యవిద్య నభ్యసించినవారి కనేకులకు మన మతగ్రంథములగు శ్రుతిస్మృతులయందు విశ్వాసము లేదు. ఈ 20 వ శతాబ్దములో నట్టి మూఢవిశ్వాసములు పనికిరావని వారందురు. కాని 20 వ శతాబ్దపు నాగరకత మన కేపాశ్చాత్యదేశముల నుండి వచ్చినదో, యాదేశములలోనే, మన కీమతవిశ్వాసమును పారద్రోలిన పాశ్చాత్యవిద్యకు గురువులైన పాశ్చాత్య పండితులకే, యీ మూఢవిశ్వాసము నేడుండుట గమనింపదగిన యంశము.

ఈ 20 వ శతాబ్ద పిశాచము మనలనె పట్టుకొనినది కాని పాశ్చాత్యులను పట్టుకొనలేదు. వారి మతవిశ్వాసమునకు 20 వ శతాబ్దము గాని, నవనాగరికతగాని, రాజకీయ వికాసముగాని యడ్డురాలేదు. నేడు పాశ్చాత్య దేశములలో మహారాజ్యతంత్ర ప్రవీణుడైన యేక్రైస్తవుని యొద్దకైన నేగి "బైబిలననేది?" యన నాయన "బైబిలు భగవద్దత్తము" అని సమాధానము చెప్పును. "ఏసుక్రీస్తు ఎవ" రన "దేవునికుమారుడు" అనును. అట్లే నవనాగరకతామూర్తి యని చెప్పదగిన యే ముస్లిమునాయకుని యొద్దకైన నేగి "కొరాన్ అననేమి? మహమ్మద్ ఎవరు?" అని ప్రశ్నించుచో నాతడు వెంటనే "కొరాన్ దేవుని వాక్యము. మహమ్మదు భగవంతునిచే పంపబడిన ప్రవక్త" యని సమాధానము చెప్పును. వారి రాజకీయ ప్రావీణ్యముగాని, నవనాగ

రకతగాని, 20 వ శతాబ్దము కాని యిట్లు మత గ్రంథము లందును, మత ప్రవక్తలయందును విశ్వాసమును ప్రకటించుట కడ్డువచ్చుటలేదు. మనహిందూ సంఘమునకు చెందిన యే రాజకీయ నాయకునియొద్దకైన నేగి "వేదము లెట్టివి? శ్రీ రాము డెవరు?" అని యడుగుడు. వెంటనే యాతడు "వేదము లొకప్పు డానాటి బుద్ధిమంతులచే నానాటి కుపయోగపడు విధమున రచింపబడినవి. శ్రీరాముడును మనవంటి మానవుడే కాని కొన్ని యుత్కృష్టగుణము లాతనియందున్నవి" అని సమాధానము చెప్పును. వేద మీశ్వరదత్తమని నుడువుట కాతడు సిగ్గుపడును. రాము డవతారపురుషుడని చెప్పుట కాతడు సంకోచించును. ఏ యితర మతస్థులకును లేని బిడియము మన కేల యుండవలెనో తెలియకున్నది. మన హిందూ సంఘమున నాయకత్వము నహించిన వారిలో చాలమంది యిట్లే యున్నారు.

మతగ్రంథములలో వాస్తవముగా నమ్మకము లేని వారే చాలమంది కలరు. నమ్మకముండినను పైకి చెప్పుటకు భయపడువారు కొందరు కలరు. ఇతర మతస్థులందరు నాయా మతగ్రంథము లీశ్వరదత్తములని నిస్సంకోచముగా నెట్లు చెప్పుచున్నారో, యట్లే మనవారును వేదము లీశ్వరదత్తము లనియుఁ శ్రుతిస్మృతులు పరమ ప్రమాణములనియు చెప్ప గల్గిననాడే మతమునకు నిజమైన యుద్ధరణము గల్గును. ప్రమాణములేని మతమేదియు నింతవరకు ప్రపంచములో

విలసిల్లి యుండలేదు. హిందూమతగ్రంథములయందు విశ్వాసము లేకుండినను గూడ, హిందువులమని చెప్పుకొనుట హాస్యాస్పదము. హిందూమతము విశాలమైనదనియు నిందు సంకుచితభావము లేదనియు నుడువుట నేటి మన విద్యార్థికులలో నొకవిలాసము (ఫేషను) అయినది హిందువు డనిపించుకొనుటకిట్లే నడచుకొనవలెననికాని, యిట్లు నడచుకొనగూడదనికాని నియమము లేదనియు హిందూమతము విశ్వసంగ్రాహి (Catholic) యనియు, వీరు నుడువుచున్నారు. ఇట్లు చెప్పువారు హిందూమతముయొక్క మూలసూత్రములనైన నెఱుగక హిందూమతమునకు మహాపచారముచేయు పండితమ్మన్యులో లోకవంచకులో యై యున్నారు.

హిందూ ధర్మగ్రంథమని చెప్పదగిన యేగ్రంథమును తీసికొనినను, నది విధినిషేధవాక్యములతో నిండియుండును. శ్రుతిస్మృతులలో మానవుని ప్రవర్తనమునకెట్టి స్వాతంత్ర్యము నంగీకరింపబడలేదు. బ్రాహ్మముహూర్తమున లేచినది మొదలు రాత్రి శయనించువఱకుగల సమస్త ముఖ్యకార్యములును శాస్త్రములందాదేశింపబడి యున్నవి. శాస్త్రములందు చెప్పబడనిపట్ల కూడ మనకు పూర్ణస్వాతంత్ర్యము లేదు. అట్టిపట్ల శిష్టాచారము ప్రమాణము. శ్రుతి స్మృతి సదాచారము లడ్డురానిపట్లనే మనకు సాతంత్ర్యము కలదు.

హిందూమతము పేర స్వేచ్ఛాచరణమును బోధించుట యత్యంతము గర్హ్యము. నేఁడు నవనాగరకుల జేబులలో గూడ గన్పట్టు భగవద్గీత యీస్వేచ్ఛాచరణమును తీవ్రముగ గర్హించుటలేదా ? గీతశాస్త్రప్రామాణ్యమును నొక్కి చెప్పుచున్నది. అర్జునుఁడు యుద్ధముచేయుట తనకు తప్పుగ తోఁచినదని చెప్పినపుడు శ్రీకృష్ణపరమాత్మ యర్జునునితో, "నీకు తోఁచుట లెక్కలోనిదికాదు. శాస్త్రమేమి చెప్పుచున్నదో చూడుము. క్షత్రియునకు ధర్మయుద్ధము కర్తవ్యము. కావున శాస్త్రము ననుసరింపుము" అని బోధించినాఁడు. కర్తవ్యాకర్తవ్య నిర్ణయమునందు నీకు శాస్త్రమే ప్రమాణమని గీత స్పష్టముగ నుడువుచున్నది. "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ" (16-24)

వేదముకాని, మరి యేయితరగ్రంథముగాని మానవుని స్వేచ్ఛాప్రవృత్తి నంగీకరించుట లేదు. మన మతగ్రంథములన్నియు శాస్త్రోక్తాచరణమును విధించుచు, దానిని తప్పుచో నరకప్రాప్తియే యని కంఠోక్తిగ నుడువుచున్నవి. కావున నితరమతస్థులనో, నవనాగరకులనో మెప్పించుటకై మనవారెవ్వరును హిందూమతము స్వేచ్ఛాస్వాతంత్ర్యములకు తావొసగుననియు, నందువలన హిందూమతము విశాలమైనదనియు విశ్వసంగ్రాహి (Catholic) యనియు నుడువకుందురుగాక ! విధినిషేధములు లేని మతమనగా నాస్తికమతమని యే యర్థము. అట్టి నాస్తికమతమే మన మతమని

గర్వించు ప్రాజ్ఞులనుజూచి హిందూమతస్వరూపము నే యించుక గ్రహించినవారికైనను, జాలి కలుగకమానదు.

ఒకవిషయములోమాత్రము హిందూమతము విశాలమైనదే. భగవదారాధనవిషయమై యది హద్దుల నేర్పరచుటలేదు, తమతమ మనశ్శక్తి సామర్థ్యమునుబట్టి భగవంతునెవ రేవిధముగనైనను భావింపవచ్చును; ఏవిధముగనైనను అర్చింపవచ్చును. "భగవంతు డిచ్చట నే యుండును; ఈవిధముగ నే యాతని పూజింపవలయును; మరొకవిధముగ పూజింపరాదు." అను హద్దులను హిందూమతము విధింపదు. ఎవడు భగవంతు నేస్వరూపములో నర్చించినను భగవంతుడు సంతుష్టు డగును. తన పూర్ణస్వరూపమును భక్తుడు గుర్తించినపుడు మాత్రము భగవంతుడు పూర్తిగ సంప్రీతు డగును. ఏ దేవత నెవ డేవిధముగ నారాధించినను, అది భగవదారాధన మే యగును.

"ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి"
"యేప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః
తేపి మామేవ కౌన్తేయ యజంత్యవిధిపూర్వకం"

మున్నగువాక్యము లీభావము నే తెల్పుచున్నవి. భగవదారాధనవిషయమునకై క్రైస్తవులనుగాని, మహమ్మదీయులనుగాని హిందూమతము నిందింపదు. వారు భగవంతునిపట్ల నిం

కను విశాలమైన భావమును పొందవలెనని హిందూమతము కోరును, కావున భగవద్విషయములో హిందూమతము విశాల మైనదనియు, విశ్వసంగ్రాహియనియు నుడువుటలో నాక్షేపము లేదు. హిందూమతములోని భగవదారాధన విధానములు మానవమన స్తత్వముపైనను, భగవంతుని యనంతరూపలక్షణ విశ్వాసముపైనను నాధారపడియుండుట చేతను, ప్రపంచములోని యితర మతములవిధానములు వీనిలో నిముడవలసినవే యగుటచేతను కాలము గడచిన కొలదియు హిందూమతములోని యీ ఘనతను ప్రపంచము లోని విజ్ఞానవంతు లెల్లరు గుర్తించి గౌరవింపక తప్పదు.

## నవీనవిజ్ఞానానుకూల్యము.

హిందూమతములోని యేయంశము తీసికొనినను, అది ప్రకృతిశాస్త్రములకు (సైన్సులకు) అనుగుణమేయై యుండుటగూడ నీమతమునకు భవిష్యత్ప్రపంచములో గలుగ గలయున్నతస్థానమును వ్యక్తపరచుచున్నది. సైన్సుయొక్క యభివృద్ధి మతమునకు భంగకరమనునది యితరమతముల విషయమున చెల్లిన చెల్లవచ్చును, గాని హిందూమతము మాత్రము సైన్సు వలనను నవీన విజ్ఞానము వలనను తన మహత్త్వమును లోకమునకు హెచ్చుగ చాటుకొన గలద నుట తథ్యము. ఈనాడు సైంటిస్టులు కనిపెట్టిన రహస్యముల నెన్నిటినో మనపూర్వులు కనిపెట్టి మత గ్రంథములలో వెలడించియున్నారు.

తరుగుల్మలతాదులకుకూడ సుఖదుఃఖానుభవ మున్న దనియు, నది పైకి కన్పట్టకపోయినను లోలోన జరుగుచున్న దనియు మన శాస్త్రములు చెప్పినవి.

అంతస్సంజ్ఞా భవంత్యేతే సుఖదుఃఖసమన్వితాః మను-(1-49)

మొన్న మొన్నటివఱకును సైంటిస్టులకీసంగతి తెలియలేదు. శ్రీ జగదీశచంద్రబోసుగారు నవీనశాస్త్రముల యాధారముచే నీయంశమును రుజువుచేసిన వారిలో ప్రథముడు. బోసుగారివంటి సైన్ టిస్టులు బయలుదేరిన కొలదియు, హిందూమతములోని సత్యములు బయట పడుచుండును.

మానవుడు జీవించియుండగా వానిగుండె యాగిపోదని పాశ్చాత్య శరీరశాస్త్రజ్ఞులు, వైద్యులు తలంచుచుండిరి. వేలకొలది సంవత్సరముల క్రిందట మన దేశములో రచింపబడిన యోగశాస్త్ర గ్రంథములలో నది సాధ్యమే యని చెప్పబడినది. నేటికిని హఠయోగులు కొందరు దానిని మనకు ప్రత్యక్షముగ గన్పఱచుచున్నారు. పాశ్చాత్య విజ్ఞానము హిందూవిజ్ఞానమునుండి నేర్చుకొన వలసినది చాల కలదనుట కిట్టి వెన్నియో సాక్ష్యములు కలవు.

గంగానది పవిత్రమైనదిగ హిందువులచే తరతరములనుండి భావింపబడుచున్నది. ఏదో యొకింత పాశ్చాత్య విజ్ఞానము నార్జించిన మన యువకు లిట్టి నమ్మకములను పరిహసించుటను చూచుచున్నాము. కాని యీనడుమ ఫ్రాంసు దేశమునుండి యొక సైన్ టిస్టు వచ్చి గంగాజలమును పరీక్షించి యందు చాల విశేషముగలవనియు. కలరాపురు

గులనుగూడ నిర్వీర్యము చేయుశక్తి యందుగలదనియు చెప్పెను. ఆదొరగారు చెప్పిన పిమ్మట మనవారికి గంగా జలముపై గౌరవము గల్గినది. కాని గంగోదకము భౌతిక మహత్త్వము గలదనియే కాని, యది మానసికముగను, అధ్యాత్మికముగను గూడ పావనమని నమ్ముట యెట్లని యడుగువారుకూడ కలరు. ఒక ఫ్రెంచి సైన్‌టిస్టు ఇంత కాలమునకు బయలుదేరి దాని భౌతికమహత్త్వమును గనిపెట్టినట్లే, మరొక సైన్‌టిస్టు ముందుబయలుదేరి దాని యలౌకికశక్తులను గనిపెట్టవచ్చును. నవీన 'సైన్సు' ఇంకను పూర్తికాలేదు. ప్రతిదినము తన్నుతాను దిద్దుకొనుచు నభివృద్ధి నందుటకు యత్నించుచున్నది. ఈనాడు దానికి తెలియని సంగతులు రేపు తెలియవచ్చును. దానిలో లేని వన్నియు నసత్యములనువారు షేక్స్పియరుయొక్క యీక్రింది వాక్యమును జ్ఞప్తికి తెచ్చుకొనవలెను.

There are more things in heaven and earth, Horatio,
Than are dreamt of in our Philosophy.

హిందూమత విజ్ఞానములోని సత్యములు క్రమక్రమముగ సైన్సువలన ప్రపంచమునకు ఋజువగుచున్నపుడు గూడ, నింకను తొందరపడి ప్రస్తుత సైన్సున కందనివన్నియు నసత్యములని త్రోసివైచుటకంటెను నవివేక ముండదు.

మనవారు ఋజువులను చెప్పక విధులరూపమున మన కాదేశించిన మహాసత్యము లన్నియు క్రమముగ సైన్సు

యొక్క అంగీకారమును పొందుచున్న ననునదియే హిందూ మతమున కనుకూలమగు గొప్పబలము.

రాత్రి పరుండునపుడు శిరస్సును తూర్పుదిక్కుగ నుంచవలెననియు, దక్షిణముగనుంచుట యొకమాదిరిగ మాత్రమే మంచిదనియు మనపురాణములు చెప్పుచున్నవి. ఇట్టివానిని పుక్కిటి పురాణములని నవీనులు కొట్టివైచుచున్నారు. కాని నవీనశాస్త్రము లిట్టివిధుల కెంతయనుకూలముగ నున్నవో వారు పరికింపరు. కొందరు సైన్‌టిస్టు లీపైన తెల్పిన విధిని పరిశీలించియున్నారు. భూమిపై ప్రసరించు విద్యుచ్ఛక్తిప్రవాహముల గమనికనుబట్టి, రాత్రి తూర్పుగా తలనిడి శయనించు వానికి తెల్లవారునప్పటికి, ఉష్ణతీవ్రత తగ్గి బుద్ధివైశద్య మేర్పడుననియు, దక్షిణముగ తలనిడి శయనించు వాని శరీరమునకు బలముగల్గుననియు సైన్‌టిస్టులు కనుగొనిరి. ప్రాక్ఛిరస్కుడై శయనించువాడు పండితుడగు ననియు, దక్షిణ శిరస్కుడై శయనించువా డారోగ్యవంతుడగుననియు మార్కండేయపురాణము చెప్పుచున్న పరమ సత్యములతో నీసైన్‌టిస్టులు కనిపెట్టిన సత్యము లెట్లు సరిపోవుచున్నవో గమనింపదగిన యంశము. (చూ. హారవిలాస శారదాగారి Hindu Superiority పుట. 228-31).

మనమతములోని సత్యములు మనస్థూలబుద్ధికి నర్థరహితములుగ దోచినను, చివరకు వాని యాథార్థ్యము సైన్సుచే వ్యక్తము కాగలదని గ్రహించుట యత్యవసరము.

హిందూమత గ్రంథములచే నాదేశింపబడిన ధర్మము లన్నిటిలోగల సత్యములను గ్రహించుట యేవానవునకును సాధ్యము కాకపోవచ్చును. జీవితమంతయు పరిశోధనలలో గడిపినను అన్నియంశములను గ్రహించుట సాధ్యముకాదు. ఎంత బుద్ధిమంతుడైనను, కొన్ని సత్యములను మాత్రమే తన పరిశోధనవలన కనిపెట్టగలడు. ఆ యా పరిశోధకులు న్యాయముగా ప్రకటించు స్వీయానుభవములను మనము విమర్శించి చూతుమేని, మన మతములోని యేయంశమును త్రోసివేయుటకు వీలులేదను నమ్మకము కలుగగలదు.

పైకి మూఢవిశ్వాసములుగ కన్పట్టున వెన్నియో పరమసత్యములై యున్నవి. వేద మంత్రములలో పటిమ కలదనియు, స్వరము తప్పకూడదనియు, మనవారు చెప్పిరి. భావమే, ముఖ్యముకాని వేదమంత్రములలోను, స్వరముల లోను నేమియులేదని యాధునికులు కొట్టివేయుచున్నారు. లెడ్‌బీటరు థామస్ మున్నగు పాశ్చాత్యులు వేదమంత్ర ములను గురించి పరిశీలన గావించిరి. వారు దివ్యజ్ఞాన సమాజమునకు చెందినవారు. సూక్ష్మదృష్టి నలవరచుకొనిన వారు. స్వరయుక్తముగా గాయత్రీమంత్రము నుచ్చరిం పగా నేమి జరుగునో వారు స్వాయముగ సూక్ష్మదృష్టిచే చూచినారు. గాయత్రి నుచ్చరించునపుడు సూర్యమండలము నుండి యొకజ్యోతి బయలుదేరి యా యుచ్చరించు స్థలము వరకు వచ్చి యా చుట్టుపట్ల ప్రదేశమునుకూడ తేజోవంత

ముగ చేసినట్లు చూచితిమని వారు చెప్పిరి. అపస్వర ముచ్చరించుచో నాజ్యోతి కొంత తగ్గినట్లును, ప్రక్కకు తిరిగినట్లునుకూడ కనిపెట్టినారు. ఈవిధముగా తెలిసికొనినవారి సాక్ష్యములు మన కమూల్యములు. హిందూమత సత్యముల నవి వేనోళ్ళ చాటుచున్నవి.

మృతులైనవారికి శ్రాద్ధాదికము చేయవలెననియు, వారు మనవ్యవహారములను పరీకించుచుందురనియు మన మత గ్రంథములలో కలదు. మన పాశ్చాత్యవిద్యావాసితులు కొందరు దీనిని పరిహాసించుచుండిరి. కాని గొప్ప పాశ్చాత్య సైంటిస్టు అయిన సర్ ఆలివర్ లాడ్జిమున్నగువారు మృతుల గమనికను స్వానుభవ పూర్వకముగ తెలిపి వారికిని మన కునుగల సంబంధము మరణముతో పోలేదని నుడివినపుడు వారు కన్నులు తెరచిరి. శ్రాద్ధము పెట్టని కుమారులను మృతపితరులు నిందించుచున్నట్లు కూడ కొందరు పరిశోధకులు తెలిసికొని యున్నారు.

పునర్జన్మ కలదను నంశమును హిందూమతముతప్ప మరి యేమతమును చెప్పుటలేదు. ఎన్నడును ఋజువుచేయబడి యుండని యీయంశమును హిందువులు వేలకొలది సంవత్సరములనుండి నమ్ముట యాశ్చర్యకరముగ నున్నదని మాక్డొనెల్ దొర వ్రాసియున్నారు. నేటి మన నవ్యభావోపేతులు కూడ చచ్చినవాడు మరల పుట్టునమట హాస్యాస్పదమందురు. ఈ పునర్జన్మసిద్ధాంతముపట్ల విశ్వాసము సన్నగిల్లుచున్న యీదినములలో ప్రజలకు దీనియందలి విశ్వాసమును బలపరచుటకో యనునట్లు, పరమేశ్వరు డీనడుమకొన్ని

ఋజువులను లోకములో వెలయింప చేసినాడు. అమెరికాలో నొకబాలుకు అయిదు సంవత్సరములలోపు వయస్సుననే తాను పూర్వజన్మములో నొక గ్రామములో నొకయింట నొకపేరుతో నుంటిననియు నుడువగా ప్రజలాశ్చర్యపడి యా బాలుడు పేర్కొన్న గ్రామము, కుటుంబము సత్యముగనున్న వేయనియు, నా పేరుగల మనుష్యుడు కొంతకాలముక్రిందట మరణించినాడనియు తెలిసికొని యాబాలు నాగ్రామములో నాయింటికి తోడ్కొనివెళ్ళిరి. అంత నాబాలు డాయింటిలో నెచట వస్తువు లుండెనో చెప్పి ముఖ్యములైన కొన్ని కాగితములుగల పెట్టెనుగూడ తెల్పెను. అందరు నాశ్చర్యచకితులైరి. 1934 వ సంవత్సరములో ఢిల్లీలో జనించిన శాంతి దేవియను బాలిక తన పూర్వజన్మములోని భర్తపేరును గ్రామముపేరును తెల్పి యచటకు తన్ను తీసికొనిపోగోరగా నామె బంధువు లామె నచటకు (మధురకు) తీసికొనిపోయిరి. అచట నామె తన పూర్వజన్మ బంధువుల నందరను గుర్తు పట్టెను. ఈ యంశము లన్నియు వార్తాపత్రికలలో పడినవే.

ఇతర మతములలో లేనంతమాత్రమున మన మతములోని యేయంశమును మనము త్రోసివేయరాదనుట కీపునర్జన్మ విషయ మొక యుదాహరణము. మానవుని యనుభవము, సైన్సు, ఇతరమతములు ఇంతవరకు కనిపెట్ట లేకపోయిన మహాసత్యములు వందలకొలది హిందూమతములో గలవు. మన తెలివితేటలకును, అనుభవమునకును విరుద్ధ

ముగ నున్నంతమాత్రమున వానిని తిరస్కరింపరాదను నదియే ముఖ్యాంశము.

చారిత్రక పరిశోధకులుగూడ నీయంశము నంగీకరించి యున్నారు. మన పురాణములలో ననేకములైన చారిత్రకాంశములును, భూగోళసంబంధములైన యంశములును గలవు. పరిశోధకులు తమ యనుభవమునకు విరుద్ధముగ నున్నంతమాత్రమున వీనిని తిరస్కరించుచుండిరి. కాని క్రమక్రమముగ పరిశోధకులు తమ తప్పును సవరించుకొనుచున్నారు. గౌతమీపుత్రశాతకర్ణి, గౌతమీపుత్రయజ్ఞశ్రీ మున్నగు రాజుల పరంపరను వాయుపురాణము చక్కగా పేర్కొనినది. దానిని నమ్మక మన చారిత్రకులు పుక్కిటి పురాణమని కొట్టివైచిరి. కాని కొంతకాలమునకు నాసిక ప్రాంతములో కొన్ని ప్రాతనాణెములు భూమిలోనుండి బయటపడినవి. ఆ నాణెములపై నున్న రాజనామములను చూచినపుడు పురాణములలో పేర్కొనబడిన రాజపరంపర యథార్థమైనదేయని చారిత్రకులకు వెల్లడియైనది. (చూ. వి. స్మిత్ The Early History of India 212 పు.) ఇట్లే పురాణములలోని సత్యము లెన్నెన్నియో వెల్లడి యగుచున్నవి.

నేడు కొందరు హిందూసంఘమును సంస్కరింపగోరి, వర్ణపద్ధతిని నిర్మూలింపగోరుచున్నారు. దానివలన సంఘమున సమత్వ మేర్పడునని వారియభిప్రాయము. కాని మానవ

స్వభావమును, సంఘస్వభావమును వారు పరికింపరు. ఈపద్ధతి వర్ణవిభాగములేని దేశములలోగూడ సంఘసమత్వములేదని వారు గ్రహింపలేకున్నారు. ఆర్థికముగ నెన్నివిధములనైన సంస్కరించుకొనవచ్చునుగాని వృత్తులను సంస్కరించుట వెఱ్ఱి పనియని సాంఘికశాస్త్రవేత్తలు గ్రహింపగల్గుచున్నారు.

వర్ణపద్ధతి ననుసరించి బ్రాహ్మణుడు విద్యలకు గురువై బుద్ధిబలముచేతను, అధ్యాత్మికబలముచేతను సంఘమున కుపకరించుచు జీవనము గడపుకొనుచు, కర్మానుష్ఠానపరుడై యుండవలెను. క్షత్రియుడు పరాక్రమము ప్రధానలక్షణముగ గలవాడై దేశరక్షకుడుగ నుండవలెను. వైశ్యుడు ధనార్జన సాధనములను చేతనుంచుకొని వ్యాపారాదులచే లోకము నకుగూడ నుపకరింపవలెను. శూద్రుడు శరీరశక్తిచే సంఘసేవ చేయవలెను. ఈవిధముగ నాల్గువిధములైన విభాగములను హిందూమతము గావించినది. విభజించినను విభజింపక పోయినను ఏసంఘమైనను నిట్లు నాల్గు విభాగములు కాక తప్పదు. నేటి యూరపుఖండములో నేదేశమైనను దీసి కొనుడు అం దీనాలుగు విభాగములు గన్పట్టును.

ఇంగ్లండులో చూడుడు. బుద్ధిబలముచేతను, ఆధ్యాత్మిక సాధనములలోను జీవితము గడపు పండితులు, న్యాయవాదులు, మతగురువులు (Clergy) మున్నగువారి నందరను చేర్చి తాత్కాలికముగ వారికి బ్రాహ్మణులను పేరొసం

గుడు. దేశమును రక్షించు సైన్యమును తీసి దానికి క్షత్రియ నామ మొసగుడు. ధనికులు, మిల్లు యజమానులు మున్నగు వారి నొకచో చేర్చి వైశ్యులను నామమిండు. కార్మికులను (Labourers) ఒకచో చేర్చి వారికి శూద్రులను నామ మిడుడు.

ఇట్లు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రవిభాగము ఇంగ్లండులో మాత్రము తప్పినదా ? ఎట్లయినను తప్పనిది కనుకనే, హిందూమతము దీనికొక చక్కనిరూప మీయ దలచి, జన్మచేతనే యీవిభాగమును చేసి, ప్రతివర్గము వారును నెరవేర్పవలసిన విధులను విపులముగాదెల్పి గొప్ప సాంఘిక నిర్మాణము గావించెను. ఎట్లయినను తప్పని విభాగమును జన్మతోనే చేయుటలో ననేకలాభములు కలవు. దీనివలన వివిధవర్గముల నడుమ నీర్ష్యాస్పర్థలు గలుగు నవ కాశము పోవును. జన్మతోనే ప్రారంభమైన వృత్తితో నంద రును సంతుష్టి నొందుదురు. ఆయా వర్ణములవారికి తమ వృత్తులలో బాల్యమునుండియు ప్రావీణ్యము గలుగును. వర్ణ పద్ధతివలన వృత్తివిద్యాపాఠశాలల కవసరము తొలగిపోవు నని పాశ్చాత్యులే యంగీకరించినారు.

మానవజాతిలో సమత్వ ముండదనియు, "చతుర్థో నాస్తి పంచమః" అని మన పూర్వులు చెప్పిన యంశము శాంఘిక శాస్త్రమున కెంతయు సరిపోవుచున్న దనియు, పాశ్చాత్యు లీసత్యమును గ్రహించుకొనలేకపోవుటచేతనే

తమ సంఘము నీపద్ధతిలో విభజించుకొనలేకపోయిరనియు, భారతదేశమున నిదివరలోనే సిద్ధమైయున్న యీయుత్తమ పద్ధతిని భంగము చేయదలచినవారు సంఘమునకును, మతమునకును మహోపచారము చేయుచున్నారనియు ముఖ్యముగ గమనింపదగిన యంశములు.

మన మతములోని సంప్రదాయములు, ఆచారములు, సాంఘిక నిర్మాణము చాలదూరదృష్టితో చేయబడినవనియు, వీనిమహత్త్వమును గుర్తించుటకు బదులుగ మనము వానిని భగ్నము చేయుట యజ్ఞానమూలకము, ననర్థదాయకము ననియు మన యువకుల కెంత హెచ్చరిక చేసినను చాలదు. హిందూమతము శాశ్వత సత్యములపై నాధారపడిన దగుటచేతను, అంతస్సారము గలదగుటచేతను నింతకాలము నిలిచినది. ఇంకను నిలువగలదు. దీనిపై వచ్చువాదులు తాత్కాలిక ఫలవంతములే కాని, శాశ్వతముగ దీనిని మార్చలేవు.

## సనాతనుల హక్కు

శాస్త్రములలో చెప్పబడిన హిందూమతమునకును, నేటి హిందువుల యాచరణమునకును చాల వ్యత్యాసముండుటచే, సనాతనధర్మమునకు తిలాంజలిని వదలవచ్చుననువారు మనలో కొందరు బయలుదేరినారు. "మతము పూర్తిగ నాచరింపబడుటలేదు. గావున పూర్తిగ వదలివేయునలె" నను నది యర్థరహితమైన వాదము. పూర్తిగా

నాచరించినవానికి పూర్తిగా ఫలము లభించును; సగమాచరించినవానికి సగము ఫలము లభించును; నూరవవంతాచరించినవానికి నూరవవంతు ఫలము లభించును; ఏమియు నాచరింపనివానికేమియు ఫలము లభింపదు. ఇది హిందూమతమునకేకాక యితర మతములకుగూడ వర్తించును. అట్లయినను, "పూర్తిగా నాచరించుచున్నావా?" యను కఠినపరీక్ష సనాతనధర్మపరాయణునిపట్ల మాత్రమే చేయబడుచుండుటను నేడు మనము చూచుచున్నాము. ఒక క్రైస్తవుని చూచి యెవ్వరును, "నీవు క్రీస్తు చెప్పినట్లు పూర్తిగ నాచరించుటలేదు కాన నీవు క్రైస్తవుడవుకావు" అట్లే యొక ముస్లిమును చూచి "నీవు మహమ్మదు బోధలను పూర్తిగా నాచరణలో పెట్టుటలేదు. కావున నీవు ముస్లిమువు కావు" అని యెవ్వరును చెప్పుటలేదు. కాని యొక్క వర్ణాశ్రమ ధర్మపరాయణుని మాత్ర మిట్టి కువిమర్శగావించుటకందరును ముందంజ వైచుచున్నారు. సరియైన సమాధానము చెప్పువారు లేకపోవుటచేతనే యిట్టి కువిమర్శలు పెచ్చు పెరుగుచున్నవి.

ఏసుక్రీస్తు లక్షణములను బట్టి ప్రతిక్రైస్తవుని విమర్శించుట యెట్టిదో, మహమ్మదు లక్షణములను బట్టి ప్రతి ముస్లిమును విమర్శించుట యెట్టిదో, ఋషుల లక్షణములను బట్టి ప్రతి సనాతన ధర్మపరాయణుని విమర్శించుట యిట్టిదే

యగును. క్రైస్తవులు, ముస్లిములు మున్నగువారు నూటికి నూరుపాళ్ళు నాచరింపకపోయినను, తత్తన్మతస్థులమని చెప్పుకొనుట కెట్టిహక్కు గల్గియున్నారో సనాతనధర్మపరాయణులు సనాతనులమని చెప్పుకొనుట కట్టిహక్కునే గల్గియున్నారు. నూటికి ముప్పది యంశములను తెచ్చుకొని పరీక్షలో నుత్తీర్ణులగుట కితరుల కెట్లు హక్కుగలదో, యట్టి హక్కే సనాతన ధర్మ పరాయణునకును గలదు. ఆతడొక్కడే నూటికి నూరంశములు తెచ్చుకొనవలె ననునది కువిమర్శనము.

ప్రస్తుత మసంపూర్ణములుగనున్న యితరమతములను రక్షించుకొనుటకు, నుద్ధరించికొనుటకు నితరమతములవారి కెట్టి హక్కు గలదో, యట్టిహక్కే సనాతన ధర్మమును రక్షించు కొనుటకును, తేజోవంతము చేసికొనుటకును సనాతనులకుగలదు. పూర్ణవికాసముతో లేదను హేతువుచే సనాతనధర్మమును పూర్తిగ వదలివేయవలయుననునది యర్థరహితవాద మనుటకే పైన సనాతనధర్మవాదుల సమర్థనము గావింపబడినది కాని, సనాతనధర్మ ప్రస్తుతస్థితి తృప్తికరముగ నున్నదనుట కెంత మాత్రమును గాదు.

మతాదర్శములనుబట్టి మానవులు తమ్ము తాము దిద్ది కొనవలెనేకాని, తమ్ముబట్టి మతాదర్శములను మార్చుకొనరాదనియు, హిందూమతగ్రంథములలోని పరమసత్యములు కాలక్రమమున మన యనుభవమునకును, నవీన

శాస్త్రములకును ననుగుణమైనవిగ ఋజువగుచుండుటచే తొందరపడి మతమును మార్చుకొనుట యవివేకమనియు, ప్రామాణ్యబుద్ధి మతమునకు ముఖ్యలక్షణమగుటచే, అతీంద్రియగోచరవిషయములను దెల్పు శ్రుతిస్మృతులను విశ్వసింపక తప్పదనియు, ధర్మము కొంతపోయనది గనుక పూర్తిగ పోగొట్టుకొనవలె ననునది యర్థరహితమైన వాదమనియు మనము ముఖ్యముగ జ్ఞప్తియందుంచుకొనవలెను. ఏనాటికైనను సనాతనధర్మమే లోకమునకు శరణ్యము కాగలదను విశ్వాసముతో ధార్మికులెల్లరు దాని పునరుజ్జీవనమునకై కృషి సల్పుదురుగాక !



అ ధ్యా య ము 3.

# వర్ణవ్యవస్థ



## హిందూమతప్రత్యేకలక్షణము

హిందూమత గ్రంథమని చెప్పదగిన పుస్తకమును దేనిని తీసినను, అందు వర్ణధర్మప్రాముఖ్యము వెల్లడియగును; వర్ణాశ్రమధర్మములే హిందూమతమని తేలును. మనుస్మృతి కంటెను హిందూధర్మప్రతిపాదకగ్రంథము మఱొకటేదియు లేదు. అందు ప్రతిపాదింపబడిన విషయమునకు మనువు వర్ణ ధర్మమనియే నామకరణము చేసినాడని చెప్పదగును. ఎట్లన : మరీచ్యాదిమహర్షులు మనువునొద్ద కేగి, యిట్లడిగిరని మను స్మృతి ప్రారంభములోనే చెప్పుచున్నది.

భగవన్ సర్వవర్ణానాం యథావదనుపూర్వశః,
అన్తరప్రభవాణాంచ ధర్మాన్నోవక్తుమర్హసి.

(మను. 1-2)

(ఓ భగవానుడా, సర్వవర్ణములకును, అవాన్తర వర్ణములకును గల యాయా ధర్మములను క్రమముగా మాకు చెప్పుటకు తగియున్నావు.)

దానికి సమాధానముగా మను విట్లు చెప్పెను. "ఈ శాస్త్రమును నాకు బ్రహ్మ బోధించెను. దానిని నేను భృగు మహర్షికి చెప్పితిని. ఆతఁడు మీకు దీనిని తెలుపగలఁడు."

అంత మహర్షులు భృగునివలన ధర్మములను విందురు. ఆధర్మములే మనుస్మృతిలో గన్పట్టు ధర్మములు.

ఇట్లు మనుస్మృతి సర్వవర్ణధర్మములను, అవాంతర వర్ణధర్మములను తెలుపవలసినదని కోరినమహర్షులకు సమాధానముగ చెప్పబడినదని మనుస్మృతియే చెప్పుటచే నిందలి విషయమునకు మనువే "వర్ణధర్మములు, అవాంతర వర్ణ ధర్మములు" అను శీర్షిక నిడినట్లు స్పష్టము. ఇట వర్ణధర్మములలో ఆశ్రమధర్మములుగూడ చేరియున్నవని వ్యాఖ్యాతలు వ్రాసియున్నారు. మనుస్మృతివలెనే యితరస్మృతులలోగూడ ప్రతిపాదితవిషయము వర్ణాశ్రమధర్మమని చెప్ప వచ్చును.

మన మహర్షుల దృష్టిలో వర్ణాశ్రమధర్మములే సర్వస్వము. వర్ణాశ్రమధర్మములు బాగుగ నడచుచున్నచో, దేశము బాగుగ నున్నట్లును, వర్ణాశ్రమధర్మములు సరిగ నడువనిచో దేశము చెడిపోయినట్లును వారి యభిప్రాయము. భారతరామాయణములలోగాని, పురాణములలోగాని యొక రాజు పరిపాలనము బాగున్నదని వర్ణింపవలసినచో నపుడు, వర్ణాశ్రమధర్మములు బాగుగ నడచుచుండెనని చెప్పబడును; ఒకరాజు పరిపాలన దుష్టముగ నున్నదని చెప్పవలసినపుడు, వర్ణాశ్రమధర్మములు సరిగా నడచుటలేదని చెప్పబడును.

శ్రీమద్రామాయణములో శ్రీరామచంద్రుని సత్పరి పాలనమును వర్ణించుచు, వాల్మీకిమహర్షి యిట్లు చెప్పినాడు.

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాశ్శూద్రా లోభవివర్జితాః
స్వకర్మసు ప్రవర్తన్తే తుష్టాస్స్వైరేవ కర్మభిః
(యుద్ధకాండ 131 సర్గ 99 శ్లో)

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు లోభములేని వారై తమతమకర్మలచేతనే సంతుష్టులై తమతమ కర్మల యందే ప్రవర్తించుచున్నారు.

ఇట్లే యితరపురాణేతిహాసగ్రంథములలోను, వర్ణ ధర్మసుస్థితి సత్పరిపాలనతో నవినాభావముగ వర్ణింపబడినది. దీని కనుగుణముగనే వేనాదిరాజుల పరిపాలనమున వర్ణ సాంకర్యము జరిగినట్లు వర్ణింపబడినది. కావుననే స్మృతు లలో రాజధర్మములలో వర్ణాశ్రమ ధర్మసంరక్షణము ముందుగ విధింపబడినది.

వర్ణానాశ్రమాంశ్చన్యాయతో భిరక్షేత్. (గౌ. ధ. 11-9)

దేశము బాగున్నదన వర్ణాశ్రమధర్మములు బాగున్న వనియు, దేశము చెడినదన, వర్ణాశ్రమధర్మములు చెడిన వనియు తెలియుటచే, ఋషులమతములలో వర్ణాశ్రమ ధర్మము లెంత ముఖ్యములో స్పష్టమగుచున్నది.

మన్వాది స్మృతులు కేవలము మానవులలో భిన్న వర్ణములవారి నడుమగల ధర్మభేదములను తెల్పుటకు పుట్టి నవేకాదు. స్మృతులు తెల్పు ధర్మములు సాధారణముగా

నన్నియు సర్వవర్ణ సామాన్యధర్మములే; అయినను వానిలో గూడ భిన్న వర్ణములవారికి విధింపబడు భేదములు కొన్ని కలవు. ఎట్లన : ఉపనయనము బ్రాహ్మణ క్షత్రియ వైశ్య బాలురకు సామాన్యధర్మమే. అయినను ఉపనయనవయస్సులోను, భిక్షాచరణ నియమములలోను, దండపరిమాణములలోను, నొకొక్కవర్ణపు వటువునకు కొన్ని ప్రత్యేకలక్షణములుండును. ఇట్లే పంచమహా యజ్ఞములును సర్వవర్ణముల వారికిని విధింపబడినవి; కాని యవి శూద్రునకు అమంత్రకముగ విధింపబడినవి. ఆవిధముననే జాతాశౌచ మృతాశౌచములు సర్వవర్ణములవారికిని గలవు. కాని యీ యాశౌచముల కాలపరిమితి యొకొక్కవర్ణములవారి కొకొక్క విధమున నుండును. ఆప్రకారమే ప్రాయశ్చిత్తములు మున్నగునవి యన్నివర్ణములవారికి నున్నను, వర్ణభేదమును బట్టి యివి మారుట కలదు.

కావున వర్ణవిభేదమును తీసివేయదలచువారు వృత్తి, వివాహ, భోజనములలోని నియమములనే కాక పైన నుదాహరణములుగ తెల్పబడిన బ్రహ్మచర్యవిధులు, ఆశౌచ విధులు, ప్రాయశ్చిత్తవిధులు మున్నగువాని నన్నిటినికూడ తీసివేయవలసియుండును. అట్టిచో హిందూమతములో నిక దయాసత్యశౌచాదులు, భగవద్భక్తి యనునవి మాత్రమే మిగులును. ఈలక్షణము లన్నిమతములకును కూడ నున్నవే యగుటచే, హిందూమతముయొక్క ప్రత్యేకలక్షణ మంత

రించును. మనుస్మృతి ఇతర ధర్మశాస్త్రములు, పురాణములు మున్నగువానికి స్థానము పోవును. ఈ పవిత్రగ్రంథములులేని హిందూమతము గగనకుసుమము.

మన స్మృతికర్తలు దయాసత్యశౌచాదులను గూడ వర్ణధర్మములలోనే పేర్కొను గమనింపదగిన విషయము. ఇవి సర్వవర్ణ సామాన్యధర్మములుగ చెప్పబడినవి.

"సర్వేషాం సత్యమక్రోధో దానమహింసా ప్రజననంచ"

(అన్నివర్ణములవారికిని సత్యము, క్రోధములేకపోవుట, దానగుణము, అహింస, సంతానముకనుట అనునవి ధర్మములు) అని వసిష్ఠస్మృతి చెప్పుచున్నది.

## వర్ణ ధర్మ ము లు

అన్నివర్ణములవారికిని విధింపబడియుగూడ, వివరములలో వర్ణమునుబట్టి భేధించుధర్మములకు కొన్ని యుదాహరణములు పైన నీయబడినవి. మరియు దయాసత్యశౌచాదులు సర్వవర్ణ సామాన్యధర్మములని గూడ చూచితిమి. ఇక వర్ణముల ప్రత్యేక ధర్మములను చూతము.

బ్రాహ్మణున కీ క్రిందిధర్మములు విధింపబడినవి.

అధ్యాపన మధ్యయనం యజనం యాజనం తథా,
దానం ప్రతిగ్రహంచైవ బ్రాహ్మణానా మకల్పయత్.

(మను. 1-88)

"వేదములను (సాంగముగ) చదువుట, యితరులకు వానిని బోధించుట, యజ్ఞములనుచేయుట, యితరులచేత

యజ్ఞములను చేయించుట, యొకరికి దానముచేయుట, యొకరినుండి దానముపట్టుట- ఈపనులను బ్రహ్మ బ్రాహ్మణుల కేర్పాటుచేసెను."

క్షత్రియున కీ క్రిందికర్మలు విధింపబడినవి.

ప్రజానాం రక్షణం దానమిజ్యాధ్యయన మేవచ,
విషయేష్వప్రసక్తిశ్చ క్షత్రియస్య సమాసతః
(మను. 1-89)

"ప్రజలను కాపాడుట, యొకరికి దానముచేయుట, యజ్ఞములు చేయుట, వేదము చదువుకొనుట, యింద్రియ భోగములను కోరకుండుట—ఇవి సంగ్రహముగా క్షత్రియునకు విధింపబడిన ధర్మములు."

వైశ్యున కీ క్రిందిధర్మములు విహితములు.

పశూనాం రక్షణం దానమిజ్యాధ్యయన మేవచ,
వణిక్పథం కుసీదంచ వైశ్యస్య కృషి మేనచ.(మను. 1-90)

"పశువులను పెంచుట, కాపాడుట, యొకరికి దానము చేయుట, యజ్ఞములను చేయుట, వేదము చదువుకొనుట, వాణిజ్యము, వడ్డీవ్యాపారము, వ్యవసాయము."

శూద్రున కొక్కటే కర్మ యాదేశింపబడెను.

ఏకమేవతు శూద్రస్య ప్రభుః కర్మ సమాదిశత్.
ఏతేషామేవ వర్ణానాం శుశ్రూషామనసూయయా.

(అసూయ లేకుండ నీవర్ణములవారికి శుశ్రూష చేయుట యను నొకకర్మనే బ్రహ్మ శూద్రునకాదేశించెను.)

శిల్పాదివృత్తులు శూద్రుల చేతిలోనే యుండవలయును.
(గౌ. ధ. 10-61)

ఇట్లు క్షత్రియ, వైశ్య, శూద్రులకు ప్రజాపాలనము, కృష్యాదికము, పరిశ్రమలు అను లౌకికకర్మలు విహితములనియు, బ్రాహ్మణునకు లౌకికకర్మ యేమియులేక కేవల వైదికకర్మకలాపమే విహితమనియు తెలియుచున్నది. బ్రాహ్మణునకు వేదాధ్యయనము క్షత్రియవైశ్యులకువలె కాదు. ఆతడు లోకమునకు బోధకుడుగను, పురోహితుడుగను గూడ నుండవలసినవాడగుటచే నాతనికి వేదాధ్యయనము, వైదిక ధర్మపరత ముఖ్యములు. ఇట్లీతడు జ్ఞానప్రదానుడై; సత్వగుణోపేతుడై యుండవలసినవాడగుటచే నీక్రిందివి బ్రాహ్మణ లక్షణములుగ భగవద్గీతలో చెప్పబడినవి. అంతరింద్రియ నిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము, ఆస్తిక్యము, తపస్సు శౌచము, ఓర్పు, ఋజుప్రవర్తనము, జ్ఞానము, విజ్ఞానము.

శమో దమస్తపశ్శౌచం క్షాన్తిరార్జవ మేవచ,
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మం కర్మస్వభావజం.
భ. గీ. 18-42)

ఇతరవర్ణములవారికి కూడ ఇంద్రియ నిగ్రహము, తపస్సు, శౌచము మున్నగునవి యుండవలసినవే, కాని యవియే వారి వృత్తులు కావు. వారికి వేరుగ వృత్తులున్నవి. బ్రాహ్మణున కివియే ముఖ్యవృత్తులు. కావున బ్రాహ్మణుడు

ముఖ్యముగ తపస్సునందనురక్తుడై, లౌకికభోగముల నంతగా కోరనివాడై, జ్ఞానప్రధానుడై యుండవలయును.

## ప్రయోజనము

సంఘము నడచుట కిట్టి భిన్నవృత్తులు వివిధవర్ణముల వారికుండుటయత్యవసరము. ఏ దేశములోనుగూడ నీవిధముగ నాల్గువర్ణముల విభాగము తప్పదని రెండవయధ్యాయమున నిరూపింపబడినది. ఈ నాల్గువర్ణములవారును తమతమ జీవికలను సంపాంచుటకే యీవృత్తులు నిర్ణయింపబడలేదు. సంఘము బాగుగ నడచుట కూడ వీనిప్రయోజనమే. నాల్గు వర్ణములవారును గూడ దేశమునకు సేవచేయుచున్నారు.

బ్రాహ్మణుడు లౌకికాధ్యాత్మికజ్ఞానమునకు నిధియై, అన్నివర్ణములవారికిని గూడ తన జ్ఞానఫలము నందజేయుచు నన్నివర్ణములవారిని ధర్మమార్గమున నడపుటకు యత్నించుచు వివిధవర్ణముల వారికి తమతమ వృత్తులను నిర్వహించుటలో నావశ్యకమగు శాస్త్రజ్ఞానమునుగూడ బోధించుచు అన్ని వర్ణముల వారికిని అవసరమగు జ్యోతిషాదివిషయములను చెప్పుచు యజ్ఞయాగాదులను చేయించుచు, చేయుచు, నందువలన దేవతలను తుష్టిపరచి లోకములో సకాలవర్షాదులవలన దేవతల యనుగ్రహ ఫలమును ప్రజలకందఱకు నందునట్లు చేయుచు, అన్ని వర్ణములవారికి గల సమస్తస్మార్తకర్మలను చేయించుచు, సర్వవర్ణములవారి లౌకికపారలౌకికశ్రేయస్సును వృద్ధిపొందించుచున్న

వాడై సంఘసేవ చేయవలయును. క్షత్రియుడు దేశములో నంతఃకలహములు లేకుండగను, దొంగలు ద్రోహులు మున్నగువారు తల యెత్తకుండగను, పరదేశరాజులు దేశము నాక్రమింపకుండగను గాపాడుచు రాజుగాగాని, సైనికుడుగాగాని, రాజోద్యోగిగాగాని యుండి దేశసేవ చేయవలయును. వైశ్యుడుత్పత్తిసాధనములను చేతనుంచుకొని వ్యవసాయమువలన ప్రజలకు కావలసిన వస్తువుల నన్నిటిని పండించుచు, నేప్రాంతముల నే యేవస్తువులుండవో యాప్రాంతముల కావస్తువుల నన్యప్రాంతములనుండి యందచేయుచు, ప్రజల కేవస్తువునకును కొరత లేకుండచేయుచు, గోవులనుపెంచి ప్రజలకు స్వచ్ఛక్షీరముల నందజేయుచు, తనకు స్వల్పలాభమేయుండునట్లు వ్యవహరించుచు పేదవారికి ధనము పెట్టుబడినిపెట్టుచు వారినుండి స్వల్పవృద్ధి (వడ్డీ)ని మాత్రమే తీసికొనుచు సంఘసేవ నొనర్పవలయును. శూద్రుడు శరీరముచే నిర్వహింపవలసిన సమస్తశిల్పములు, కళలు, వృత్తులు పూని పైమూడు వర్ణములవారు నిర్వహింపవలసిన ధర్మములకు తోడ్పడుచు సంఘసేవ చేయవలయును.

ఇట్లు వర్ణధర్మములు జీవికాసాధనములే కాక సంఘసేవా మార్గములనికూడ తెలియగలదు. ఇందొకవర్ణము వారికి సౌకర్యము, మరొకవర్ణమువారికి కష్టములేదు. బ్రాహ్మణుడు జ్ఞాన ప్రధానుడగుటచే నగ్రవర్ణస్థుడని చెప్పుటకు వీలున్నను, అతని జీవితము శూద్రుని జీవితముకంటె హెచ్చు

సుఖవంతముకాదు; పైగా హెచ్చుకష్టభాజనము. స్నానములు, ఉపవాసములు, నియమములు, తపస్సులు, అధ్యయనము మున్నగునవి బ్రాహ్మణునకు జీవితములో సుఖమును, స్వేచ్ఛను సంకుచితము చేసినవి. అట్లే క్షత్రియుడు ప్రాణమునరచేతనుపట్టుకొని యేక్షణమునన్తైనను దానిని వదలివైచుటకు సిద్ధపడి యుండవలసినవాడగుటచే నాతనిపట్ల గూడ పక్షపాతము చూపలేదు. అట్లే వైశ్యుడు ధనార్జనము చేయుటకు హెచ్చుగ నవకాశముగలవాడైయైనను లోకమున కుపయోగించుటయే యాతని పరమ ప్రయోజన మగుటచే నాతనికిని ప్రత్యేకసౌకర్యములు లేనట్లే పరిగణింపదగును. శూద్రుడు పరిశ్రమలనన్నిటిని చేత పూనినవాడగుటచే నాతడును సంఘశ్రేయస్సునకై కష్టించినవాడగుచున్నాడు.

ఈ నాల్గు వర్ణములు నేదేశమందైనను, ఏసంఘమందైనను తప్పనిసరిగ నేర్పడుననియు, నాల్గువర్ణములకు సమానమైన బాధ్యతలు గలవనియు పైన చూచియున్నాము. ఎట్లయినను తప్పనిసరిగ నేర్పడుదానిని జన్మసిద్ధము చేయుట వలన హిందూమతము సాధించిన లౌకికప్రయోజనములేవన:

(1) వంశపారంపర్యముగ వచ్చు వృత్తిని నేర్చుకొనుట బాలురకు సులభమగుటచే వృత్తివిద్యలను నేర్చుకొనుటయందలి శ్రమ తప్పును. ఏకులములో పుట్టినవాని కాకులమునందలి వృత్తి సులభముగ నలవడునని పాశ్చాత్యులు గూడ నంగీకరించియేయున్నారు. కులమువరకును పోనేల ?

వేదపండితుని కుమారునకు వచ్చినంత చక్కగ వేదము మరొ కనికి రాదు. వృత్తికిని కులమునకును గలసంబంధము నెవ రును గాదనజాలరు. కులవిద్య నేర్చుకొనకపోయినను చూచి నంతమాత్రముననే యలవడును ఎచ్చటనైనను అరుదుగ ఒక వర్ణమునకు చెందిన బాలునకు మరొక వర్ణముయొక్క వృత్తి సులువుగ నలవడుచో వాడు దానిని నేర్చుకొన వచ్చునుగదా యను ప్రశ్న యిట పొడములకు వీలులేదు. ఏలనన : శాస్త్రవిహితము కావుననే వర్ణపద్ధతి యనుసరింప దగినదనియే ధార్మికులమతము. సాధారణముగ లౌకికదృష్టి కూడ దానికనుకూలముగ నుండుననుటకే లౌకిక ప్రయోజ నములు చూపబడుచున్నవి. ప్రత్యేక సందర్భములలో నీలౌ కిక ప్రయోజనములకు బాధ కల్గినంతమాత్రమున శాస్త్రము ప్రతిహతము కాదు.

(2) ప్రతిమానవుని వృత్తియుజన్మతోనే నిర్ణీతమగుట చేతను, వాడితరవృత్తుల కేగుట దోషమని చెప్పబడియుం డుట చేతను సంఘములో వృత్తులకై పోటీలు తగ్గును. వర్ణ పద్ధతి ననుసరించి బ్రాహ్మణునకు బ్రాహ్మణధర్మమే శ్రేష్ఠము లాభదాయకమనికాని, సులభమనికాని తలచి యాతఁడు మరొకవర్ణముయొక్క ధర్మము ననుసరింపరాదు.

స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

(తనధర్మములో చచ్చుటయైనను మంచిదికాని పర వర్ణధర్మము ప్రమాదకరమైనది) అని భగవద్గీత నుడువు

చున్నది. కావున వర్ణపద్ధతివలన నీర్ష్యాసూయాదు లుండక యేకులమున పుట్టిన వాని కావృత్తియే సర్వోత్తమమైన దనుభావము గల్గును.

(3) ప్రస్తుతప్రపంచము నంతగా భావించుచున్న నిరుద్యోగ సమస్యకూడ వర్ణ పద్ధతివలన తొలగిపోవును, వర్ణ పద్ధతినిబట్టి మానవునకు పుట్టుకతోడనే వృత్తి యేర్పడును. ఈనాడు నాగరకత యెంత పెరిగినను సంఘముకాని, ప్రభుత్వముకాని ప్రతిమానవునకును వృత్తిని చూపలేకపోయినది. యువకులేదో ఆశతో 10. 15 సంవత్సరములుకష్టించి చదువుటయు. తుదకేవృత్తియు దొరకక మాడుటయు నప్పుడప్పుడు జరుగుచున్నది. ఏవర్ణమువా రావృత్తినే నమ్మికొని యీ యుద్యోగ దురాశలను వీడుచో నెల్లరకు జీవిక కల్గునని నవ్యభావోపేతులైన రాజకీయనాయకులు గూడ నేడు నుడువుట పేరొ్కనదగిన యంశము.

(4) జన్మచేతనే వృత్తులు, విద్యలు, ధర్మములు నిర్ణీతము లగుటవలన గలుగు మరొకలాభ మేమన: ఇట్టియేర్పాటే లేనిచో, నేనాడో నశించి యుండెడివృత్తులు, విద్యలు మన దేశములో నింతకాలము నిలచినవి. బ్రాహ్మణునకు వేదాభ్యాసము ధర్మమను నియమములేనిచో వేదము లేనాడో నశించియుండెడివి. అట్లే కొన్ని శాస్త్రములు, శిల్పములు, నృత్తులు నేటివఱకు కులక్రమమున వచ్చుచు నిలచి యుండుటకు కారణమాయాకులముల వారికాయావృత్తులు, శిల్పములు, విహితములై యుండుటయే.

కొన్ని వర్ణములవారికి గౌరవప్రదములైన వృత్తు లుండుటయు, కొన్నివర్ణములవారికి హీనవృత్తులుండుటయు జూడ, వర్ణపద్ధతిలో న్యాయములేదని తోచునని నేఁడు కొందఱు నుడువుచున్నారు. కాని యిట్లనువారికి ప్రాచీన హిందూ మతసిద్ధాన్తములం దెట్లునమ్మకములేదో, యట్లే నవీనప్రపంచములోని యాదర్శములందును, సిద్ధాన్తములయందునుకూడ ప్రవేశములేదని చెప్పవలసియున్నది. నవీనాదర్శముల ననుసరించి, యొకపని గౌరవప్రదము, నొకటి హీనమునని చెప్పుటకు వీలులేదు. బుద్ధిబలముతో కాక, కేవలము శరీరపరిశ్రమతో సంబంధించిన కార్యములలోగూడ గౌరవముగలదనునదియే నవీనసిద్ధాన్తము. నవయుగప్రవర్తకులందరు నీపరిశ్రమగౌరవమును (Dignity of labour) గూర్చి నొక్కి చెప్పియున్నారు. అట్టిపట్ల నవీనులు వర్ణధర్మములో లోటు నెంచుటకు వీ లెట్లు కల్గును ?

ఇట్లు వర్ణపద్ధతి సంఘము చక్కనిమార్గమున నడచుట కుపయోగపడునదేకాని, యాధునికులు కొందఱు తలచునట్లు సంఘాభివృద్ధి నరికట్టునది కాదు కావుననే ఈసృష్టి చక్కగ సాగుటకే బ్రహ్మ వివిధవర్ణములవారికి భిన్నవృత్తుల నేర్పరచె నని మనువు చెప్పినాడు.

సర్వస్యాస్యతు సర్గస్య గుప్త్యర్థరి సమహాద్యుతిః,
ముఖబాహూరుపజ్జానాం పృథక్కర్మాణ్యకల్పయత్.
(మను. 1-87)

## సవర్ణవివాహవిధి.

వర్ణపద్ధతిలో వృత్తికంటెను ముఖ్యమైనది స్వవర్ణ వివాహనియమము. అన్ని ధర్మశాస్త్రగ్రంథములలోను, స్వవర్ణస్త్రీనే వివాహము చేసికొనవలెనను నియమము కలదు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వర్ణములకు చెందినవారు (ద్విజులు) గురుకులము వీడి స్నాతకులై తమతమ వర్ణమునకు చెందిన కన్యలను వివాహ మాడవలయునని మనుస్మృతి యాదేశించుచున్నది.

ఉద్వహేత ద్విజో భార్యాం సవర్ణాం లక్షణాన్వితాం.
(మను. 3-4)

శూద్రులుగూడ నీస్వవర్ణవివాహనియమమును పాటింపవలసినదేయని మనువు చెప్పుచున్నాడు.

"శూద్రైవ భార్యా శూద్రస్య" (మను 3-13)

కాముకపక్షములో మనువు, బ్రాహ్మణుడు క్రింది మూడువర్ణముల కన్యలను, క్షత్రియుడు క్రింది రెండువర్ణముల కన్యలను, వైశ్యుడు శూద్రకన్యనుగూడ వివాహమాడుటను తెల్పియున్నమాట వాస్తవమే; కాని యట్టి యసవర్ణవివాహము లాతనికి సమ్మతములని చెప్పుటకు వీలులేదు.

"కామతస్తు ప్రవృత్తానాం" (కామముతో ప్రవర్తించువారికి) అని (3-12) యాతడు చెప్పుటచే, నీవివాహములు ధర్మవివాహములు కావని యాతని మతమైనట్లు స్పష్టము. దీనికి తోడుగ "ఉద్వహేత ద్విజో భార్యాం సవర్ణాం లక్ష

ణాన్వితాం" అనికూడ నాతడు చెప్పుటచే నాతనికి సమ్మతమైనది సవర్ణవివాహమే యనుట నిస్సందేహము.

ఈకామప్రధాన వివాహమును చేసికొను దంపతులకు జనించినవారు తల్లిదండ్రుల వర్ణములకు చెందరనునది ముఖ్యమైన విషయము. సమస్తధర్మ శాస్త్రకారులునుకూడ నీవిషయమై యేకాభిప్రాయముతోనే యున్నారు. బ్రాహ్మణుడు క్షత్రియస్త్రీని వివాహమాడుచో వారికి పుట్టినవాడు బ్రాహ్మణుడు కాడు. వానికి సవర్ణుడని పేరు. అట్లేక్షత్రియునకు వైశ్యస్త్రీవలన జనించినవాడు అంబష్ఠుడు. వైశ్యునకు శూద్రస్త్రీవలన జనించినవాడు ఉగ్రుడు. బ్రాహ్మణునకు వైశ్యస్త్రీవలన పుట్టినవాడు నిషాదుడు. క్షత్రియునకు శూద్రస్త్రీవలన పుట్టినవాడు దౌష్యంతుడు. బ్రాహ్మణునకు శూద్రస్త్రీవలన జనించినవాడు పారశవుడు. ఇట్టిబిడ్డల కనులోమ సంతాన మనిపేరు. క్రిందివర్ణముల పురుషులవలన పైవర్ణపు స్త్రీలయందు జనించిన సంతానమునకు ప్రతిలోమ సంతాన మనిపేరు. అట్టిబిడ్డలు సర్వధర్మ బహిష్కృతులు. అందును బ్రాహ్మణస్త్రీయందు శూద్రునివలన పుట్టినవాడు పాపిష్ఠుడని ధర్మశాస్త్రములు నుడువుచున్నవి.

అంత్య: పాపిష్ఠ: (గౌ. ధ. సూ. 4-27)

ఈ చండాలుడు గ్రామమునకు బయట నుండవలెనని మనువు చెప్పుచున్నాడు.

చండాల శ్వపచానాంతు బహిర్గ్రామాత్ప్రతిశ్రయః.

(మను. 10–51)

ఈయనులోమ ప్రతిలోమ సంతానములకే అవాంతర వర్ణములని పేరు.

కావున, తనవంశమును నిలబెట్టుకొన గోరువాడెల్ల స్వవర్ణసంజాతనే వివాహ మాడవలయును. ఒకే వర్ణముగల దంపతులకు పుట్టినసంతానమే యావర్ణమునకు చెందినదగును.

సవర్ణేభ్య స్సవర్ణాసు జాయంతేహి సజాతయః.

(యాజ్ఞవల్క్యస్మృతి 1-91)

భిన్నవర్ణములదంపతులకు చెందినసంతానము వంశము నిలబెట్టుటమాట నటుంచియావర్ణమునకే చెందదనునదిప్రథానాంశము. ఆవర్ణముల కర్మల కాసంతాన మర్హముకాదు.

సమానవర్ణముగల భార్యయందు కన్నసంతానమే కర్మతో సంబంధము గలదగును.

సవర్ణా పూర్వశాస్త్రవిహితాయాం యథ
ర్తుగచ్ఛతస్తేషాం కర్మభి స్సంబంధః.

(ఆపస్తంబం ధ. సూ. 2-13-1)

వర్ణము జన్మసిద్ధము

పైన నుదాహరింపబడిన స్మృతి వాక్యములనుబట్టి, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్ర నామములు జన్మనుబట్టియే కల్గునని స్పష్టమగుచున్నది.

ఇట్లున్నను, కొందరు వర్ణము జన్మసిద్ధము కాదనియు కర్మసిద్ధమనియు నేడు నుడువుట వింతగ తోపకమానదు. ఏధర్మగ్రంథమును తీసికొనినను నీయంశము తెల్లమగును. మహాభారతములో నొకటిరెండుచోట్ల సల్లక్షణములు కలవాడు బ్రాహ్మణుడనియు, దుష్టగుణములు గలవాడుశూద్రుడనియు చెప్పబడినమాట వాస్తవమే. కాని దానియర్థము తీయుటలో మనమొకింత వివేకము నుపయోగింప వలయును.

మహాభారతముపైననుదాహరింపబడిన స్మృతులకు తర్వాత బయలు దేరిన దేకాని పూర్వము బయలుదేరినది కాదని ముందుగ మనము గ్రహింపవలెను. భారతము శ్రుతి స్మృతుల ప్రమాణమునుగూడ లెక్కలేనన్నిచోట్ల సంగీకరించినది. మను ధర్మశాస్త్రము నే భారతము చాల స్థలములలో నుద్ఘటించినది. అట్టిపట్ల మహాభారత మట్లనుటలోగల కారణమేమియని విచారింప వలసియున్నది. యథార్థజిజ్ఞాసువులకిది యొకకష్ట విషయముకాదు. వర్ణములలో బ్రాహ్మణవర్ణము శ్రేష్ఠము, (వర్ణానాం బ్రాహ్మణోగురు:, అని మనువు). దయాసత్య శౌచములు సర్వవర్ణ సామాన్యధర్మములు. ఇవి యాత్మగుణములలోనివి. ఇవి యెవనియందుండునో వాడును శ్రేష్ఠుడే. జాతకర్మాది సంస్కారములకంటెను ఆత్మగుణములు ముఖ్యములని గౌతమధర్మసూత్రాది గ్రంథములు చెప్పుచున్నవి. కొంద ఱంశమును మఱచి వర్ణసిద్ధమైన శ్రేష్ఠతయే శ్రేష్ఠతయని భావింపవచ్చును. అట్టి భావమును నిరసించుటకే ముఖ్యముగ నాత్మ

గుణముల యాధిక్యమును చెప్పుటకే భారతము సద్గుణములు గలవాడు బ్రాహ్మణుడని చెప్పినది. సారాంశమేమన: బ్రాహ్మణు డగ్రవర్ణస్థు డగుటవలన నిట బ్రాహ్మణశబ్దము శ్రేష్ఠుడనుట కుపలక్షణము. కావున నెవడు శ్రేష్ఠుడన సద్గుణములు గలవాడు శ్రేష్ఠుడు; ఎవడు నికృష్టుడన దుర్గుణములు గలవాడు నికృష్టుడు. ఇంతవఱకే యీవాక్యముల భావము. కాళిదాసు రఘువంశములో దిలీపమహారాజును వర్ణించుచు నాతడే ప్రజలకుతండ్రి యని చెప్పినాడు.

"స పితా పితర స్తాసాం కేవలం జన్మహేతవః"

ఇచట పితృశబ్దమున కెట్టియర్థమో యాట బ్రాహ్మణశబ్దమునకు నట్టియర్థమే, అట్లుకాదేని యెన్నియో చిక్కులు వచ్చును.

(1) ఈశ్లోకమునుబట్టి వర్ణములు రెండే యగును. బ్రాహ్మణశూద్ర వర్ణములు. మహాభారత మితరవర్ణములను గూడ నంగీకరించినట్లు మన మెఱుంగుదుము. (2) విదురుడు సద్గుణములు గలవాడేయైనను, నాతడు బ్రాహ్మణుడని భారతములో నెచ్చటను సూచింపబడలేదు. (3) దయాసత్యశౌచాది సద్గుణములను గల్గియుండుట సర్వవర్ణ సామాన్యధర్మమని హిందూధర్మగ్రంథములు చెప్పుచున్నవి. బ్రాహ్మణుడుమాత్రమే సత్ప్రవర్తనమును గల్గియుండ వలయునని చెప్పబడలేదు. శూద్రునకుకూడ సత్యముపల్కుట, క్రోధము లేకుండుట, శుచిగానుండుట ధర్మములని యీక్రింది గౌతమ ధర్మసూత్రము చెప్పుచున్నది.

తస్యాపి సత్యమక్రోధ శ్శౌచం. (గౌ. ధ 10-51)

అయినను నాయావర్ణములకు జన్మసిద్ధముగగల సత్త్వ రజస్తమోగుణముల పాళ్ళనుబట్టి యీ సత్యాదిలక్షణముల నలవఱచుకొనుట కొందఱకు సులభము, కొందఱకు కష్టము కావచ్చును. కాని యీధర్మము లందఱకును సమానములు గనే విధింపబడినవి. శూద్రుడు చెడ్డవాడుగానుండవలయునని యెచ్చటను చెప్పబడలేదు. శూద్రునిపట్ల నట్టి దురభిప్రాయము మన ప్రాచీనులకు లేదు. మంచితనము బ్రాహ్మణుని యందును నుండవచ్చును; శూద్రునియందును నుండవచ్చును బ్రాహ్మణుడు మంచివాడగుచో సద్బ్రాహ్మణు డనబడును: చెడ్డవాడైనచో దుర్బ్రాహ్మణు డనబడును. శూద్రుడు మంచివాడైనచో, సచ్ఛూద్రు డనిపించుకొనును. చెడ్డవాడైనచో దుశ్శూద్రు డనిపించుకొనును. మంచిచెడ్డలకును వర్ణములకును సంబంధ మింతియే కాని, మంచిచెడ్డలు వర్ణమును నిర్ణయింపవు. అట్లే నిర్ణయించుచో, నొకడు తన జీవితకాలములో భిన్నసమములయం దొకప్పుడు మంచివాడుగను, మఱొకప్పుడు చెడ్డవాడుగను నుండుచో వాని వర్ణము క్షణక్షణమునకును మారుచుండవలయును. ఇట్టి వర్ణవ్యవస్థ యేగ్రంథమునను కానరాదు. (4) గుణకర్మలనుబట్టి వర్ణమును నిర్ణయింపవలయుననుచో నది మిగిలిన మహాభారతభాగమున కంతకును విరుద్ధముగ నుండును. ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు క్షత్రియకర్మ నవలంబించినను,

వారు భారతములో నెచ్చటను క్షత్రియులుగ పరిగణింప బడలేదు. బ్రాహ్మణులుగనే పరిగణింపబడిరి. (5) స్మృతి విరుద్ధమైన యితిహాసమునకు ప్రామాణ్యము లేకపోవుట చేతను, స్మృతుల మతమున వర్ణము జన్మసిద్ధమని తేలుట చేతను మహాభారతము తద్విరుద్ధముగ తెల్పుచో నది యప్రామాణికము కావలసివచ్చును (6) మహాభారతాంతర్గతమైన భగవద్గీతయొక్క మతమున వర్ణము జన్మసిద్ధమే యని ముందు ఋజువుచేయబడును. (7) వేదమతమున వర్ణము జన్మసిద్ధమగుటచే పంచమవేదమని పేరుకాంచిన భారతము దానికి విరుద్ధముగ చెప్పజాలదు.

ప్రధానాంశమేమన : మంచి చెడ్డలనుబట్టి కులనిర్ణయము నేధర్మశాస్త్రకారుడును చేయలేదు. మంచివాడు బ్రాహ్మణుడు, చెడ్డవాడు శూద్రుడు-ననునది యాధునిక సంస్కర్తలు కని పెట్టిన విచిత్రవిధానము. ఏధర్మగ్రంథములోనుగూడ మానవుని గుణకర్మలనుబట్టి వర్ణమును నిర్ణయించు నేర్పాట్లు గన్పట్టకుండుట ప్రత్యేకముగ గమనింపదగిన యంశము. మీదుమిక్కిలి బ్రాహ్మణునకు 8 వ సంవత్సరముననను, క్షత్రియునకు 11 'వ సంవత్సరముననను, వైశ్యునకు 12 వ సంవత్సరముననను ఉపనయనము చేయవలెనని యుండుటచే గుణకర్మలతో నిమిత్తము లేకుండగనే బాలుర వర్ణములను నిర్ణయింపవలెననియు, వాడేవర్ణమున జనించినా డనునదియే యాలోచనీయమనియు ఋషులమతమైనట్లు స్పష్టము.

భగవద్గీతామతమున వర్ణము జన్మసిద్ధమా కర్మసిద్ధమా యనునంశము నిపుడు విమర్శింతము.

గీత సర్వసమత్వమును బోధించుననియు, వర్ణవిభేదమున కందు తావు లేదనియు నేడు కొందఱు నుడువుచున్నారు. మఱికొందఱు గీతామతమున వర్ణము జన్మసిద్ధము కాదనియు, మానవుని ప్రకృతినిబట్టి నిర్ణీతము కావలెననియు చెప్పుచున్నారు. ఈరెండు వాదములును నిస్సారములు.

వీరి వాదములే సరియైనవగుచో గీతాగ్రంథమున కుత్పత్తియే లేకుండెడిది. అర్జునుడు క్షత్రియుడగుటచే, ధర్మయుద్ధమునుండి యాతడు విరమింపరాదని కృష్ణుడు ప్రారంభముననే చెప్పియున్నాడు. అర్జునుడు బ్రాహ్మణుడో, మఱియేయన్యవర్ణమునకు చెందినవాడో యైయుండినచో నట్లాతని యుద్ధములోనికి దింపుటకు కృష్ణుడు యత్నించియేయుండడనుటకు గీతలోనే యనేక సాక్ష్యములు గలవు.

"స్వధర్మే నిధనం శ్రేయః", "పరధర్మో భయావహః", "శ్రేయాన్ స్వధర్మో విగుణః" మున్నగు వాక్యములు వ్యర్థ ప్రసంగములు కాకుండవలెనన్నచో, శ్రీకృష్ణుడు వర్ణపద్ధతిని విధించినాడని చెప్పకతప్పదు. నీయిచ్ఛను బట్టియే నీకర్తవ్యము నిర్ణీతమగుచో నీధర్మమును విడచి పరధర్మమును చేపట్టరాదనుటలో నర్థమేమియుండును? జన్మచేతనే నీకొకవిధమైనధర్మము నిర్ణీతమైనదనియు, నదియే నీ స్వధర్మమనియు, నీయిచ్ఛనుబట్టి దానిని వీడి యన్యధర్మమును వహించుట భయావహమనియు గీత చెప్పుచున్నది. ఈజన్మసిద్ధవర్ణధర్మముపట్ల కృష్ణభగవానున కధికాభినివేశము గల్గుట

చేసినే, గీతలో స్వధర్మమును వీడరాదనుమాట యనేక పర్యాయములు చెప్పబడినది. ఈస్వధర్మము జన్మసిద్ధమే యని వాచ్యముగగూడ కృష్ణభగవానుడు నుడివియున్నాడు. ఈస్వ కర్మను "సహజం!" అని భగవానుడు చెప్పినాడు, (సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్,) "నీతోకూడ పుట్టిన" దని దీనియర్థము. వర్ణము జన్మసిద్ధమే యనుట కింతకంటె నేమి కావలయును?

ఎవరి స్వకర్మమును, లేదా, వర్ణధర్మమును, వారు నిర్ణయించుకొనవక్కఱలేదనియు, తానే యాపనిని నెరవేర్చుచున్నాననియు భగవానుడు గీతలో చెప్పుచున్నాడు. ఏజీవు డెట్టికర్మలు చేసికొనినాడో, సత్వరజస్తమో గుణములలో నెట్టిపాళ్ళను గల్గియున్నాడో, యాకర్మలకును, గుణముల కును, తగిన వర్ణములో నాజీవుని పుట్టించుచున్నాననియు, నీవిధముగనే చాతుర్వర్ణ్యసృష్టి తాను చేయుచున్నాననియు, భగవానుడు నుడివినాడు. ఒక డొకవర్ణములో జనించినాడన వాడచ్చట జనించుట పరమేశ్వరని ర్దేశమువలననే జరిగినదని తెలిసికొనవలెను. ఇట్లు గుణకర్మ విభాగమువలననే చాతు ర్వర్ణ్యసృష్టిని చేయుచున్నానని శ్రీకృష్ణుడీక్రిందిశ్లోకములో చెప్పియున్నాడు.

చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః. (గీత 4-13)

కావున నెవ్వడును తన ఇచ్చనుబట్టికాని, మరొకవిధ ముగగాని తనవర్ణమును తాను నిర్ణయించుకొనవక్కఱలేదు.

భగవానుడే యీపనిని చేసినాడని నమ్మి తా నేవర్ణములో జనించిన, నావర్ణముయొక్క ధర్మము నాచరింపుచుండవలె నని యిందువలన తేలగలదు.

ఇట్లు గీతామతిమున వర్ణము జన్మసిద్ధమనియు, వర్ణ ధర్మానుష్ఠానము ముఖ్యకర్తవ్యమనియు తేలుచున్నది. ఉప క్రమోపసంహారములు రెంటిలోను (రెండవ యధ్యాయము నను, పదునెనిమిదవ యధ్యాయమునను) గూడ గీత యీ జన్మసిద్ధవర్ణధర్మానుష్ఠానమును నొక్కిచెప్పుట ప్రత్యేకముగ గమనింపదగిన యంశము.

వేదములలో వర్ణవ్యవస్థ లేదని నేడు కొందఱు చేయు వాదము నిరాధారము. ఏవేదమును దీసికొనినను నాల్గువర్ణ ముల ప్రశంస యందు గన్పట్టును.

ఋగ్వేదదశమమండలమున నీ సుప్రసిద్ధ ఋక్కుగలదు.

బ్రాహ్మణోస్య ముఖమాసీత్,
బాహూరాజన్యః కృతః,
ఊరూతదస్య యద్వైశ్యః,
పద్భ్యాగ్ం శూద్రో అజాయత.

(బ్రాహ్మణుడు విరాట్పురుషుని ముఖమాయెను. క్షత్రియు డాతని బాహువులాయెను. వైశ్యు డాతని యూరువు లాయెను. శూద్రు డాతని పాదములనుండి పుట్టెను.)

ఇచట నాల్గువర్ణములును పేర్కొనబడుటయేకాక యీ వర్ణముల గుణకర్మములుగూడ సూచింపబడినవి.

పై ఋక్కులవలన బ్రాహ్మణుడు విరాట్పురుషుని శిరస్సు వలె నున్నాడని రూపకముగా చెప్పుకొనినను చెప్పుకొన వచ్చును. లేదా, బ్రాహ్మణుడు విరాట్పురుషుని శిరస్సునుండి జనించినాడని చెప్పుకొనవచ్చును. ఈ రెంటిలో నేవిధముగ చెప్పినను శిరోధర్మము బ్రాహ్మణునకు గలదనుట స్పష్టము. "సర్వస్య గాత్రస్య శిరః ప్రధానం" అనునట్లు బ్రాహ్మణు నకు మానవజాతిలో ముఖ్యముగనుండు బుద్ధి యధికమని తేలగలదు. విద్యలను, వేదవేదాంగములను నాతడభ్యసించి యితరుల కుపదేష్టగ నుండగలడు. దీనివలన ప్రధానబ్రాహ్మణ కర్మ తెలియుచున్నది. కర్మయే కాదు, గుణముకూడ వెల్లడి యగుచున్నది. జ్ఞానము సత్వగుణలక్షణమని వేదాంతగ్రంథ ములు చెప్పుచున్నవికదా. కావున బ్రాహ్మణుడు సత్వగుణ ప్రధానుడని యీఋక్కు చెప్పుచున్నది. అట్లే క్షత్రియునకు బాహులక్షణమైన బలము, పరాక్రమము నుండునని దీనివలన తెలియుచున్నది. బలపరాక్రమములచే దుష్టులను శిక్షిం చుట, శిష్టులను కాపాడుట క్షత్రియధర్మమని దీనివలన తేలుచున్నది. ఈకర్మ కనుగుణమైనది రజోగుణము. కావున క్షత్రియునది ప్రధానముగ రజోగుణమని యీఋక్కు తెల్పు చున్నది. ఇట్లే యూరువుల లక్షణములు వైశ్యులకు గలవని యీఋక్కు తెల్పుచున్నది. ఊరువులు శరీరము నిలచుటకు స్థంభములవలె కారణభూతము లగుచున్నవి. అట్లే వైశ్యుడు

సర్వవర్ణములవారు ప్రాణములతో నిలచుటకు కారణభూతుడు. ఎట్లన; అన్నివర్ణములవారికిని తినుట కవసరమగు ధాన్యాదికము పండించువాడు వైశ్యుడు; మఱియు పాలు, పెరుగు, నెయ్యి మున్నగునవికూడ నాతని వలననే వచ్చును గోరక్షణముకూడ నాతని విధులలోని దేకదా. ఇట్లు వైశ్యుడు పాడిపంటలను చేతనుంచుకొన్నవాడై, లోకముయొక్క స్థితికి కారకు డయినాడు.

అట్లే శూద్రుడు పాదలక్షణోపేతుడుగ నిందు కన్పఱుపబడుటచే, సంఘసేవయను నాతని లక్షణమిందు సూచింపబడినది.

ఇట్లు నాల్గువర్ణములవారి గుణకర్మలును నీఋక్కులో సూచింపబడినవి. వేదవాఙ్మయములో నింకను ననేకస్థలములలో నిట్లు చాతుర్వర్ణ్యగుణకర్మలు తెల్పబడినవి. ఈవర్ణములు జన్మతోనే వచ్చినవనుటకు "పద్భ్యాం శూద్రో అజాయత" అను దానిలోని 'అజాయత' అను పదము సాక్ష్యము. వేదమును మనమొకసారి పఠించుచో నింతకంటెను స్ఫుటముగ నీయంశమును—అనగా వర్ణములు జన్మసిద్ధములు అను యంశమును— తెల్పువాక్యము లెన్నియో లభింపగలవు.

ఏవిధముగా జంతువులలో వివిధవర్ణములు గలవో, యావిధముగానే మానవులలో బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు—అనువర్ణములు కలవనియే మన పూర్వుల యభిప్రాయము. రక్తసాంకర్యము చెడ్డదని మన ప్రాచీనవాఙ్మయము నెచ్చట చూచినను తెలియగలము.

తైత్తిరీయ సంహితలో బ్రాహ్మణాది వర్ణము లిట్టి భిన్నవర్ణములుగనే చెప్పబడినవి.

"ప్రజాపతి రకామయత ప్రజాయేయేతి, సముఖత్రి వృతం నిరమమీత. తమగ్నిర్దేవతా అన్వసృజ్యత గాయత్రీ ఛందోరథన్తరంగ్ సామ బ్రాహ్మణో మనుష్యాణా మజః పశూనాం తస్మాత్తే ముఖ్యా, ముఖతో హ్యా సృజ్యన్త, ఉరసో బాహుభ్యాం పంచదశం నిరమమీత తమింద్రో దేవా దేవతా అన్వసృజ్యత. త్రిష్టుప్ఛందో బృహత్సామ రాజన్యో మను ష్యాణామవిః పశూనాం తస్మాత్తేవీర్యావన్తో వీర్యాద్ధ్యసృ జ్యన్త. మధ్యతస్సప్తదశం నిరమమీత. తం విశ్వేదేవా దేవతా అన్వసృజ్యన్త. జగతీఛందో వైరూపగ్ంసామ వైశ్యోమనుష్యాణాం గావః పశూనాం తస్మాత్త ఆద్యా అన్ని ధానాద్ధ్య సృజన్త. తస్మాద్భూయాగ్ంసో న్యేభ్యో భూయి ష్ఠాహి దేవతా అన్వసృజ్యన్త. పత్తఏకవిగ్ంశం నిరమమీత తమనుష్టుప్ఛంద అన్వసృజ్యత వైరాజగ్ంసామ శూద్రోమను ష్యాణామశ్వః పశూనాం తస్మాత్తౌ భూతసంక్రా మిణావశ్వ శ్చ శూద్రశ్చ తస్మాచ్ఛూద్రోయజ్ఞే నక్లుప్తోసహి నేవతా అన్వసృ జ్యత. తస్మాత్పాదా వుపజీవతః పత్తోహ్యాసృ శ్యేతాం."

(తై. సం. 7-1-1)

అర్థము:—ప్రజాపతి ప్రజలను సృజింపగోరెను. ఇతడు ముఖమునుండి త్రివృతమను స్తోమమును నిర్మించెను. పిమ్మట అగ్ని దేవత, గాయత్రీచ్ఛందస్సు, రథంతరసామ, మనుష్యు

లలో బ్రాహ్మణుడు, పశువులలో మేక—ఇవి సృజింపబడి నవి. ఇవి ముఖ్యమైనవి. ఏలనన; ముఖమునుండి సృజింపబడినవికదా. ఆతడు (ప్రజాపతి) వక్షస్థలము నుండియు, బాహువులనుండియు పంచదశస్తోమమును సృజించెను. దాని ననుసరించి యింద్రదేవతను, త్రిష్టుప్ఛందమును, బృహత్సామను, మనుష్యులలో రాజన్యుని (క్షత్రియుని) పశువులలో గొఱ్ఱెను సృజించెను, పరాక్రమస్థానములనుండి సృజింపబడినవి కావున నీపైన తెల్పబడినవి వీర్యవంతములైనవి, ఆప్రజాపతి మధ్యభాగమునుండి సప్తదశస్తోమమును నిర్మించెను. దాని ననుసరించి విశ్వేదేవతలను దేవతలు సృజింపబడిరి. మఱియు జగతీఛందస్సు, వైరూపసామ, మనుష్యులలో వైశ్యుడు, పశువులలో గోవు—ఇవి సృజియింపబడి నవి. కనుక నవి యనుభవింపతగినవి. భోజ్యస్థానమునుండి సృజింపబడినవికదా, అందువలన వీరితరులకంటె సంఖ్య హెచ్చుగ నున్నారు ఏలనన హెచ్చుగనున్న దేవతల ననుసరించి సృజింపబడిరి. ఆతడు పాదములనుండి యేకవింశ స్తోమమును, దాని ననుసరించి యనుష్టుప్ఛందమును, వైరాజ సామమును, మనుష్యులలో శూద్రుని, పశువులలో గుఱ్ఱమును సృజించెను. అందువలన నీశూద్రుడును, గుఱ్ఱములు నితరభూతములపై నాధారపడుదురు. అందువలనే శూద్రుడు యజ్ఞమందర్హత లేనివాడైనాడు. ఆతడు దేవతల ననుసరించి పుట్టలేదుకదా? అందువలన నీతడు పాదముల ననుసరించి జీవించును.

ఇచ్చటకూడ పైన తెల్పబడిన ఋక్కులో నలెనే నాల్గువర్ణముల గుణకర్మలును పేర్కొనబడుటయే కాక, వర్ణములు జన్మసిద్ధములేయని స్పష్టముగ చెప్పబడినది. బ్రాహ్మణునితో బాటు ప్రధానమైన గాయత్రీచ్ఛందస్సు సృజింపబడుటచే నాతనికి వేదమునందు త్తమాధికారము, అనగా అధ్యయనాధ్యాపనాధికారము కలదని తెలియగలదు. మఱియు బ్రాహ్మణునితో బాటు మేక సృజింపబడుటచే మేక జంతువులలో నెట్లు హెచ్చుసత్త్వగుణ సంపన్నమో బ్రాహ్మణుడట్లు సత్త్వగుణప్రధానుడని తెలియగలదు. మేక యెన్నడును రజోగుణమును గన్పఱుపదు. క్షత్రియునితో గూడ ఛందస్సు పుట్టుటచే నాతడును వేదమును పఠింపవలసినవాడే యగుచున్నాడు. గొఱ్ఱెపొట్టేలాతనితో బాటు సృజింపబడుటచేతను, జంతువులలో నెల్ల పొట్టేలే పరాక్రమము గలదగుటచేతను, పరాక్రమము క్షత్రియుని ముఖ్య గుణమనియు, నాతనిలో రజోగుణము హెచ్చనియు తెలియ గలదు. గొఱ్ఱెలో సింహాగ్రగుణము హెచ్చనియు మహాభారతము కూడ చెప్పుచున్నది. (ఆశ్రమ. ప. 43-1. 2)

పెద్దపులిమున్నగునవి క్రౌర్యము ప్రధానముగ గలవే కాని శౌర్యము ప్రధానముగా గలవి కావు. క్షత్రియ లక్షణము శౌర్యమే కాని క్రౌర్యముకాదు.

'శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం' అని గీతావాక్యము. (18-43)

వైశ్యునితోగూడ ఛందస్సు పుట్టినది గనుక, నాతనికిని వేదపఠనాధికారము గలదు. ఆతడు గోవుతోగూడ జనించుటచే గోవువలె నాతడును లోకమును పోషించువాడే. గోక్షీర మాత్రముననే మానవుడు జీవింపగలడుగదా. అట్టిగోవు పాడి పంటలకు చిహ్నముగాగూడ గ్రహింపబడ వచ్చును. రజస్తమో గుణములే వైశ్యవృత్తిలో హెచ్చుగా నుండును. శూద్రుడు పైన తెల్పినవిధముగా పరిచర్యాత్మక వృత్తి గలవాడగుటకు అశ్వసాజాత్యము కారణము. అతనితో ఛందస్సేకాని దేవత జనింపలేదు. కావున నాతని కధికారముకలది వైదిక ఛందస్సు కాదనియు, లౌకిక ఛందస్సనియు తెలియగలదు. వేదములలో ననుష్టుప్ఛంద మున్న మాట వాస్తవమేకాని వైదికచ్ఛందమునకు దేవత యుండు, టచే నది శూద్రున కధికారముకలదికాదు. కావున నాతని కధికారముగలది పురాణేతిహాసాత్మకమైన యనుష్టుప్ఛందమని తెలియుచున్నది. వేదమూలకమైన యజ్ఞమునకూడ శూద్రున కధికారములేదని స్పష్టముగనే చెప్పబడినదికదా. ఇట్లు వర్ణవ్యవస్థపూర్తిగ వేదదృష్టమని తెలియగలదు.

విశ్వామిత్రుడు క్షత్రియుడేయైనను ఘోరతప మొనరించి బ్రాహ్మణత్వమునొందుట వర్ణము జన్మసిద్ధమగుటను బాధించుటలేదా యని కొందర నవచ్చును. కాని పురాణములలో వివరింపబడిన విశ్వామిత్ర జననవృత్తాంతమును పరిశీలించిన వారి కీసందేహము కలుగదు. విశ్వామిత్రుని తల్లిదండ్రుల కాదిలో పురుషసంతతి లేకుండెను. సత్యవతియను కుమార్తె మాత్రముండెను. ఆమె ఋచీకు

డను నొకఋషికి పరిణయము గావింపబడెను. ఒకనాడు సత్యవతి తన కొకకుమారుడును, తన తల్లికొక కుమారుడును కలుగున ట్లనుగ్రహింపవలయునని భర్తనుకోరెను. ఋచీకు డందులకంగీకరించి రెండుకలశలలో మంత్రపూతమైన జలముంచెను. ఒక కలశములోనిజలము బ్రాహ్మణశిశువును జనింప చేయుటకు సమర్థమైనది. రెండవకలశములోని జలము క్షత్రియ శిశువును జనింపచేయుటకు సమర్థమైనది, ఇందు మొదటికలశలోని జలమును సత్యవతియు, రెండవకలశలోని జలము నామె తల్లియు త్రాగవలయునని ఋచీకుని యాదేశము. కాని తల్లికూతులు పొరబాటున నొకరుత్రాగవలసిన జలమును మరొకరు త్రాగిరి. ఇట్లు బ్రాహ్మణశిశువును జనింపజేయుశక్తిగల జలమును సత్యవతితల్లి త్రాగుటచేత నే యామెకు విశ్వామిత్రుడు జనించెను కావున విశ్వామిత్రుని జననమునకు కారణమైనది క్షత్రియబీజముకాదు. అలౌకిక శక్తి కలిగిన, బ్రాహ్మణజననసమర్థమైన మంత్రపూతజలమే యాతనిజన్మకు కారణము. కావున విశ్వామిత్రుని జన్మ వృత్తాంతమువర్ణము జన్మసిద్ధమను సిద్ధాంతమును బాధింపదు బీజభూతమైన మంత్రపూతజలములోనే యిమిడి యుండిన విశ్వామిత్రుని బ్రాహ్మణత్వము తరువాత తపస్సుచే వ్యక్తమైనది.

నేడు క్రొత్తనాగరకత వ్యాపించుటచే ప్రాచీనవర్ణ పద్ధతి సరిపడదని కొందఱు నుడువుచున్నారు. కాని యెట్టి నాగరకత వచ్చినను వర్ణపద్ధతికి తావుండకపోదు. పూర్తిగ శాస్త్రములలో చెప్పబడినట్లు సంచరింపలేమని నిరాశులమై

వర్ణ ధర్మములను వీడనక్కఱలేదు. నేను బ్రాహ్మణుడు బాల్యమున వేదాధ్యయనము చేయక నవీనవిద్య నభ్యసించినను, బ్రాహ్మణునకు విధింపబడిన నిత్యనైమిత్తిక కర్మలను నిర్వహించుకొనుచు తీరిక సమయమున మత గ్రంథపఠనమునను, వేదార్థవిచారణమునను గడుపుచు, సత్వగుణమును వృద్ధినొందించు నాహారాదుల నవలంబించుచు, జీవికకై యుపాధ్యాయాది వృత్తులనే పూనుచు వర్ణధర్మపరుడై యుండుటకేమియు నాటంక ముండజాలదు. అట్లే క్షత్రియులు దేశరక్షణార్థము కంకణము కట్టుకొని, దేశాభ్యుదయమున పాల్గొనుచు నిత్యనైమిత్తిక కర్మలను యథోచితముగ నిర్వర్తించుచు భారతపురాణాది వాఙ్మయములో తీరిక సమయమును పుచ్చుచు పండితులైన సద్బ్రాహ్మణుల గోష్టిచే మత విషయకవిజ్ఞానమును గల్గించుకొనవచ్చును. అట్లే వైశ్యులును ముఖ్యధర్మములను వీడక, ధనసంపాదనము గావించుచు సంఘాభివృద్ధికి దానిని వెచ్చించుచుండవచ్చును. శూద్రులును తమకు విధింపబడినవిధమున నిత్యనైమిత్తికానుష్ఠానపరులై దేశములోనున్న వివిధవృత్తులను చేపట్టి విదేశములనుండి యొక్క సరకుకూడ నిటుదిగుమతి కాకుండునట్లు దేశమును సర్వవస్తుసంభరితము చేయు పరిశ్రమలను నడిపించువారై, సంఘోద్ధరణమును గావించుచు పండితులైన బ్రాహ్మణుల సహవాసమున వైదికధర్మములను తెలిసికొనుచు భారత పురాణాది కాలక్షేపము గావించు  ణులై యుండవచ్చును. నేడు వర్ణధర్మము  డ చుటకేమియు నాటంకము లేదు.

బ్రాహ్మణునకు బ్రాహ్మణవృత్తివలన జీవిక గడువనిచో క్షత్రియవృత్తిని దానివలన గడుపకపోయినచో వైశ్య వృత్తిని గడుపవచ్చునని శాస్త్రములే చెప్పుచున్నవి. (తదలాభే క్షత్రియవృత్తిః, తదలాభే వైశ్యవృత్తిః)
(గౌ. ధ. 7-67)

సంఘాభివృద్ధి కన్నివర్ణములు నవశ్యకము లేయని గుర్తించుకొని వర్ణపద్ధతిని నడపుకొనుటలో నేటిప్రజల కేమియు నాటంకము గన్పట్టదు. పొట్ట గడపుకొనుటకే యిట్లన్య వృత్తిని పూనవచ్చునుగాని భోగము లనుభవించుటకును, ధనమును ప్రోగుచేసికొనుటకును గాదని ముఖ్యముగ గుర్తింప వలెను. ఏవర్ణమువారును ప్రత్యేక సౌకర్యములను పొందుటకు యత్నింపరాదు. ఒక వర్ణముపట్ల మఱొక వర్ణమునకు ద్వేషమును గల్గించు వ్రాతలు, ప్రచారములు నిషేధింప బడవలయును.

వర్ణపద్ధతివలన సంఘసామరస్యము చెడిపోయినదని నేడు చేయబడుప్రచారము నెదుర్కొనవలసిన బాధ్యత ప్రతి హిందూమతాభిమానిపైనను గలదు. సంఘసామరస్యమును చెడగొట్టువారు వర్ణపద్ధతి పోవలెననువారే కాని, యుండ వలెనను వారు కారు. వర్ణపద్ధతియందు నమ్మకమున్నవాడు మరొక వర్ణమువానిని ద్వేషింపడు. నేడు సనాతనులలో నున్న వర్ణసామరస్యము సంస్కర్తలలో లేదు. వర్ణపద్ధతిపై ద్వేషము బయలుదేరనంత కాలము- నిన్న మొన్నటివఱకు- పల్లెటూళ్ళలో నన్నివర్ణములవారును తమతమ భేదములను

ధర్మవిషయములలోనే కాని యితర విషయములలో మరచి, తోటబుట్టువులవలె ప్రవర్తించుచుండిరి. ఇప్పటికికూడ సంస్కారణభావములు చొరని గ్రామములలో బ్రాహ్మణులును, శూద్రులును, క్షత్రియ వైశ్యులును పరస్పర మత్యంతానురాగముతో "అన్న" "తమ్ముడు" "బావ" "అక్క" మున్నగు పేళ్ళతో సంబోధించుకొనుట వినగా శ్రోత్రపర్వమగును. సంస్కారణభావములు బయలుదేరినచోట వర్ణద్వేషము పెరిగి దారుణమైన వైరము, స్పర్థ మున్నగునవి వర్ణములనడుమ కన్పట్టుచున్నవి. వర్ణభేదము పోవలెనను వారిట్లు వర్ణ ద్వేషమునకు కారకులగుటయు, వర్ణపద్ధతి కావలెననువారు వర్ణసామరస్యములో నుండుటయు చూడ, సంఘైక్యమునకు సనాతనులు తోడ్పడుచున్నారో, సంస్కర్తలమని చెప్పుకొనువారు తోడ్పడుచున్నారో తెలియగలదు.

వర్ణపద్ధతిని నిర్మూలింపవలెనను సంస్కారణను బోధించు సంఘములుగాని, వ్యక్తులుగాని వర్ణపద్ధతిలోనున్న సంఘ సామరస్యమును తమ నూతనసంఘమున స్థాపింపలేకపోవుచున్నారు. సర్వవర్ణ సహపంక్తిభోజనము సామరస్య సూచకమని చెప్పుసంస్కర్తలు ప్రదర్శనార్థము జరుగు విందులలోనే తమప్రక్క నితరవర్ణములవారిని కూర్చుండ బెట్టుకొనుచున్నారు. కాని సామాన్యసమయములలో వీరు దమప్రక్కనే పేదవానినో, బిచ్చగానినో కూర్చుండబెట్టుకొని భుజింపరు. ఒక్క సనాతనధర్మపరాయణుడు మాత్రమే యట్లుచేయును.

కోటీశ్వరుడైన బ్రాహ్మణుడు నిత్యకృత్యములో తనప్రక్కను భిక్షమెత్తుకొను బ్రాహ్మణుని కూర్చుండబెట్టుకొని భుజించుటకు శంకింపడు. అట్లే యితరవర్ణములవారును. ఇతరులు ధనమునకు చూపు ప్రాముఖ్యమును సనాతనులు చూపరు. అన్నివిధములైన విభేదములలోను ధనమూలకములగునవి హేయములు. జన్మచే నేర్పడు విభేదములలో దౌష్ట్యము లేదు: ద్వేషము లేదు.

దేశములలో మహారాజకీయ పరిణామములు రావలసియున్న కాలమున అన్నివర్ణములవారును దేశాభ్యుదయమునకు తోడ్పడవలయుననియు స్మృతులు తెల్పుచునేయున్నవి. ఆపత్తులో బ్రాహ్మణుడుకూడ శరమును తీయవలెనని మనుస్మృతి చెప్పుచున్నది. వేదభాష్యకర్తయై, యార్యజ్ఞానవిజ్ఞానమూర్తియై, సమస్తార్య విజ్ఞానశాఖలలోను నత్యుత్తమ గ్రంథములను వెలయింపచేసిన శ్రీవిద్యారణ్యులవారికంటెను వర్ణాశ్రమ ధర్మ పరాయణు డుండగలడా? మహమ్మదీయ ప్రభావము వింధ్యను దాటి దక్షిణాపథమును చొచ్చుసమయమున, దాని నరికట్టి హిందూ ధర్మవిజ్ఞానములను నిలబెట్టుట కా మహామహుడు విజయనగర సామ్రాజ్య స్థాపకుడై రాజకీయధురంధరుడు కాలేదా? నేటికిని దేశ సంరక్షణ విషయమున నావిద్యారణ్యులే యన్ని వర్ణములవారికిని నాదర్శపురుషులు. వర్ణపద్ధతి జాతీయతకు విరుద్ధమను భావము కేవలము భ్రాంతిమూలకము.

అధ్యాయము ౭.

# ఆశ్రమధర్మములు



## ప్రయోజనము.

వర్ణధర్మములు సంఘములోని యంతరములకు సంబంధించినట్లే ఆశ్రమధర్మములు వ్యక్తి జీవితకాలము యొక్క యంతరములకు సంబంధించినవి. మానవుని జీవితకాలము నూరేండ్లగుచో నందు సుమారు పాతికేసి సంవత్సరము లెట్లు గడుపవలయునో తెల్పునవి యాశ్రమధర్మములు. మానవ జీవితము పవిత్రమైనది. కావున దానిని చక్కనిమార్గమున నడపి మానవుని క్రమముగ దివ్యత్వము నొందించునదియే యీయాశ్రమవిధానము. ఆశ్రమములు నాలుగు (1) బ్రహ్మచర్యము (2) గార్హస్థ్యము (3) వానప్రస్థము (4) సన్యాసము. ఇందొక్కొక్కటి మానవుని యభ్యున్నతి కెట్లు తోడ్పడునో చూతము.

## బ్రహ్మచర్యము

సుమారు మొదటి పాతిక సంవత్సరములును బ్రహ్మచర్యములో గడుపవలయును. ద్విజున కుపనయనమైనది మొదలు బ్రహ్మచర్యవ్రతము ప్రారంభమగును.

బ్రాహ్మణునకు ఎనిమిదవసంవత్సరమునను, క్షత్రియునకు పదునొకొండవ సంవత్సరమునను, వైశ్యునకు పండ్రెండవ వర్షమునను ఉపనయనము గావింపవలెను. గర్భప్రవేశము మొదలుకొనియే సంవత్సరముల పరిగణనము.

గర్భాష్టమేషు బ్రాహ్మణం గర్భైకాదశేషు రాజన్యం
గర్భద్వాదశేషు వైశ్యం॥(ఆపస్తంబ. ధ.సూ. 1-1-19)

వేదవిద్యాభ్యాసార్థము వేదమూలమున సద్గురుసన్నిధిని జరుపఁబడు సంస్కారమునకే ఉపనయనమని పేరు. ఈసమయమునసే గాయత్రీమంత్ర ముపదేశింపబడును. ఈగాయత్రితో సరియగు మంత్రము మరియొకటిలేదు. గాయత్రీమహిమను మహర్షులు స్మృతులయందును, పురాణములలోను వేనోళ్ళ కీర్తించియున్నారు. బ్రాహ్మణునకేయితర విద్యాతపస్సులు లేకున్నను గాయత్రీజపమున్నచో నాతడు దుర్బ్రాహ్మణుడు కాకుండ కాపాడబడునని చెప్పబడుట చేతనే గాయత్రీమహిమ వెల్లడి యగుచున్నది.

'గాయత్రీ మాత్రసారోపి నచ దుర్బ్రాహ్మణోభవేత్.

ఉపనయన మైనపిమ్మట ద్విజుడు గురుకులమున 12 ఏండ్లు బ్రహ్మచర్యమును నడపుచు నొక వేదమునైనను ముగింపవలయును.

ద్వాదశ వర్షాణ్యేక వేదే బ్రహ్మచర్యం చరేత్.
(గౌ. ధ. 2-51)

ప్రతి వేదమునందును పండ్రెండేసి సంవత్సరములు బ్రహ్మచర్యమును జరుపవచ్చును. (గౌ. ధ. 2-51) కాని

యది యవశ్యముకాదు. మఱియు ఋషులమతమున కలియుగ ములో దీర్ఘబ్రహ్మచర్యము మంచిదికాదు. కావున పంద్రెం డేండ్ల బ్రహ్మచర్యము చాలును, దీనివలన బ్రాహ్మణుడు కనీసము 20 ఏండ్లప్రాయమునను, క్షత్రియుడు 23 ఏండ్ల ప్రాయమునను, వైశ్యుడు 24 ఏండ్ల ప్రాయమునను వివాహ మాడుట శాస్త్రసమ్మతమని తెలియును. పైన తెల్పబడిన ఉపనయన వయస్సులనుబట్టి యీ వివాహ వయస్సులు తేలును. శూద్రుడు గురుకులమున కేగనక్కఱలేదు. కావున ఆయువులో నాల్గవభాగము అనగా 25 సంవత్సరముల వయస్సువఱకు నాతడు బ్రహ్మచర్యము గడపి వివాహ మాడవలయును.

బ్రహ్మచర్యాశ్రమమున సాధింపవలసిన ముఖ్యప్రయో జనములు మూడు (1) ద్విజులు వేదాభ్యాసమును, ఇతరులు పురాణేతిహాసపఠనమును గావించుట (2) ఇంద్రియనిగ్ర హము నలవఱచుకొని, మనస్సును పారమార్థికజీవనమున కనుగూలము కావించుకొనుట (3) శరీరము భోగపరము కాకుండ కష్టములను సహించుదానినిగా చేసికొని, బ్రహ్మ తేజస్సును వృద్ధినొందించుకొని, దీర్ఘాయువునకు తగిన యువ కాశములను గల్పించుకొనుట. ఈమూటియొక్క ఫలితము లను మానవుడు గృహస్థాశ్రమములో చక్కగా ననుభవిం చును. గృహస్థాశ్రమములో భోగముల నుచితరీతి ననుభవిం చుటకును, భోగములలో పడి ధర్మమును మరువకుండుట కును, వివేకవంతుడై వైదికలౌకికధర్మములను నిర్వర్తించు టకును బ్రహ్మచర్యాశ్రమశిక్షణము సాయపడును.

బ్రహ్మచర్యాశ్రమములో పైన తెల్పిన మానసిక శారీరక సాధనకంగములుగ ననేకనియమములు గలవు. బ్రహ్మచారి వాఙ్నియమము, చేష్టానియమము, ఉదరనియమముగలవాడై యత్యవసరములైన వాక్కులనే పల్కవలెను. అవియు సత్యములేయైయుండవలయును. తన కర్తవ్యమునకు మించిన యేపనిలోను కలుగ జేసికొనరాదు. సత్వగుణమును మాత్రమే వృద్ధిపొందించు నాహారమునే, యదియైనను మితముగనే తినవలయును.

వాగ్బాహూదరసంయమః. (గౌ. ధ. 2–27)

బ్రహ్మచారి భిక్షచేసి యాహారము తెచ్చుకొని దానిని గురువునకుచూపి యాతని యనుజ్ఞ చొప్పున భక్షింపవలయును

నివేద్యగురవే నుజ్ఞాతో భుంజీత. (గౌ. ధ. 2–45)

ఉప్పు, పులుసు, కారము మున్నగు రజోగుణ ప్రకోపకములైన పదార్థములను బ్రహ్మచారి భుజింపరాదు.

ఆతడు మత్తునుగల్గించు నేపదార్థమును సేవింపరాదు. మాంసమును భక్షింపరాదు.

యథాక్షారలవణ మధుమాగ్ం సానీతి.

(ఆపస్తంబ ధర్మసూత్రము 1–4–6)

మఱియు నాతడు గంధమాల్యాది సుగంధవస్తువులను ధరింపరాదు; పగలు నిద్రపోరాదు. కాటుక పెట్టుకొనుట మున్నగు శృంగారవిషయములను వీడవలయును. తైలాభ్యం

గము చేయరాదు ; విలాసార్థమై శకటాదివాహనముల నధి ష్ఠింపరాదు ; చెప్పులను తొడగరాదు ; కామమును దరిచేర నీయరాదు ; క్రోధమునకు దూరుడుగా నుండవలయును. దేని యందును లోభమును పొందరాదు ; వివేకమును వీడరాదు. వదరుబోతుగా నుండరాదు ; వీణావాదనాదులయం దను రక్తుడు కారాదు ; ఉష్ణోదకస్నానము చేయరాదు ; సుగం ధాదులచే విలాసప్రధానముగ దంతధావనాదికము చేయ రాదు ; దేనిని చూచియు సంతోషముచే పొంగిపోరాదు ; నృత్యగానములయందు సక్తుడుకారాదు. పరులదోషముల నెంచరాదు; ప్రమాదములచెంత పోరాదు ఈయంశముల నే గౌతమధర్మసూత్ర మిట్లు చెప్పుచున్నది.

వర్జయేన్మధుమాంస గంధమాల్య దివాస్వ
ప్నాంజనా భ్యంజనయానోపానచ్ఛత్ర
కామక్రోధలోభ మోహా
వాదవాదనస్నానదంతధావనహర్ష నృత్తగీతపరీవాద
భయాని. (గౌ. ధ. 2–18)

బ్రహ్మచారి యిట్టినియమములు గలవాడై, భిక్షచే జీవించుచు, సాయంప్రాతఃకాలములం దగ్నికార్యము చేసి కొనుచుండవలయును.

అగ్నీంధనభైక్ష చరణే. (గౌ. ధ. 2–11)

సంధ్యావందనమును గ్రామముయొక్క బయటకుపోయి చేసికొనవలయును. బహిస్సంధ్యంచ. (గౌ. ధ. 2–15)

బ్రహ్మచారి ముఖ్యముగ చేయవలసిన ధర్మము రేతస్సం రక్షణము. ఆధర్మము చెడునో బ్రహ్మచర్యవ్రతము చెడినట్లే.

కామాద్ధిస్కందయన్ రేతో హినస్తి వ్రత

మాత్మనః. (మను. 2–108)

అట్లు బ్రహ్మచర్యమును పోగొట్టుకొనినవానికి అవకీర్ణి యని పేరు. అవకీర్ణికి ఘోరములైన ప్రాయశ్చిత్తములు విధింపబడినవి.

కనుకనే బ్రహ్మచర్యమునకు భంగము గల్గించు ప్రసక్తులన్నియు బ్రహ్మచారికి నిషేధింపబడినవి. శృంగార విషయమునకు సంబంధించినవన్నియు దూరముగ నుంచ వలసినవే. తుదకు బ్రహ్మచారి అద్దములో తనముఖమును చూచుకొనుటకూడ నిషేధింపబడినది బ్రహ్మచారి స్త్రీల ముఖమును చూడరాదు; వారితో సంభాషింపరాదు.

స్త్రీప్రేక్షణాలంభనే మైథున శంకాయాం.

(గౌ. ధ. 2-121)

బ్రహ్మచారి చదువుకొనుకాలమున గురువునకేమియు దక్షిణ నీయనక్కఱలేదు. ప్రజ లుచితముగ భోజనము పెట్టియు గురు వుచితముగ చదువు చెప్పియు యువకులకు తగిన విద్యాసంపత్తినొసగు నాగరకస్థితి ప్రాచీనభరతఖండ మున నుండెను. ఎంత పేదవానికుమారుడైనను నీవిధముగ [illegible]

ప్రస్తుతదుష్కాల సంఘవ్యవస్థలో నట్టియేర్పాటు లేదుకదా. ప్రస్తుతము ధనికుని బిడ్డనికే యున్నతవిద్యావకాశము కలదు కాని, పేదవాని బిడ్డనికి లేదు. ఆనాడిట్లుకాక ముఖ్యవిషయములలో సంఘసమత్వ ముండెను.

గురుకులములో బ్రహ్మచారులనడుమ పూర్ణమైన సామ్యవ్యవస్థయుండును. మహారాజబిడ్డడు తనసౌధము దిగి వచ్చి, బిచ్చగాని బిడ్డనితో గలసి గురుకులమునచేరి యాతని వలెనే జోలికట్టి భిక్షమెత్తికొని నియమములను పాటించుచు కటికి నేలను శయనించుచు కాలక్షేపము చేయుచుండెను.

పూర్వపద్ధతి విద్యావిధానము ప్రస్తుతము మనదేశమున లేకున్నను, పైనచెప్పిన బ్రహ్మచర్య విధానమున విద్యార్థులలో నెలకొల్పుటకభ్యంతరముండజాలదు. ఏవిద్యావిధానము నడచుచున్నను, అన్నివర్ణములవారికిని పురాణేతిహాసబోధనము అత్యవసరము.

ప్రాచీనభరతఖండమునబ్రహ్మచారి యింద్రియనిగ్రహమును, శరీరదార్ఢ్యమును, కష్టసహిష్ణుతను, విద్యావివేకములను నలవరచుకొని గురుకులమును వీడునపుడు గురువుగారి కేదైనదక్షిణ నీయదలచినవాడై గురువునభిప్రాయమును గన్గొనుచుండెడివాడు సాధారణముగ గురువేమియు కోరెడివాడుకాడు. శిష్యునిశక్తిని పరీక్షించుటకుగాని, కేవలము విలాసార్థముకాని యేదెనకోరుటయు కలదు. అపుడు

శిష్యుడు దేశములో రాజునొద్దకో యేధనవంతుని యొద్దకో పోయి యాచించుటయు వారాతనికోర్కెనవశ్యము పాటించుటయుకలదు. గురుకులమునువీడిన స్నాతక బ్రహ్మచారి యేది యడిగిననునిచ్చి తీరవలయునను నియమము గృహస్థుల పైనను, రాజుల పైనను స్మృతికర్తలు పెట్టినారు. (మను. 11-1)

ఇట్లు గురుకులవాసమును ముగించుకొని, బ్రహ్మచారి యింటికి తిరిగివచ్చుటకుసమావర్తనమని పేరు. ఇంటికివచ్చి, అభ్యంగస్నాన పూర్వకముగ బ్రహ్మచర్యాశ్రమమును ముగించుటకుగావింపబడు సంస్కారమునకు స్నాతకమని పేరు. పైన చెప్పబడిన బ్రహ్మచారికిగల నిషేధము నిప్పటినుండియు తొలగును.

అదివఱలో లేని అద్దముచూచికొనుట కాటుకపెట్టుకొనుట మున్నగునవి యీనాడే ప్రథమమున జరుగును. నేడు వివాహమునకు పూర్వముజరుగు స్నాతకములో పెండ్లికొడుకునకు అద్దముచూపబడును: కాటుకపెట్టబడును. కాని యీ బ్రహ్మచారి యిదివరకెన్నడును, అట్టినియమములు పాటించిన వాడుకానేకాక పోవుటచే, నట్టిసమయములయందును మనకొకసారి మనపతనము జ్ఞప్తికివచ్చుచుండును.

## గార్హస్థ్యము.

బ్రహ్మచర్యవ్రతమును ముగించిన యువకుడు తన వర్ణమునకు చెందినట్టియు, తనగోత్రప్రవరలకు చెందనట్టియు

మాతృబంధువులలోగాని చేరనట్టియు, మంచిలక్షణములు గల్గినట్టియు, సదివజులో వివాహితకాని, వాగ్దత్తకాని కాన ట్టియు, రజస్వలకానట్టియు కన్యను వివాహమాడవలయును. (మను. 3–4 ; వసిష్ఠ 8–2 ; లిఖిత 4-1 ; గౌతమ 4-1 ; యాజ్ఞవల్క్య 1-65)

ఆయువులో రెండవభాగము అనగా సుమారు 50 సంవత్సరముల వయస్సువచ్చువఱకును గృహస్థాశ్రమములో నుండవలయును.

"ద్వితీయమాయుషో భాగంకృతదారో గృహేవసేత్."
(మను. 5–169)

గృహస్థాశ్రమప్రయోజనములు రెండు

1. సామాన్యమానవులకు సహజముగానుండు సంసారవాంఛకు చక్కనిమార్గము నేర్పఱచి దానిని విశృంఖలముగా పోనీయకుండ, నియమబద్ధముగా నడపి, యావాంఛకే పవిత్రతా పరిమళమును గల్గించి మానవుని క్రమక్రమముగా పరిపక్వస్థితిలోనికి దింపుటకు గృహస్థాశ్రమ ముద్దేశింపబడినది. యావజ్జీవ బ్రహ్మచర్యము సర్వోత్తమమైన దనుటకు సందియము లేదు. కణ్వాదిమహర్షులును, శంకరాచార్య పురుషులును గృహస్థాశ్రమమును ప్రవేశింపకయే తరించిరి.

"అనేకాని సహస్రాణి కుమార బ్రహ్మచారిణాం.
దివంగతాని విప్రాణా మకృత్వా కులసంతతిం.
(మను, 5-159)

ఇచట ప్రధానవిషయ మేమన, మానవుడు యావజ్జీవము అస్ఖలితబ్రహ్మచారియై బ్రహ్మచర్యాశ్రమములోగాని, సన్యాసాశ్రమములోగాని యుండగలడా, లేదాయనునది. ఉండలేనిచో వివాహమాడకున్న యెడల వాడు సర్వవిధముల పతితుడగును బ్రహ్మచర్యాశ్రమములో బ్రహ్మచర్యము భగ్నమగుచో వాని కుత్తమగతులులేవు సన్యాసాశ్రమములో బ్రహ్మచర్యము భగ్నమగుచో వానికిప్రాయశ్చిత్తమే లేదు. వాని కారూఢపతితుడని పేరు. ఇట్లు ప్రామాదభూయిష్ఠమైన యావజ్జీవబ్రహ్మచర్యమును సామాన్యమానవుడు గడుపప్రయత్నించుట, ఓటిపడవచే సముద్రముదాటుటకు యత్నించుట వంటిది. కావున వాడు వివాహము చేసికొనుట క్షేమకరము.

మరియు వివాహితుడై, ఏకభార్యాలగ్న మనస్కుడగువానికుండు చిత్తనైర్మల్యము, అవివాహితుడై బహుశాఖాగతబుద్ధియైన వానికుండ నేరదు. అంతియేకాక, వివాహ మొకమతసంస్కారముగ నాదేశింపబడుటచే, గృహస్థునకు భార్యపట్ల కాముకభావమేగాక, ధార్మికప్రవృత్తిగూడ గల్గును. గృహస్థజీవితములో క్రమక్రమముగా కాముకతతగ్గి ధార్మికత ప్రజలుచుండును. చక్కని సాధనవలన క్రమముగ వైరాగ్యముగూడ నలవడును. వివాహములేక యధార్మిక స్త్రీసంపర్కమున జీవితము గడపువాడు పశుప్రాయుడై నశించును.

2. వివాహముయొక్క రెండవప్రయోజనము ఋణత్రయాపాకరణాది ధర్మసముపార్జనము. మానవుడు మూడు ఋణములతో పుట్టుచున్నాడని వేదముచెప్పుచున్నది అందొకటి ఋషిఋణము, రెండవది దేవఋణము, మూడవది పితౄణము. వేదములను చదువుటవలన ఋషిఋణము తీరును. ఏలనన, ఋషులు మనకు వేదము నందజేసినారు. వారిచ్చినది మనముపయోగించికొనుటయే మనము వారిఋణము తీర్చుట. యజ్ఞములను చేయుటవలన దేవతలఋణము తీరును. ఏలనన, దేవతలు మనకు జీవయోగ్యమైన సమస్త వస్తుసమూహమునిచ్చుచున్నారు. అందులకు వారికి కృతజ్ఞతను కనపర్చుటకై వారికాద్రవ్యములో నొకింత భాగమును అగ్నిద్వారమున నర్పించుట మన విధి. అందులకు వారు సంతృప్తులై మనజీవితమునకు సాయపడుచు నుందురు. పితౄణము సంతానము గలుగుటవలనదీరును. ఎట్లన ఈశరీరమును మనకు పితరు లిచ్చిరి. వారెట్లుమనకు జన్మనొసగిరో అట్లే మనమును సంతానమును కని వారివంశమును నిలబెట్టవలెనని వారు కోరుచుందురు. కావున సంతానము కనుటవలన పితరులఋణము తీరును.

ఈ మూడుఋణములలో మొదటిఋణము బ్రహ్మచర్యాశ్రమములోనే చాలభాగము తీరినను గృహస్థాశ్రమములో నిత్యవేదాధ్యయనమువలననేగాని అది పూర్తిగా

తీరదు. రెండవదియగు దేవఋణము తీరుటకు వివాహ మత్యవసరము. భార్యలేనివానికి యజ్ఞము చేయు నధికారము లేదని వేదము చెప్పుచున్నది.

"అయజ్ఞోవాఏషః, యోఽపత్నీకః" (తైత్తిరీయబ్రాహ్మణము 2-2-2-6)

కావున దేవఋణము దీర్చుటకు మానవుడు దార పరిగ్రహణము చేయవలయును. మూడవదియగు పితౄణము సంతానమువలన తీరునుగదా! స్వభార్యయందుగలిగిన సంతానమే మానవుని పవిత్రుని చేయగలదు; అన్యస్త్రీయందు గలిగిన సంతానము ప్రయోజనకారికాజాలదు.

అట్టిసంతానము పితృకర్మలుచేయుటకుకూడ అర్హముకాదు.

సవర్ణాపూర్వశాస్త్ర విహితాయాం యథర్తుగచ్ఛత
స్తేషాం కర్మభిః స్సంబంధః. (అ. ధ. సూ 2-13-1)

పైన తెల్పిన మూడుఋణములను తీర్పవలసిన విధి వేదములలోనే చెప్పబడియున్నది.

జాయమానోవై బ్రాహ్మణః త్రిభిర్ ఋణవాయతే,
బ్రహ్మచర్యేణ ఋషిభ్యోయజ్ఞేన దేవేభ్యఃప్రజయాపితృభ్యః
ఏషవా అనృణోయః పుత్రీయజ్వా బ్రహ్మచారివాసీ.
(తైత్తిరీయసంహిత 6-3-10-4)

ఈ మూడుఋణములను తీర్పక మోక్షము కోరకూడదని మనుస్మృతి చెప్పుచున్నది.

"అనదీత్య ద్విజో వేదానుత్పాద్య తథాసుతాన్,
అనిష్ట్వాచైవయజ్ఞైశ్చ మోక్షమిచ్ఛన్ వ్రజత్యధః.

(మను 6-37)

ఋషులను, దేవతలను, పితురులను సంతృప్తినొందించుటకు గృహస్థుడు ప్రతిదినమునను యత్నించుచుండవలయును. ఋషియజ్ఞము, దేవయజ్ఞము, పితృయజ్ఞము అనునవి నిత్యకర్మలలోనివి. వీనికితోడుగ గృహస్థుడు ప్రతిదినము చేయవలసినవి మరిరెండు యజ్ఞములుగూడ గలవు. అవి మనుష్యయజ్ఞము, భూతయజ్ఞము అనునవి. ఈ పంచ మహాయజ్ఞములు గృహస్థుడు ప్రతిదినమునను చేయవలయును.

దేవపితృ మనుష్యభూతర్షి పూజకః. (గౌ ధ. 5-)

మనుష్యయజ్ఞము గృహస్థుని కర్తవ్యతము ముఖ్యము. గృహస్థునకు ఇతరాశ్రమములకు లేని ధనసంపాదనాధికారము కలదు. ఆధనము నాతడు తన భార్యాపుత్రులను పిత్రాది పోష్యవర్గములను, పోషించుటకు మాత్రమే యుపయోగింపరాదు. ఆకలిగొనికాని, యవసరమువలనగాని యింటికివచ్చిన మానవుని దేవభావముతో సత్కరింపవలయును. దీనికే మనుష్యయజ్ఞమని పేరు. అతిథి విద్యాశీలార్హతనుబట్టి వానిని పూజించుటలో భేదముండవచ్చును; కాని యెట్టివానికైనను ఆహారమిడవలయును. సర్వజంతువులును తల్లినాశ్రయించుకొని యెట్లు బ్రదుకుచున్నవో, యట్లే సర్వమానవులును గృహస్థునాశ్రయించుకొని బ్రదుకుచున్నారు.

"యథా మాతరమాశ్రిత్య సర్వేజీవన్తి జంతవః.
తథాగృహస్థమాశ్రిత్య సర్వేజీవన్తి మానవాః.

వంట చేసికొనలేనివారి కందఱకును అనగా బ్రహ్మచారులు, సన్యాసులు, మార్గస్థులు, దరిద్రులు, మున్నగువారికి శక్తికొలదియు భోజనము పెట్టుట గృహస్థుల విధియని మనుస్మృతి చెప్పుచున్నది.

"శక్తితోఽపచమానేభ్యో చాతవ్యం గృహమేథినా.
(మను 2-32)

హెచ్చుధనము నిలువచేసికొనుటకాని, భోగముల కొఱకే ధనార్జనము చేయుటకాని గృహస్థునకు తగదు.

బ్రాహ్మణగృహస్థుడు మరునాటికికూడ తినుటకు దాచుకొననిచో నది యుత్తమపద్ధతి; మూడుమాసముల గ్రాసమును గల్గియుండుట రెండవపద్ధతి; ఆఱుమాసములకు సరిపడు గ్రాసమును గల్గియుండుట తరువాతపద్ధతి; మూడేండ్లకు సరిపడు గ్రాసమును గల్గియుండుట చివఱిపద్ధతి. ఈయంశము మనుస్మృతిలోని యీ క్రింది శ్లోకములో చెప్పబడినది.

కుసూలధాన్యకో వాస్యాత్కుంభీధాన్యక ఏవవా,
త్ర్యహైహికోవా పి భవేదశ్వస్తనిక ఏవవా. (మను 4-7)

ఇందులకు తగినట్లుగానే బ్రాహ్మణగృహస్థునకు ధనార్జనవిధుల ప్రాశస్త్యముకూడ నిర్ణయింపబడినది. ఇతరులు తమ కక్కఱలేనిదానినిగ భావించిన ధాన్యము, అనగా

కళ్ళములలో మిగిలినధాన్యము మున్నగువానిని ఏరుకొని జీవించుట బ్రాహ్మణున కుత్తమజీవికావిధానము; యాచింపకుండ నెవరైన నిచ్చిన దానిని తీసికొనుట తరువాతపక్షము; యాచించి తీసికొనుట యింకను నికృష్టము; వ్యవసాయముచే జీవించుట యింకను నధమము; వర్తకముచే జీవించుట దానికంటెను తక్కువది; సేవావృత్తిచే మాత్రము ఎన్నడును జీవింపరాదు. ఈభావమే నిరూఢములైన పదములతో నీక్రింది మనుస్మృతి శ్లోకములో నిమడ్చబడినది.

ఋతామృతాభ్యాం జీవేత్తు మృతేన ప్రమృతేనవా,
సత్యానృతాభ్యామపి వానశ్వవత్యాకదాచన. (4-4)

గృహస్థుడు జంతువులపట్లకూడ కొంత దాతృత్వము చూపవలయును. కాకులు, కీటకములు మున్నగునవి భుజించుటకై ప్రతిదినమును గృహస్థుడు భూతయజ్ఞసమయమున కొంత యాహారమును బయట వేయవలయును.

సంవిభాగశ్చభూతేభ్యః కర్తవ్యో నుపరోధతః. (మను4-32)

ఈభూతయజ్ఞములో జంతువుల కన్నమిడుటయే గాక వృక్షాదులకు కూడ నీళ్లు పోయవలయునని కొన్ని స్మృతులలో వివరింపబడి యున్నవి.

ఇట్లు దేవతలు మొదలు పశుపక్ష్యాదులు, క్రిమికీటకములు, తరుగుల్మాదులు మున్నగువానివరకును గృహస్థుని ధర్మము గలదు. గృహస్థునియిల్లు అక్కరగొన్నవారి కాశ్రయముగ నుండవలయును. అతిథులు లోనికిరాకుండ ప్రాకా

రమువద్దనే ద్వారమును మూసివైచుట గృహస్థాశ్రమధర్మ విరుద్ధము. పూర్వకాలమున గృహస్థులును, వానప్రస్థులును గూడ నతిథిపూజ యందెంత యప్రమత్తులై యుండెడివారో మన కావ్య పురాణేతి హాసములలో ననేకోదాహరణముల వలన తెలియ గలదు. గృహస్థుడు గ్రామాంతరములకు పోయినను, అతిథిపూజకు తగినయేర్పాటుల నింటివద్ద చేసియే వెళ్లుచుండెను. మిట్ట మధ్యాహ్నమునగాని, నిశీథమునగాని, యే బాటసారియు, పేదవాడును, శీతవాతాత పాదులవలన బాధపడనవసరము లేకుండ లోపలనున్న గృహస్థునకు తెలుపనక్కరలేకుండగనే యాతనియింట శరణము పొందుటకు వీలుగల్గనచ్చునని ప్రతిగృహస్థుడును తన గృహములో కొంతభాగము వీధియరుగు రూపమున ప్రజలకు విడచివైచుట హిందూసంప్రదాయ సిద్ధము.

ఇట్లు గృహస్థునకు గృహము గాని సౌకర్యముల ననుభవించుటతోబాటు కొంత ధర్మనిర్వహణముగూడ మేళవింప జేయబడినది. మఱియు భార్యాసహితుడై గృహస్థుడు సోమయాగాది క్రతువులను, పుణ్యతీర్థ సంసేవనమును, అదియిది యననేల, సమస్తధర్మ సంగ్రహమును జేయవలయును, అంతియే కాదు. జ్ఞానమునకు దారితీయు వైరాగ్యమునుకూడ గృహస్థాశ్రమములోనే క్రమముగా నలవరచుకొనుటకు యత్నింపనలయును. సత్కర్మాచరణమువలన క్రమముగ చిత్తశుద్ధి యేర్పడి శమదమాది సద్గుణములుగల్గి తుదకు

మోక్షముకూడ ప్రాప్తించును. గృహస్థుడుఋతుకాలములో భార్యను పొందుచుండవలయును. ఒకసంతానము కనువఱకే యీవిధి యని కొన్నిస్మృతులు చెప్పుచున్నవి.

"ఋతుకాలాభిగామీస్యాత్ స్వదార నిరతస్సదా."
(మను 3-45)

ఋతుకాలమనగా ప్రతిమాసమును రజోదర్శనమైనది మొదలు పదునారు దినములు.

"ఋతుఃస్వాభావికః స్త్రీణాం రాత్రయష్షోడశస్మృతాః."

ఈపదునాఱుదినములలో మొదటి నాల్గుదినములను విడువదగినవి.

చతుర్భిరితరైస్సార్ధ మహోభిః సద్విగర్హితైః (మను 3-46)

మిగిలిన పన్నెండుదినములలోను అమావాస్య, పూర్ణిమ ఏకాదశి, పితృదినములు మున్నగు పర్వదినములను విడువవలయును.

"పర్వవర్జం వ్రజేచ్చైనాం తద్వ్రతో రతికామ్యయా."
(మను 3-45)

గృహస్థుని యిహపరములకును సత్సంతానము గల్గుటకును పైనియమము లత్యావసరములు.

గృహస్థుడు స్వభార్యయందే యనురక్తుడు కావలయును. పరస్త్రీసంసేవనము పాపావహము. 'నపరదారాన్ గచ్ఛేత్', అని వేదము చెప్పుచున్నది. ఆయుస్సును హరించు

వానిలో నెల్ల ముందనదగినది పరదారోపసేవన మని మనువు చెప్పుచున్నాడు.

నహీదృశ మనాయుష్యం లోకేకించనవిద్యతే,
యాదశం పురుషస్యేహ పరదారోప సేవనం.
(మను 6-134)

## వానప్రస్థము.

ఇట్లు మానవుడు సుమారు 25 సంవత్సరములు గృహస్థాశ్రమములో గడపి వానప్రస్థాశ్రమములో ప్రవేశింపవలయును. అప్పటికి 50 సంవత్సరములవయస్సు వచ్చును. కనుకనే మనువు గృహస్థునిశరీరమున నెపుడు ముడుతలుపడునో ఆతనితల నెఱసినట్లెప్పుడు గన్పట్టునో, సంతానముయొక్క సంతానము నాతడెపుడు చూచునో యపుడు గృహమునువీడి యడవికి పోవలెనని చెప్పినాడు.

గృహస్థస్తు యదాపశ్యే ద్వలీపలితమాత్మనః,
అపత్యస్యైవ చాపత్యం తదారణ్యం సమాశ్రయేత్.
(మను 6-2)

వార్థకము ప్రవేశించినపిమ్మట ఎవ్వనికిని సంసారబంధముండరాదని దీని యభిప్రాయము. పరమార్థసాధనమున ప్రయత్నములో తీవ్రముగా దిగవలయునని వార్థకప్రవేశము బోధించును. ఈదినములలో నరణ్యములు వాసయోగ్యములుగా లేకుండుటవలనగాని, యడవిలోని ఫలాదులననుభవించు

టకు ప్రభుత్వశాసనము లడ్డువచ్చుటగాని జరిగినను గృహ ముననే యుండి సంసారవిషయములలో జోక్యము గల్గించు కొనకుండకాని దూరదేశమున కేగి పుత్రపౌత్రసంపర్కము లేకుండకాని కాలక్షేపము చేయవచ్చును. ఇంద్రియనిగ్ర హము వానప్రస్థుని ప్రధానలక్షణము.

వనే వసేత్తు నియతో యథావద్విజితేంద్రియః.

(మను 6-1)

వానప్రస్థునకు స్త్రీసాంగత్య? ... చాపల్యము నిషిద్ధము. ఆతడు భార్యను తనతో నుంచుకొనినను, బ్రహ్మచర్యము నవలంభింపవలయును; లేదా భార్యను కుమారునిచెంత విడువవచ్చును.

పుత్రేషు దారాన్నిక్షిప్య వనం గచ్ఛేత్సహైవవా.

(మను 6-3)

వానప్రస్థుడు దుంపలను, పండ్లను భుజించుచుండవల యును. తపస్సు చేసికొనుటలోనే కాలము గడుపుచుండ వలయును.

వైఖానసో వనే మూలఫలాశీ తపశ్శీలః (గౌ. ధ. 3-26)

ఆతడు కేవలము పరమార్థచింతగలవాడై తీవ్రతపస్సు లలోను, చాంద్రాయణాది వ్రతములలోను శరీరమును శుష్కింప చేసికొనవలయును.

తపశ్చరంశ్చోగ్రతరం శోషయేద్దేహమాత్మనః.

(మను 6-24)

వానప్రస్థుడు గూడ దేవపితృమనుష్యభూతర్షి పూజలను, పంచమహాయజ్ఞములను విడువరాదు.

(గౌ. ధ. సూ. 4-29)

సన్యాసాశ్రమమున పూర్తిగ నుండవలసిన యింద్రియ నిగ్రహము, వైరాగ్యము అలవఱచుకొనుటకు వానప్రస్థాశ్రమములో నవకాశము గల్గును. గృహస్థాశ్రమములో నున్నవాడు తాత్కాలిక వైరాగ్యముచేతనో, మఱి యే హేతువుచేతనో హఠాత్తుగ అపరిపక్వస్థితిలో సన్యసించుచో, సన్యాసాశ్రమము తీసికొనినపిమ్మట వాని పూర్వవాసనలు తలయెత్తుచో, వాడు భ్రష్టుడగును. కావున నీదుస్థితిని తొలగించుటకై వానప్రస్థాశ్రమము తోడ్పడును. వానప్రస్థాశ్రమము చాల భద్రమైనది; అందు స్వల్పమగు లోపములు వచ్చినను, సన్యాసాశ్రమములోవలె పతనహేతువులు కావు. కనుక వానప్రస్థుడు దారపుత్రధనసంపర్కము, ఇంద్రియ చాపల్యము మున్నగువానిని విడచుటకును, నిగ్రహ వైరాగ్యములను అలవఱచుకొనుటకును యత్నించుచు తన సాధన పరిపూర్తియైనపిమ్మట సన్యసించును. సన్యాసములో పతనముగల్గు భయము చిరకాల వైరాగ్యాభ్యాసము వలన పూర్తిగా తొలగిపోవును.

## సన్యాసము.

వానప్రస్థాశ్రమమైనపిమ్మట సన్యాసము. సన్యాసి సర్వసంగములను పూర్తిగా పరిత్యజింపవలయును.

చతుర్థమాయుషో భాగం త్యక్త్వా సంగా న్పరివ్రజేత్.

(మను 6-33)

మోక్షమందు దృష్టి నిడుకొనవలయును.

మనో మోక్షే నివేశయేత్.

(మను 6-35)

గృహస్థుడు సర్వసుఖములను కోరియు, పునర్జన్మలో తనకైశ్వర్యాదులు గలుగవలయుననియు కోరి యేకర్మల నైనను చేయుట నిషిద్ధము కాదు. కాని సన్యాసి స్వర్గమును కోరరాదు. పునర్జన్మ కోరరాదు. ఇహలోకసుఖములను కోరరాదు. శమదమాదులను పూర్తిగా కల్గియుండవలయును. ఆత్మపదార్థ మొక్కటియే నిత్యమనియు, మిగిలిన సమస్త వస్తువులు నశ్వరములనియు నాతడు నిత్యము గుర్తించుచుండవలయును. ఈ సంపత్తి కల్గిననేకాని యాతడు సన్యసింపరాదు. ఈ సంపత్తి బ్రహ్మచర్యాశ్రమములోనే రూఢిగా కల్గినను సన్యసింపవచ్చునని స్మృతులలో కలదు. శంకరాచార్యాదుల జీవితము లీయంశమును సమర్థించుచున్నవి.

అతఏవ బ్రహ్మచర్యవాన్ప్రవ్రజతి

(ఆ. ధ. సూ. 2-21-8)

అట్లే గృహస్థాశ్రమమునుండియైనను సన్యసింపవచ్చును. "బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్ గృహాద్వా వనాద్వా" యనుశ్రుతి కలదు.

ఎప్పుడు సన్యసించుట యనునది యంత ముఖ్యవిషయము కాదు. మోక్షదృష్టిని విడచి మగల ప్రాపంచికవిషయములలోను, అనాత్మచింతలోను పడకుండు పరిస్థితియే ముఖ్యము.

సన్యాసి యే కార్యములను పూనరాదు.

అనారంభీ. (గౌ. ధ. 3-25)

ఆతడు ధనమును సేకరింపరాదు.

అనిచయో భిక్షుః. (గౌ. 3-11)

ఊర్ధ్వరేతస్కుడై యుండవలయును. (గౌ. 3-11)

సన్యాసి కెవ్వనితోను సంపర్కముండరాదు. ఎప్పుడు నొక్కడే సంచరింపవలయును.

ఏకఏవ చరేన్నిత్యం. (మను 6-64)

భిక్షమెత్తుకొని జీవింపవలయును. భిక్షకొఱకుమాత్రమే గ్రామములోనికి పోవలయును.

భిక్షార్థీ గ్రామమియాత్. (గౌ. ధ. 3-14)

సన్యాసి గ్రామములంట తిరుగుచుండవలయును, గాని యొకేచోట నుండరాదు.

సన్యాసి యింద్రియచాపల్యమును పూర్తిగా విడువవలయును (గౌ. ధ. 3-17)

ఇంద్రియాణాం నిరోధేనరాగ ద్వేషక్షయేణచ,
అహింసయాచ భూతానా మమృతత్వాయ కల్పతే.
(మను 6-60)

(ఇంద్రియనిగ్రహము చేతను, రాగ ద్వేషపరిత్యాగ ముచేతను, సర్వభూతములపట్లను అహింస నవలంబించుట చేతను అమృతత్వము సాధ్యమగును.)

ఏ క్షుద్రజంతువునుకూడ, నెవనివలన నేమియు భయమును పొందదో వానికి దేహత్యాగానంతరము భయము లేదని మనువు సన్యాసప్రకరణమున చెప్పుచున్నాడు.

యస్మాదణ్వపి భూతానాం ద్విజాన్నోత్పద్యతే భయం.
తస్య దేహాద్విముక్తస్య భయంనాస్తి కుతశ్చన. (6-40)

సన్యాసికిగల యీయహింసాధర్మము మనుష్యులపట్ల మాత్రమేకాక వృక్షములపట్లకూడ గలదు. తీగెలు, చెట్లు మున్నగువాని ఫలపత్రాదులు వానియంత నవి రాలిననే గ్రహింప వలయునుగాని కోసి గ్రహింపరాదు.

నావిప్రయుక్తమోషధి వనస్పతీనా మంగ ముపాదదీత,
(గౌ. ధ. 3-20)

తన దేహముపైన మాత్రము సన్యాసి కభిమాన ముండరాదు. ఆతడు మరణమును కోరరాదు. ఎట్లైనను బ్రతుకవలయుననియు కోరరాదు. సేవకుడు ప్రభువునాజ్ఞ కెదురుచూచు చుండునట్లాతడు మరణకాలమున కెదురుచూచుచుండవలయును.

నాభినందేత మరణం నాభినందేత జీవితం,
కాలమేవ ప్రతీక్షేత నిర్దేశం భృతకోయథా.
(మను 6-45)

ఆతఁడితరులు తన్ను పూజింపవలయునని కోరరాదు ఇతరు లవమానముచేసినను సహింపవలయునేకాని యుద్రిక్తుఁడు కారాదు; తిరిగి యవమానము చేయరాదు.

క్రుద్ధ్యన్తం న ప్రతిక్రుద్ధ్యేదాక్రుష్టః కుశలంవదేత్.

(మను 6–48)

(కోపపడినవానిపై కోపగింపరాదు; ఒకఁడు తన్ను నిందించినను వానికి క్షేమము నే పలుకవలయును).

సన్న్యాసులందఱు ముక్తులుగా నుండవలసిన దేయనియు, ముక్తలక్షణములు లేనివాఁడు సన్న్యాసి కాఁడనియు కొందఱకు భ్రమకలదు. ఇది సరికాదు. సన్న్యాసులలో ముక్తులుకూడ నుండవచ్చును. కాని ముక్తిమార్గముననుండి, పైన వివరింపఁబడిన వైరాగ్యాది సంపత్తికలవారుకూడ సన్న్యాసులుగ నుండవచ్చును. అనగా సన్న్యాసులందరు సిద్ధులుగనే యుండి తీరవలయునను నియమము లేదు; సాధకులుకూడ సన్న్యాసులుగా నుండవచ్చును. సిద్ధులకు కంటె సాధకులకు హెచ్చు నియమములు గలవు.

సన్న్యాసి యెవ్వరితోను సంపర్కము పెట్టుకొననివాఁడై యాత్మపదార్థమునందే క్రీడించుట కలవరచుకొనవలయును. ఆత్మయే యాతనికి సహాయము.

ఆత్మనైవ సహాయేన సుఖార్థీ విచరేదిహ.

(మను 6–49)

జననమరణరాహిత్యము గల్గుటకై యతడు వాని యందు ప్రీతను గల్గించుకొనవలయును. (మను 6-61)

ఇట్లభ్యాసమువలన జీవించి యుండగానే ముక్తుడు కావచ్చును. లేదా, మరణకాలమునకూడ నిట్టిభావముతోనే యుండుటచే

"యంయం వాపిస్మరన్ భావం త్యజత్యన్తే కళేబరం,
తంతమేవైతికౌన్తేయ సదా తద్భావ భావితః" (8-6)

అను గీతావచనము చొప్పున నాతడు తప్పక జనన మరణరాహిత్యము నొందును.

ఇట్లు హిందూమతములోని యాశ్రమవిధాన ముత్తమ సాధనమై మానవుని క్రమక్రమముగ సత్యోత్తమస్థితి నొందించును.



# అధ్యాయము ౫.

# కర్మకాండ

## ప్రయోజనము.

హిందువుడు ప్రతిదినము నాచరింపవలసిన కృత్యములును, అప్పుడప్పుడు నిర్వర్తింపవలసిన కర్మలును, ఈయధ్యాయమున సంగ్రహముగా దెలుపబడును. ఇందు మొదటివానికి నిత్యకర్మలనియు, రెండవవానికి నైమిత్తికకర్మలనియు పేర్లు.

ప్రతిదినము మనమాచరింపవలసిన కృత్యములలోని లేశములనుకూడ హిందూమతము ధర్మరూపమున విధించుచున్నది. "స్నానముచేయుట మొదలుగాగల కర్మలుగూడ మతముక్రిందికే వచ్చునా ?" యని యాధునికులు పరిహాసింతురు కాని హిందూమతములో నిట్టివిధులు చేయబడుట మన సౌకర్యము కొఱకును, లాభముకొఱకును, ఐహికాముష్మికాభివృద్ధికొఱకును నని యాధునికులు గుర్తింపలేకున్నారు. హిందూమతమనునది వేరుగా నొకచోటనుండి, మనజీవితమనునది మరియొకచోట నుండలేదు. మన జీవితములో హిందూమతము పెనవేసికొని పోయినది.

ఈ కర్మల యావశ్యకతను గుర్తించుటలో మన మీక్రింది యంశములను జ్ఞప్తియం దుంచుకొనవలెను.

(1) ఈకర్మవిధులు కొన్ని మనయారోగ్యమునకు సంబంధించినవిగా నున్నవి. ఆరోగ్యము భౌతికవిషయము కావున

మతములోనిది కాదని తలంపరాదు. ఏలన ధర్మమును సాధించుటకు శరీరమే మొదటి సాధనము. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అని మహాకవులుగూడ నుడివియున్నారు. కావున నెవడైనను శరీరమును ధర్మసాధనమునకు తగనిదానినిగా జేసికొనినచో, వాడు ధర్మహానిజేసినాడన్నమాట. కావున నిట్టివిధులుకూడ మతములోనికే వచ్చును. శరీరమును సుస్థితిలో నుంచుటకు వైద్యశాస్త్రము చాలవాయనిన, నొక యంశమును జెప్పవలసి యున్నది. ధర్మశాస్త్రములలో జెప్పబడిన యారోగ్యవిధు లన్నియు, శరీరమును మంచి స్థితిలో నుంచుటకు తోడు మనలో సాత్వికగుణమును వృద్ధి నొందించునట్లుకూడ నున్నవి. కావున నీ విధులను బాలించుట వలన రెండువిధములయిన ధర్మనిర్వహణము గలుగుచున్నది.

(2) మన మహర్షులు చేసిన స్నాన, పాన, భోజనాది నియమములు మన స్థూలదృష్టికి సరిగా నర్థము కాకపో వచ్చును. ఇందులకు కొన్ని ఉదాహరణములు రెండవ యధ్యాయమున నీయబడినవి. కావున మన స్థూలదృష్టికి నర్థ రహితములుగ గన్పట్టినను, మనమత గ్రంథములలో విధింప బడిన యాచారములు విడువదగినవి కావు.

(3) నిత్యనైమిత్తికకర్మలలో వాడబడు మంత్రములు చాల శక్తిగలవగుటచే వానివలన విశేషమైన ఫలము గల్గును. మంత్రశక్తి పూర్వాధ్యాయములలో గొంత చెప్పబడినది.

వేదమంత్రములే కాక, ఋషివిరచితములైన శ్లోకములుగూడ శక్తిమంతములే. వీనినుచ్చరించినమహర్షుల యాధ్యాత్మికశక్తి యింకను, నాయక్షరసంపుటిలో గలదు. అపారతపస్సుచే సిద్ధిపొందినవారి వాక్యమునకును, సామాన్యుల వాక్యమునను ఫలితములో చాల భేదముండును. నేడు మన దేశములో సర్పాది విషములకుగాని, కొన్ని శారీరకరోగములకుగాని వేయబడు మంత్రములు అద్భుతముగా వెంటనే ఫలించుట యాదరము చూచుచున్నాము. ఇట్టి మంత్రములు కొన్ని సంస్కృతేతరభాషలలోగూడ నున్నవి. ఏవియైనను మంత్రములు ఫలించుటలో గల ముఖ్యకారణము ఆమంత్రములను మనకందజేసినవా రాయక్షరసంపుటిలోనికి ప్రవేశింపజేసిన యఖండమైన ఆత్మబలమని చెప్పవచ్చును. మనలోగూడ గొంతయేకాగ్రత యుండవలసిన యవసరమున్నది. కాని యంతకంటెను ముఖ్యమైనది. యా యక్షరసంపుటిలో నిదివరలోనే సిద్ధమైయున్నశక్తి నేడు క్రొత్తగ నొకడు ఘోరతపస్సుజేసి నూతనాక్షరసంపుటిలో మహిమను దెచ్చుట సాధ్యమే. కాని నిత్యము మనమట్టి ఘోరతపస్సు చేయలేము. కావున నిదివరలోనే సిద్ధమైయున్న మహిమగల యక్షరసంపుటి నాశ్రయింపక తప్పదు. సంధ్యావందనాదులలోని మంత్రములనుగాని, వివాహాదులలోని మంత్రములనుగాని మార్చరాదనుటకు గల యనేక కారణములలో నిదియొకటి. వివాహాదులలోని మంత్రములను దేశభాషలోనే జెప్పరాదా యనువారు ముఖ్యముగా నీ యంశములను జ్ఞప్తియందుంచుకొనవలెను.

(4) కర్మకాండలోని క్రియాకలాపముకూడ ముఖ్యమైనదే. తంత్రగ్రంథములలో చెప్పబడిన ముద్రలు, యంత్రములు మున్నగువాని కెట్టిశక్తిగలదో, ఇంచుమించుగా నట్టి శక్తియే యీకర్మకలాపమునకు గలదు. ఇదిగూడ మంత్రముయొక్క శక్తివలెనే సూక్ష్మమైనది. మరియు నీ క్రియాకలాపము గూడ నుండుటచే, మనదృష్టి చాలవరకు మనము చేయు కర్మయందు లగ్నమగుట కవకాశము గలుగును.

నిత్యనైమిత్తిక కర్మల నాచరించుటచే, నిదివరలో సంపాదింపబడిన పాపము క్రమక్రమముగా నశించును ఈ కర్మల యావశ్యకతను కేవలము కర్మవాదులైన పూర్వమీమాంసామతస్థులే గాక, వేదాంతులు గూడ నంగీకరించియున్నారు. శ్రీశంకరాచార్యులవారుగూడ నిత్యనైమిత్తిక కర్మలు గృహస్థుడు తప్పక జేయదగినవేయని చెప్పినారు. ఈకర్మలును, ఫలాపేక్షారహితముగ చేయబడిన జ్యోతిష్టోమాదిక్రతువులునుగూడ చిత్తశుద్ధిని గల్గించును. చిత్తశుద్ధి జ్ఞానమున కత్యవసరము. కావున జ్ఞానమార్గములోనికి పోదలచినవాడు ముందుగా కర్మ చేయవలయును.

## దినప్రారంభకృత్యము.

హిందువుడు నిత్యము నాచరింపవలసిన కొన్నివిధులిపుడుచూతము. ఇందుకొన్ని ముఖ్యములు, కొన్నియముఖ్యములు గావచ్చును. కాని విధులన్నియు తప్పక పాటింపదగినవే.

సూర్యోదయమునకు $1\frac{1}{2}$ గంటల పూర్వమే నిద్ర నుండిలేవవలయును. ఆకాలమునకు బ్రాహ్మముహూర్తమని పేరు.

"బ్రాహ్మే ముహూర్తే బుధ్యేత" (మను 4-92) అనిమనువు చెప్పినాడు. ఈకాలము చాల నమూల్యమైనది. ఈసమయమున నింకను నిద్రించుట శరీరమున. కస్వస్థత కలిగించునని వైద్యులు చెప్పుచున్నారు మఱియునీసమయమున బుద్ధినిర్మలముగానుండి బాగుగ వికసించును. 'బ్రాహ్మి' యనగా 'సరస్వతి' అనగా మనలోనిబుద్ధి. అది ప్రబోధము చెందుకాలముగావున దీనికి బ్రాహ్మముహూర్తమని పేరు.

ఈసమయమున లేచి వెంటనే ధర్మార్థముల నాలోచించి,-అనగా ధర్మమును దానికి విరుద్ధముగాకుండునట్లు ధనము సంపాదించు విధమును నాలోచించి వేదతత్త్వము నొక్కసారి చింతింపవలెనని మనువు చెప్పినాడు. ప్రార్థనము సంక్షేపముగా జేసికొనవలెనని చాలమంది స్మృతికారులు చెప్పినారు.

అంత, జాగుచేయక శౌచవిధులను నిర్వర్తింపవలయును. ఇందులకు కొంతదూరము నడచి గ్రామమునకు బైటకు వెడలవలయును. పిమ్మట దంతధావనము చేయవలయును.

ఉత్తరేణి, బిల్వము, జిల్లేడు, ఉదుంబరము, నేరేడు, వేప ఈ వృక్షముల పుల్లలు దంతధావనమునకు శ్రేష్ఠములు.

పిమ్మట స్నానమాచరింపవలయును. భగవంతుని స్మరించుచు, శాస్త్రములో చెప్పబడిన విధితో స్నానమాచరింపవలెను. వీలైనంతవరకు నదులలో స్నానమాచరింపవలెను. పిమ్మట శుద్ధమైన వస్త్రములను, అనగా అంతకు పూర్వదినమున క్షాళనచేసి యారవేయబడి, యెవ్వరిచేతను స్పృశింపబడియుండని వస్త్రములను ధరింపవలెను. కట్టుబట్టయు, ఉత్తరీయమును ధరింపవలెను. ధౌతవస్త్రధారియై తన కుల సంప్రదాయసిద్ధమైన విధమున విభూతిధారణమునో, ఊర్ధ్వపుండ్ర ధారణమునో గావింపవలెను.

## సంధ్యావందనము

ఇవి యన్నియు నగునప్పటికి, ఒక గంటకాలమునకు మించరాదు. ఇది యత్యంతము ముఖ్యము. ఏలన, స్నానానంతరము సంధ్యావందనము ప్రారంభించి, యర్ఘ్యప్రదానము చేసి గాయత్రీమంత్ర జపమువరకు వచ్చునప్పటి కింకను నక్షత్రములుండవలయును. సూర్యోదయమునకు సుమారు అరగంట పూర్వము, అనగా $1\frac{1}{2}$ గడియలపూర్వము నక్షత్రములు లుప్తమగును. కావున సూర్యోదయమునకు అరగంట కాలమునకు పూర్వమున సంధ్యోపాసనమును ప్రారంభింపవలయును.

నక్షత్రముల యునికియొక్క చివరికాలము మొదలుకొని, సూర్యోదయముయొక్క ప్రారంభకాలమువరకు గల అంతరమునకు సంధ్యాకాలమని పేరు. కాన, నక్షత్రములు

గాని, సూర్యుడుగాని ప్రకాశింపని కాలమునకు సంధ్యని గూడ చెప్పవచ్చును. ఈ కాలములో నద్భుతమయిన పవిత్రత, శక్తికలవు. దీనిని వ్యర్థముగా గడపువాడు బుద్ధిహీనుడు. సంధ్యాకాలనిర్వచన మీక్రిందశ్లోకములో దక్షస్మృతిలో చేయబడినది.

"అహోరాత్రస్య యస్సంధిః సూర్యనక్షత్రవర్జితః,
సాతు సంధ్యా సమాఖ్యాతా మునిభిస్తత్వ దర్శిభిః,

పైన చెప్పినట్లు నక్షత్రములుండగనే గాయత్రీమంత్రమును జపించుటకు ప్రారంభించి, సూర్యోదయ మగువరకు నట్లు జపించుచు నుండవలయును. ఈ యంశమును సమస్త ధర్మగ్రంథములును జెప్పుచున్నవి.

"పూర్వాం సంధ్యాం జపం స్తిష్ఠే
త్సావిత్రీ మార్కదర్శనాత్". (మను 2-101)

అని మనుస్మృతిలో జెప్పబడినది. కావున ప్రతిదినము ఉదయమున సరియైన సంధ్యాకాలములో సుమారు 20 నిమిషములు సావిత్రిని జపింపవలయును. ఈ కాలములో సుమారు మూడు అష్టోత్తరశతములు పూర్తియగును. ఈ సావిత్రీజపమును త్యజించువాడు ద్విజుడు కాజాలడు.

బ్రాహ్మణునకు గాయత్రీ యత్యంతము ముఖ్యము. గాయత్రియే బ్రాహ్మని జీవము. గాయత్రీ సారములేని బ్రాహ్మణుడు తోలుబొమ్మవంటివాడు. గాయత్రీ మంత్రము యొక్క శక్తిస్థలాంతరమున కొంత చెప్పబడినది. అర్థమును

బట్టి చూచినను, గాయత్రినిమించిన ప్రార్థనము గాని, మంత్రము గాని మరియొకటి యుండజాలదు. మన బుద్ధులను ప్రేరేపింపజేయు దివ్యతేజస్సును ధ్యానించుటకంటెను పవిత్రమైనది యేది యుండును; మనలను కర్మలలో ప్రవర్తింపచేయు వలయునను ప్రార్థనకంటెను, సత్కర్మలలో ప్రవర్తింపజేయువలయునో దానిసిగూడ తెల్పవలయునను ప్రార్థన యుత్కృష్టమైనదిగదా! మన మనస్సు పాపములజోలికి బోకుండ కాపాడుటకిట్టి ప్రార్థనము కంటెను గొప్పరక్షక మేమియుండును. ఏవిధముగ చూచినను గాయత్రివంటి రక్షణము మరియొకటి ద్విజునకులేదు. శూద్రులు గాయత్రీ మంత్రార్థ బోధకములగు పురాణ శ్లోకములను పఠింపదగును. అట్టి వనేకములు గలవు వానిని శిష్టులవలన తెలిసికొనదగును.

తపస్సు ప్రధానలక్షణముగాగల బ్రాహ్మణునకు గాయత్రి యత్యంతము ఉపాస్యము. బ్రాహ్మణుడు గాయత్రీ మాత్రసారుడైనను బ్రాహ్మణత్వమును కోలుపోడని యిదివరలో చూచి యుంటిమి.

గాయత్రికంటెను గొప్ప శోధనములేదని "గాయత్ర్యాస్తు పరం నాస్తిశోధనం." అని సంవర్తస్మృతి చెప్పుచున్నది.

ఇట్లు సావిత్రిని జపియించి సూర్యోపస్థానాదికమును గావించి సంధ్యను ముగింపవలయును. ఈ సంధ్యను గ్రామము బయట నేనదియొద్దననో జేయుట మంచిది.

ద్విజుడు సంధ్యావందనము పరిత్యజించినచో భ్రష్టు డగునని సర్వస్మృతులును దెలుపుచున్నవి.

సంధ్యావందనము చేయనివాడేకర్మ చేయుటకును అర్హుడుకాడు ; ఏ కర్మచేసినను పూర్తిగా ఫలింపదు.

సంధ్యాహీనోఽశుచిర్నిత్య మనర్హ స్సర్వకర్మసు,
యదన్యత్కురుతే కర్మ నతస్య ఫలభాగ్భవేత్.

ఋషులు దీర్ఘకాలము సంధ్య నుపాసించినవారగుటచే దీర్ఘాయువును, ప్రజ్ఞను, యశస్సును, కీర్తిని, బ్రహ్మవర్చస్సును పొందుచుండిరని మనువు చెప్పుచున్నాడు.

ఋషయో దీర్ఘసంధ్యత్వాత్ దీర్ఘమాయు రవాప్నువన్,
ప్రజ్ఞాం యశశ్చ కీర్తించ బ్రహ్మవర్చస మేవచ. (4-94)

## ఇతర నిత్య కర్మలు.

ప్రతిదినమును, ఉదయము సంధ్యావందన మైనపిమ్మట గృహస్థు డవశ్యము చేయవలసిన కర్మ అగ్న్యుపాసనము.

'అగ్నిహోత్రంచ జుహుయాత్,
దాద్యన్తే ద్యునిశోస్సదా. (మను 4-52)

ఈ యౌపాసనము గృహ్యాగ్నిలోనే చేయబడును. గృహ్యాగ్ని వివాహముతో ప్రారంభమగును. ఈ యౌపాసన

విధానమును, ఈక్రింద తెలుపబడిన యితరకర్మల విధానము లును గృహ్యసూత్రములలో వివరింపబడినవి. పండితులైన బ్రాహ్మణులవలన వానిని తెలిసికొని యాచరింపవలయును.

గృహస్థు డింట లేనిచో గృహిణియైనను, అగ్నిహోత్ర ములో మంత్రరహితముగా హోమము చేయవలయును.

'అపివా స్త్రీ జుహుయాన్మంత్రవర్జం' అని భరద్వా జుడు చెప్పినాడు.

ఆ హోమములో తండులములు, యవలు, పాలాశ సమిధలు మున్నగునవి యుపయోగింపబడును.

అగ్న్యుపాసన మైనపిమ్మట, బ్రహ్మయజ్ఞము చేయ వలయును. ఇందు దేవతలకు, దేవపత్నులకు ఋషులకు, ఋషి పత్నులకు, పితరులకు, కాండర్షులకు తర్పణములు గావింప బడును. ఈసమయమున నే మహర్షులు మనకందచేసిన వేద ములు, వేదాంగములు మున్నగువానిలోని కొన్ని భాగములు పఠించి వారిఋణము తీర్చుకొనవలయును. ఇదియే పంచమహా యజ్ఞములలో నొకటియగు ఋషియజ్ఞము.

మృతపితృకుడైనవాడు పితృతర్పణము గావింపవల యును. ఇదియు పితృయజ్ఞములో చేరినదేయైనను, పితృ యజ్ఞముయొక్క మరియొకభాగము వైశ్వదేవములో జరు గును.

ఆపిమ్మట దేవతార్చన గావింపవలయును. ఆదిత్యుడు, అంబిక, విష్ణువు, గణనాథుడు, మహేశ్వరుడు – అను పం.

చాయతనము నర్చించుట స్మార్తబ్రాహ్మణులలో నాచార
ముగ నున్నది. కులసంప్రదాయములనుబట్టి దేవతార్చనా
విధానము మారవచ్చును.

స్త్రీలు, శూద్రులుకూడ దేవతార్చన చేయవలయును.
కాని వీరు వేదమంత్రము లేక యాగమవిధానమును చేయ
వలయును.

"స్త్రీశూద్రాణాంచ భవతినామ్నావై దేవతార్చనం,
సర్వేచాగమమంత్రేణ కుర్యుర్వేదానుసారిణా"

అని స్మృత్యర్థసారమున చెప్పబడినది.

అనంతరము వైశ్వదేవ విధానము వచ్చును. ఇందు
దేవతలకు, పితరులకు, భూతములకు అన్నముచేతను, ఉదక
ముచేతను బలులొసగబడును. పిమ్మట మనుష్యయజ్ఞము,
అనగా నతిథిపూజ నాచరింపవలయును.

పైన తెల్పబడిన ఋషియజ్ఞమును, ఈ దేవ, పితృ,
భూత, మనుష్యయజ్ఞములును కలసి పంచమహాయజ్ఞములని
చెప్పబడును. వీని విధానమునుగూడ పండితులైన బ్రాహ్మ
ణులవలన తెలిసికొని వీనిని నిత్యము నాచరింపవలయును.
అన్నిస్మృతులలోను పంచమహాయజ్ఞముల ప్రశంస విశే
షముగా గలదు. ఆశ్రమ ధర్మాధ్యాయమున నీ పంచమహా
యజ్ఞములనుగూర్చి కొంత విచారించి యుంటిమి.

పంచమహాయజ్ఞములు శూద్రులుకూడ నాచరింపవల
యునదే కాని, వారు వేదమంత్రముల నుపయోగింపక యాచ

రింపవలయును. వైశ్వదేవాదులయందు శూద్రుడు వేదమంత్రమునకు బదులు తత్తద్దేవతాపదమును చతుర్థ్యంతమున మనస్సులో ధ్యానించి "నమోనమః" అనవలయునని ఉశనుసుడు చెప్పుచున్నాడు.

"అస్యవైశ్వదేవేషు తత్తద్దేవతాపదం,
చతుర్థ్యన్తం మనసాధ్యాత్వా నమోపమ ఇత్యేవం,
రూపోమంత్రోనుజ్ఞాతో ధర్మజ్ఞైరితి."

వైశ్వదేవానంతరము మాధ్యాహ్నికసంధ్యనాచరించి భోజనము చేయవలయును. భోజనవిషయమున పాటింపదగిన యాచారము లనేకములు గలవు. ఒకపూటవండినది మరొకపూట భుజింపరాదు. ప్రవర్తనము సరిగలేనివారు, సంస్కారములను పొందనివారు, క్రిందివర్ణమువారు స్పృశించిన యన్నమును తినరాదు. ఆహారద్వారమున రజస్తమోగుణములు, దుర్గుణములు సులువుగ సంక్రమించును. ఆహారమును గూర్చి మనశిష్టులలో ననేకనియమము లున్నవి. వానికి శాస్త్రాధారము లేదని త్రోసివేయరాదు. అనేకములకు శాస్త్రాధారమున్నది. కొన్నిటికి లేకపోయినను, శాస్త్రవిరుద్ధములు కాకపోవుటచే నీశిష్టాచారములు ప్రమాణములే యగునని ప్రథమాధ్యాయములో చెప్పబడిన యంశములను బట్టి తెలియుచున్నదిగాదా!

దినమునకు రెండుసార్లే భోజనము చేయవలయును. రెండు భోజనములకు నడుమ నేమియు తినరాదని మనువు చెప్పుచున్నాడు. ఆరోగ్యవిషయమున దీనిప్రాముఖ్య మత్యధికము.

గృహస్థుడు ప్రతిదినము పోష్యవర్గమునకు తప్పక భోజనము నిడవలయునని స్మృతులు చెప్పుచున్నవి. అతిథులు, తలిదండ్రులు, సేవకులు మున్నగువారు పోష్యవర్గము లోనివారు.

ఇట్లు సుమారు 12 గంటల ప్రాంతమున భోజనము చేసి, లౌకికవ్యాపారములను చూచుకొని, సాయంకాలమున స్నానముచేసి సూర్యుడుండగా ప్రారంభించి, నక్షత్రదర్శనమగువరకును సాయంసంధ్య నుపాసించి, నక్షత్రదర్శనమైన పిమ్మట నుపస్థానము చెప్పి అగ్నిహోత్రమాచరించి భుజింపవలయును.

పగటిపూట మిగిలిన సమయములో కొంతభాగమును దేహధారణమున కవసరమగుధనము నార్జించుటయందు వుపయోగించుకొనవలయును. మిగిలినకాలములో కొంతభాగము పురాణేతిహాసములను పఠించుటలో వినియోగింపవలయును. ద్విజుడు ప్రతిదినము వేదము నెంత యధ్యయనము చేసిన నంతమంచిది. బ్రాహ్మణుడు వేదమును ముఖ్యముగ నధ్యయనము చేయుచు నొకరికి చెప్పుచుండవలయును. ఈస్వాధ్యాయ ప్రవచనములచేతనే మానవుడు తరింపగలడనియు, నింకేమియు నక్కఱలేదనియు, తైత్తిరీయోపనిషత్తు (1–9) చెప్పుచున్నది.

"స్వాధ్యాయప్రవచనే ఏవేతినాకో మౌద్గల్యః"

## సంస్కారములు

అప్పు డప్పు డాచరింపదగినవి ముప్పదియైదు సంస్కారములుకలవు. ఇదివరలో తెల్పబడిన పంచమహాయజ్ఞములును, ఈ 35 సంస్కారములును కలసి చత్వారింశత్సంస్కారములుగ గౌతమధర్మసూత్రములలో పేర్కొనబడినవి. (గౌ. ధ. 8-14, 15, 16, 17, 18, 19, 20, 21)

పంచమహాయజ్ఞములు కాక మిగిలిన సంస్కారముల స్వరూపము నిపుడు సంగ్రహముగ చూతము.

(6) గర్భాధానము: దంపతులు సంతానము కనగోరి, గర్భశుద్ధికొరకై, వంశాభివర్ధకుడైన సత్పుత్రుడు గర్భమందు ప్రవేశించుటకొరకై దేవతలను ప్రార్థించు రూపమున చేసుకొను సంస్కారమునకు గర్భాధానమని పేరు. కావున నిది పుట్టబోవువాని నిమిత్తమై చేయబడు సంస్కారము.

(7) పుంసవనము : గర్భోత్పత్తియైనపిమ్మట గర్భస్థ శిశువు పురుషుడగుటకై చేయబడు సంస్కారమునకు పుంసవనమని పేరు.

(8) సీమంతోన్నయనము : గర్భముయొక్క నాల్గవ మాసమందు మాతకు పాపిటదిద్ది, కేశమున పుష్పము లిడి చేయబడు సంస్కారమునకు సీమంతోన్నయన మనిపేరు. దీనివలన శిశువునకు దృఢత్వమేర్పడును. ఇది మొదలు తల్లి సుఖమైనకుమారుడు జనించుటకై నిత్యసుఖజీవనమునుగడపుచుండును. ఈసంస్కారము ప్రథమగర్భమునకు మాత్రమే.

(9) జాతకర్మ : ఇది పుత్రుడు పుట్టగానే తండ్రిచేత చేయుబడు సంస్కారము. దీనివలన పుత్రుడు దీర్ఘాయుష్మంతు డగును.

(10) నామకరణము : ఇది పుత్రుడు జనించిన పదునొకండవదినమున జరుపబడును. ఈసమయమున పేరు పెట్టబడును. పురుషులకు సరిసంఖ్యగల యక్షరములతో గూడిన పేర్లును, స్త్రీలకు బేసిసంఖ్యగల యక్షరములపేర్లను బెట్టవలయును. నాల్గువర్ణములవారికిసి, నాయా గుణకర్మలకు దగిన పేర్లుండవలయును. ఆ పేర్లకు చివర వర్ణద్యోతకములయిన పదము లుండవలయును. అనగా పేరునకు పిమ్మట బ్రాహ్మణునకు శర్మయనియు, క్షత్రియునకు వర్మయనియు, వైశ్యునకు గుప్తయనియు, శూద్రునకు దాసయనియు నుండవలయును.

(11) అన్నప్రాశనము : ఆరవనెలలోగాని సంవత్సరములోపున నెప్పుడుగాని యీసంస్కారము చేయబడును.

(12) చౌలము: దీనినే చూడాకర్మయందురు. ఇదియే కేశఖండనము, కులాచారమునుబట్టి యిది మొదటి సంవత్సరమున గాని, మూడవ సంవత్సరమున గాని, ఐదవ సంవత్సరమున గాని జరుగును.

(13) ఉపనయనము: ఆశ్రమధర్మాధ్యాయనమున దీని స్వరూపము కొంత తెలుపబడినది. ఇది స్త్రీలకు, శూద్రులకు

లేదు పైసంస్కారములు వారికి వేదమంత్రములతో జరుగవు శూద్రులకు వివాహము వేదమంత్రములతో జరుగదు.

(14), (15), (16), (17) నాలుగు వేదవ్రతములు : ఇవి ద్విజబ్రహ్మచారికి వేదము చక్కగా నభ్యాసమగుటకు జేయబడు సంస్కారములు.

(18) సమావర్తనము, లేక స్నాతకము : ఇదియు ఆశ్రమధర్మాధ్యాయములో జెప్పబడినది.

(19) వివాహము: ఇదిగూడ నాయధ్యాయములోనే జెప్పబడినది.

(20) నుండి (26) వఱకు సప్తపాకయజ్ఞములు : ఇందు స్థాలిలో పచనముగావింపబడిన కొన్ని పదార్థములు హోమము చేయబడును. అష్టకము, పార్వణము, శ్రాద్ధము, శ్రావణి, ఆగ్రహాయణి, చైత్రి, ఆశ్వయుజియని వీనినామములు.

(27) నుండి (33) వఱకు, సప్తహవిర్యయజ్ఞములు: ఇవి శ్రౌతకర్మలు. అహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని అను త్రేతాగ్నులలో గావింపబడునవి. అగ్న్యాధేయము, అగ్నిహోత్రము, దర్శపూర్ణమాసేష్టులు, నిరూఢపశుబంధము, సౌత్రామణి, ఆగ్రయణము, చాతుర్మాస్యలు అని వీని పేర్లు.

(34) నుండి (40) వఱకు సప్తసోమసంస్థలు : ఇవి మహాతంత్రముతోను, విపులక్రియాకలాపముతోను గూడి చాల దినములు నిర్వర్తింపవలసిన శ్రౌతకర్మలు. అగ్నిష్టో

మము, అత్యగ్నిష్టోమము, ఊర్థ్వము. షోడశి, వాజపేయము, అతిరాత్రము, అప్తోర్యామము అని వీని పేర్లు. ఈ శ్రౌత కర్మలు స్వర్గాదులను కోరి చేయబడునవి కావున కామ్యము లని కొందఱందురు. కాని యివికూడ నిష్కామముగ నాచరింపవచ్చునని కొందఱి మతము. ఎట్లయినను గౌతముడు వీనిని సంస్కారములలో లెక్కపెట్టినాడు.

## నైమిత్తిక కర్మలు.

పైన తెల్పిన సంస్కారములలో కొన్ని నైమిత్తిక కర్మలుగనే పరిగణింపదగును. నైమిత్తికకర్మలలో మృత పితృకుడు తప్పక యాచరింపవలసినది శ్రాద్ధము. ఇది చేయని వాడు పతితుడగునని శాస్త్రములు చెప్పుచున్నవి. అమావాస్యాతిలతర్పణము మున్నగునవి శ్రాద్ధములలోని భేదములే. ఇవియును తప్పక యాచరింపదగినవి. శ్రాద్ధము నాచరింపని వాడు వర్ణభ్రష్టుడు, ధర్మభ్రష్టుడు నగుటలో సందియము లేదు.

సూర్యచంద్రగ్రహణముల సందర్భమున స్నానదానములు చేయవలయును. అవియు నైమిత్తికకర్మలే. కాశీ, ప్రయాగ, రామేశ్వరాది పుణ్యక్షేత్రసంసేవనమును పాపక్షయముకొఱకు, ఉత్తమగతి ప్రాప్తికొఱకు తప్పక చేయదగినది.

కర్మకాండనంతను నీగ్రంథములోని యొకయధ్యాయమున వివరించుట సాధ్యముకాదు. హిందూమతమునకు చెందినవాడు తప్పక యాచరింపవలసిన విధులలో ముఖ్యమైనవి కొన్నిమాత్ర మిందు సూచింపబడినవి.

## అ ధ్యా య ము ౬.

# శీ ల ము

### ఆ త్మ గు ణ ము లు.

హిందూమతమున కర్మకాండ కెంత యావశ్యకత యున్నను, శీలమున కంతకంటెను హెచ్చు ప్రాముఖ్యము గలదు. సంస్కారములన్నియు నున్నను, శీలము లేనిచో మానవుడు తరింపజాలడు.

ఎనిమిదిగుణములు మానవుని కవశ్యముగ నుండవల యునని గౌతముడు చెప్పుచున్నాడు. అవి యెవ్వియన: (1) సర్వభూతములయందును దయ, (2) క్షాంతి, (3) అన సూయ, (4) శౌచము, (5) అనాయాసము, (6) మంగ ళము, (7) అకార్పణ్యము, (8) అస్పృహ.

'దయా సర్వభూతేషు, క్షాంతి, రనసూయా,
శౌచ, మనాయాసో, మంగళ, మకార్పణ్యా. మస్పృహేతి'
(గౌ. ధ. 8-22)

ఈ గుణముల కాత్మగుణములని పేరు.

### ద య.

పిపీలికాది సమస్తప్రాణులపట్లను దయ గల్గియుండుట యీ యాత్మగుణములలో మొదటిది. ఇది లేనిమానవు డెన్ని

యుత్తమగుణములు గల్గియున్నను, పశుప్రాయుడేయని చెప్ప వచ్చును. భగవద్గీతకూడ నీచయాగుణమును నొక్కి చెప్పు చున్నది.

"అద్వేష్టా సర్వభూతానాంమైత్రః కరుణఏవచ." (12-13)

మున్నగు ననేకస్థలములలో నీదయ బోధింపబడినది. మన కష్టసుఖములవంటివే యితరుల కష్టసుఖములుగూడ ననుభావ ముండవలెను. దీనినే గీత

'ఆత్మౌపమ్యేన సర్వత్ర సమంపశ్యతి యోర్జున,
సుఖంవాయదివా దుఃఖంస యోగీపరమోతమః' (12-13)

అని చెప్పినది. ఉపనిషత్తులుకూడ 'ఆత్మవత్సర్వ భూతాని' యని యాదేశించినవి. పరుల కపకారము చేయ కుండుట దయయొక్క ప్రాథమికావస్థ; పరుల కుపకారము చేయుట రెండవయవస్థ. ఈ దయాగుణముయొక్క ప్రాశ స్త్యమును తెల్పుటకు వ్యాసమహర్షి యిట్లు చెప్పినాడు.

"పాదద్వయేన వక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః,
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం."

(కోట్లకొలది గ్రంథములచే చెప్పబడిన విషయమును రెండుపాదములలో చెప్పుచున్నాను. పరుల కుపకారము చేయుట పుణ్యము; అపకారముచేయుట పాపము.)

ఏభూతమును హింసింపరాదని ఉపనిషత్తులు చెప్పు చున్నవి. "మాహింస్యాత్సర్వాణిభూతాని."

మన గ్రంథములలో నెచ్చట చెప్పినను దయ సర్వ భూతములయందు, ననియే చెప్పినారుకాని యొక్క మానవులయందే యని చెప్పలేదు. కనుకనే పశుపక్ష్యాదులను చంపుటయు, వానిమాంసమును భక్షించుటయు మహాపాపముగ చెప్పబడినది. మనుధర్మశాస్త్రములో నిట్లు కలదు.

నాకృత్వాప్రాణినాం హింసాం మాంస ముత్పద్యతేక్వచిత్,
నచప్రాణివధ స్స్వర్గ్య స్తస్మాన్మాంసం వివర్జయేత్.

(మను 5-48)

(ప్రాణులకు హింసచేయకుండ నెచ్చటను మాంసము లభింపదు. ప్రాణులను చంపుట స్వర్గహేతువుకాక, నరక హేతు వగుచున్నది. కావున మాంసమును విడచిపెట్ట వలయును.)

"ఈలోకములో నే నేజంతువుయొక్క మాంసమును తినుచున్నానో, ఆజంతువు పరలోకములో నన్ను తినును. కావున మాంసమన కాపేరు వచ్చిన" దని (అనగా మాం= నన్ను, సః=అది తినును అని) గుర్తెరుగవలెనని మనువు చెప్పుచున్నాడు.

మాంస భక్షయితా ముత్రయస్యమాంసమిహాద్మ్యహం,
ఏతన్మాంసస్య మాంసత్వం ప్రవదన్తి మనీషిణః.

(మను 5-55)

భూతదయలో ప్రధానాంగమైన యహింస సామాన్య ధర్మము కాదు.

'అహింసా పరమోధర్మః' (మ. భా. అ. 11.13)

అని వ్యాసుడు దీనిని కీర్తించినాడు. భగవద్గీతలో నెచ్చట పట్టిన నచ్చట,

"అహింసాసత్యమక్రోధః," "అహింసాసమతాతుష్టిః" మున్నగు వాక్యములచే నహింసాధర్మము విధింపబడి, ప్రశంసింపబడినది. పూర్ణమైన యహింసను పాటించువానియెదుట మానవులేకాక క్రూరజంతువులుకూడ తమ హింసాస్వభావమును వీడును. అహింసయొక్క యీ ప్రత్యక్షఫలము పురాణగాధలవలన తెలియుటయేకాక పతంజలిమహర్షి చే రచింపబడిన యోగసూత్రములలో కూడ చెప్పబడినది.

'తత్సన్నిధౌ వైరత్యాగః'. (యో. సూ. 2-36)

## క్షాంతి.

రెండవ యాత్మగుణము క్షాంతి. ఎట్టి బాధలనైనను సహించుటయే క్షాంతి. ఆబాధలు శీతవాతాతపాదులనుండిగాని, మానవులనుండికాని రావచ్చును. వానిని భరించునపుడు విచారమును పొందరాదు. వానిని కల్గించిన మానవుని ద్వేషింపరాదు. ఈశాంతికే తితిక్షయనియు పేరు.

ఈ తితిక్ష కుత్తమోదాహరణము భారతములో ధర్మరాజు చెప్పినది. ఒకచేయి చందనములోను, ఒకజేయి యగ్నిలోను నుంచినను తనమన స్సొకేవిధముగ నుండునని యుధిష్ఠిరుడు చెప్పినాడు. ఈవిధముగ కష్టములను సహించుట మనమేలుకొఱకే కాని యితరుల కుపకారముకొఱకు కాదు. కష్టములను సహించుట యలవడుచో, మనము కష్టమును

జయించినవార మగుచున్నాము. దయ యితరుల కుపకరించును. గాని క్షాంతి మనకే యుపకరించును. క్రమాభ్యాసము వలన శీతోష్ణాదిబాధలు, పరు లవమానము చేయుటచే వచ్చుబాధలు- అన్నియు సులువుగ భరింప వీలుగల్గును. దీనివలన దుఃఖము దూరమగును. ఏతదభ్యాసవశముచేత, మరణానంతరమున సూక్ష్మశరీరము ప్రయాణముచేయు వివిధలోకములలో గల్గుబాధలుగూడ సులువుగ భరించుటకు వీలుగల్గును. దివ్యజ్ఞానసమాజమువారును నిట్లే నుడువుచున్నారు. జీవితకాలములో సర్వవిధముల మనకు కష్టసహిష్ణుత కలుగనిచో, నకస్మాత్తుగా మరణానన్తరమున నది రాదు. కనుక నీజన్మలోను, అనంతరముననుగూడ మన శ్శాన్తి కలుగవలెనన్నచో, నీ తితిక్షాగుణము నలవరచుకొనవలెను. ఈసందర్భమున నీక్రింది గీతాశ్లోకమును జ్ఞప్తియం దుంచుకొనవలెను.

శక్నోతీహైవయస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం సయుక్తస్ససుఖీనరః. (5-౨౩)

(ఎవ డీలోకములోనే, శరీరమును విడచుటకు పూర్వమే కామక్రోధముల వేగములను సహించుటకు సమర్థుడగునో, వాడే యోగి; వాడే సుఖవంతుడు).

తితిక్ష యలవరచుకొనుటకు ముఖ్యసాధనము, "బాధ యింద్రియధర్మము కాని, యాత్మధర్మముకా" దని మనము చేయుట యే.

"మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదా,
ఆగమాపాయినోనిత్యాస్తాం స్తితిక్షస్వభారత"(గీత 2-14)

"పంచతన్మాత్రలతోడి స్పర్శలు శీతోష్ణసుఖదుఃఖముల నిచ్చును; అవి వచ్చుచు పోవుచునుండును. ఓయర్జునా! వానిని సహింపుము." అనుమాటలను జ్ఞప్తియందుంచుకొని మనసము చేయుచుందు మేని, యనుభవింపబడుచున్న దుఃఖము సగము తగ్గునని యనుభవజ్ఞులు నుడువుదురు.

## అనసూయ.

మూడవయాత్మగుణము అనసూయ. ఇతరున కేవిధమైన యభివృద్ధికలిగినను నందులకు బాధపడకుండుటయు, వానిని ద్వేషింపకుండుటయు, అనసూయ యనబడును.

అసూయ హృదయములో చిచ్చువలె కాల్చుటయే కాక, యొకప్పుడితరులకు హానినిగూడ గల్గించునట్లు పరిణమింపవచ్చును. కావున అసూయ రెండువిధములుగ ననర్థహేతువు. దానిని తప్పక వీడవలయును.

## శౌచము

నాల్గవయాత్మగుణము శౌచము. శరీరమును, మనకు సంబంధించిన వస్తువులను, వాక్కును, మనస్సునుగూడ పరిశుద్ధముగ నుంచుకొనుటయే శౌచము.

శరీరమునకు మనస్సునకునుగల సంబంధమును మన ప్రాచీనులును, ఆధునికులునుగూడ నంగీకరించినారు. శారీరశౌచము లేనివానికి మనశ్శుద్ధియుండుట యరుదు. వాచికశౌచము వలన రెండుప్రయోజనములు కలవు. (1) సత్యభాషణము; ప్రియహిత భాషణము మున్నగునవి వాచకశౌచము, ఇవి పుణ్యకర్మలు. వీనివలన జన్మాన్తరమందు,

లోకాన్తరమందును నుత్తమగతి గల్గును. అసత్యము, వాక్పారుష్యము మున్నగునవి వాచికాశౌచములోనివి. వీని వలన వ్యతిరేకఫలము గల్గును. (2) వాక్శుద్ధివలన మనశ్శుద్ధి. గూడ గల్గును గావున వాక్శుద్ధి యభ్యుదయహేతువు. ఇక మనశ్శుద్ధివలనగల్గుఫలము లేవన: (1) మనశ్శుద్ధిసత్వగుణలక్షణము; సత్వము జ్ఞానద్వారము; కావున మానవునకు మనశ్శుద్ధి తరణసాధనము. (2) మనశ్శుద్ధి వలన ధర్మాసక్తి నిష్కామకర్మాసక్తి కల్గును; వీనివలన జ్ఞానము ప్రాప్తించును.

ఇట్టినాల్గువిధములైన శౌచమును గల్గియుండుట దైవసంపత్తులోనిది; ఈశౌచము లేకుండుట యాసురప్రకృతి లోనిది. భగవానుడు గీతలలో ఆసురప్రకృతిగలవారిని వర్ణించుచు వారికి శౌచము లేదనినాడు.

'నశౌచం నాపిచాచారోనసత్యం తేషు విద్యతే'. (16-7)

నిత్యము స్నానమాచరించి ధౌతవస్త్రములను ధరించుట శరీరశౌచవిధులలో నొకటి. ముఖ్యమైన శరీరశౌచమును గాపాడుకొనుటకు భగవద్గీతలలో చెప్పబడిన యీక్రింది శారీరకతపస్సు నాచరించుచుండవలయును.

'దేవద్విజగురుప్రాజ్ఞపూజం శౌచమార్జవం,
బ్రహ్మచర్యమహింసాచ శారీరంతప ఉచ్యతే. గీత. 17-14)

(దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించుట, పరిశుద్ధముగానుండుట, ఋజుప్రవర్తనతోనుం

చుట, స్వభావోక్త్యేతర స్థలముల బ్రహ్మచర్య మవలంబించుట ఎవరికిని హింస చేయకుండుట ఇవి శారీరతపస్సుగా చెప్ప బడును.) ఇందు బ్రహ్మచర్యమువలన విశేషప్రత్యక్షఫలము కూడ గల్గును. బ్రహ్మచర్యమువలన శారీరకమానసికాధ్యాత్మిక శక్తులపారముగ వృద్ధిపొందును. ఈశక్తులె బ్రహ్మచర్యమువలన వృద్ధి పొందిన ట్లాహారాదులవలన వృద్ధిపొందవు.

'బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః 'అనిపతంజలి మహర్షి చెప్పినాడు. (యో. సూ. 2-38)

వాచిక శౌచ మలవడుటకైయీక్రింది వాచికతపస్సును చేయవలయును.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చయత్,
స్వాధ్యాయాభ్యసనంచైవ వాఙ్మయం తప ఉచ్యతే.
(గీత. 17-15)

(ఎవ్వరికిని భయమునుగల్గింపని మాటలాడుట,సత్యము నేపల్కుట, ఇంపుగ నుండునట్టియు, నెదుటివానికి మేలును చేయునట్టియు వాక్యమును పల్కుట, వేదాభ్యాసము చేయుట-ఇవి వాచికతపస్సుగా చెప్పబడును.)

మానసిక శౌచమలవడుటకై యీక్రింది మానసిక తపస్సును చేయవలయును.

మనః ప్రసాదసౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః,
భావసంశుద్ధి రిత్యేత త్తపోమానస ముచ్యతే (గీత 17-16)

(మనస్సు ప్రశాంతముగా నుండుట, దుష్టభావములు లేక సద్భావములను కల్గియుండుట, మౌనము వహించుట, ఇంద్రియనిగ్రహము, భావశుద్ధి గల్గియుండుట- ఇవి మానసిక తపస్సు)

## అనాయాసము.

అయిదవ సూత్మగుణము అనాయాసము. దీనిస్వరూపము ప్రమాణాధ్యాయమున, 'ఆత్మతుష్టి'ని వివరించుపట్ల చెప్పబడియున్నది. తనశక్తికిమించిన ధర్మములను చేయుటగాని, పరహింస మున్నగు ధర్మములలోగాని శారీరక మానసికాయాసములను పొందువాడు తమోలక్షణోపేతుడు ఆసురప్రకృతిలోనివాడునని గీత చెప్పుచున్నది. ఇందు మొదటిదానికిదినరలో ప్రమాణము చూపబడినది. రెండవదానికి గీతలలోని యీక్రింది వాక్యమును తీసికొనవచ్చును.

కర్శయన్తశ్శరీరస్థంభూతగ్రామమచేతసః,
మాంచైవాన్తశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసుర నిశ్చయాన్.
(గీత 17-6)

(బుద్ధిహీనులు అహంకారయుక్తులై, ఘోరతపస్సు చేయుచు, తమశరీరములోనున్న పంచభూతములను, నందే యున్న నన్ను గూడ కృశింపచేయుచున్నారు. అట్టివారాసుర నిశ్చయముకలవారు.)

కావున భగవంతునకు నివాసమైన మన పవిత్రశరీరమును వ్యర్థముగాగాని, యహంకారయుక్త కార్యములకొఱకుగాని, బాధపెట్టుటయన నందలి పరమేశ్వరుని హింసపెట్టుటయేయని గ్రహింపవలయును.

ఎల్లప్పుడును సంతోషముతో నుండుట యుత్తమపురుష లక్షణముగ శాస్త్రములలో చెప్పబడినది. 'సంతుష్టస్సతతం యోగీ' 'అహింసా సమతాతుష్టిః' మున్నగు గీతావచనములు సంతుష్టిని ఉత్తమలక్షణముగ చెప్పినవి. ఎట్టి ప్రబలబాహ్యహేతువులున్నను, అంతరంగికముగ మనస్సును కలతనొంద నీయకుండుటకు 'మనఃప్రసాద' మని పేరు. ఇట్టి మనస్సౌఖ్యమును నిరంతరము ననుభవించుట యనాయాసమునకు పరమావధి.

## మంగళము.

మంగళమనునది యాత్మవయాత్మగుణము. నిరంతరము మనము శుభమునే తలచుచుండవలయును; శుభమునే వినుచుండవలయును; చూచుచుండవలయును. అశుభవిషయములను దరిచేరనీయరాదు; అశుభకార్యములను పూనరాదు.

"భద్రం కర్ణేభిశ్శృణుయామ దేవాః
భద్రంపశ్యేమాక్షభిర్యజత్రాః" (తై. ఆ. 1-1)

మున్నగు శ్రుతివాక్యములలో తెల్పబడినట్లు నిరంతరము మాంగళ్యమునే వినుటకును, చూచుటకును కోరుచుండవలయును. ఇట్లు మనస్సహితములైన యింద్రియములను మాంగళ్యమువైపునకే త్రిప్పుదుమేని మన కమంగళము ప్రతిహతమై నిత్యమగు శుభము చేకూరును. ఇది మనస్సుయొక్క శక్తి. ఒక యమంగళభావము మన చుట్టుపట్లనున్నవాని కొకనికున్నచో, అది మనకు కన్పట్టని విధ

మున మనలోకూడ ప్రవేశించి మన మనస్సునుకూడ నొకింత మలినపరచునని యోగులు చెప్పుదురు. కావుననే, అమంగళపదము నోటితో నుచ్చరించుటకుకూడ తగదని మహర్షులు చెప్పిరి. అమంగళమును తప్పనిసరిగ తెల్పవలసినపుడు సంకేతముగా మంగళపదమునే వాడవలయునని స్మృతికర్తలు చెప్పిరి.

'అభద్రం భద్రమితిబ్రూయాత్.' (గౌ. ధ. సూ. 9-21)

వట్టిపోయిన యావును తెల్పుటకు శ్రేష్ఠధేనువాచకమైన 'ధేనుభవ్యా' అనుశబ్దమును వాడవలయును.

ఇట్లు సర్వప్రయత్నములచేతను మానవుడు జీవితమును శుభోపేతము గావించుకొనవలయును.

## అకార్పణ్యము.

అకార్పణ్యమనునది యేడవ యాత్మగుణము. అకార్పణ్యమనగా నెన్నడును దైన్యమును పొందకుండుట.

ఒకబాధ కల్గినప్పుడు దానిని తప్పించుకొనుటకుకాని, యొక లాభమును పొందుటకుగాని ఆత్మగౌరవమును విడచి, యెదుటివానినుండి సహాయముకోరి, దానికొఱకై వానికి దాసుడుగ వ్యవహరించుట దైన్యము. కావున నిట్టి దైన్యపరుడు భగవంతునియందు విశ్వాసములేనివాడగుచున్నాడు. దుఃఖములయందు భయము, సుఖములయందు కోరిక లేకుండవలెనని గీతోపదేశము.

'దుఃఖేష్వనుద్విగ్నమనాస్సుఖేషు విగతస్పృహః' (2-56)

ఇది యెలవఱచుకొని తనకు భగవంతుడు కల్పించిన దానితోనే తృప్తిపడుచుండనలయునని (యదృచ్ఛా లాభ సంతుష్టః) గీత చెప్పుచున్నది. భగవంతుడు సర్వజ్ఞుడు. కావున, మన కేదికావలయునో యాతనికే తెలియునను విశ్వాసముతో నుండువాని యోగక్షేమములను భగవంతుడే వహించును.

'అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాంనిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం.'

(ఇతరుల నాశ్రయింపనివారై నన్నే తలంచుచున్నవారై యేప్రజలు నన్ను సేవింతురో, నిత్యయుక్తులైన యట్టివారి యోగక్షేమములను నేను వహించుచున్నాను.)

అని భగవానుడు చెప్పియున్నాడుకదా. కావున దైన్యమును పొందుట యన భగవంతునియందు నమ్మకము లేకపోవుటను ప్రకటించుటయే! అంతియేకాక, దైన్యావస్థలో మానవు డెదుటివానిని సంతోషపఱచుట కెట్టిపాప కార్యములనైనను చేయవలసివచ్చును. మనముచేయు కార్యములు భగవత్ప్రీత్యర్థ ముండవలయును కాని, కేవలము మానవప్రీత్యర్థ ముండరాదు. కావున దైన్యము తప్పక విడువదగినది.

## అస్పృహ.

ఎనిమిదవ యాత్మగుణము అస్పృహ— అనగా కోరికలు లేకుండుట.

మానవుని ఘనతను నిర్ణయించుటలో కామవిష

నున్నవాడంత నికృష్టుడు; కోరిక లెంతతక్కువగానున్న నంత యుత్తముడు. ఏమియు కోర్కెలులేనివాడు సర్వోత్త ముడు. అట్టిస్థితికి వచ్చి యాత్మపదార్థముతోనే క్రీడించువా డు త్రిగుణాతీతుడైనట్లు గ్రహింపవలయునని గీత చెప్పుచున్నది.

'ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ మనోగతాన్
ఆత్మన్యే వాత్మనా తుష్టస్స్థితప్రజ్ఞ స్తదోచ్యతే.' (2-55)

కావుననే మనుస్మృతియు జీవితవిధానము కామప్రగ్రస్తము కాకూడదని చెప్పుచున్నది.

'కామాత్మతా న ప్రశస్తా.' (2-2)

ఇతరులు తమంత తామేదియైన దానమొసగినను గ్రహిం పకుండుట అస్పృహయొక్క పరమావధి. ఇట్టి గుణమునకు అపరిగ్రహమని పేరు. పరిగ్రహమువలన దాతయొక్క పాపము ప్రతిగ్రహీతకు సంక్రమించునని వేదము (తై.ఆ.2-15) చెప్పు చున్నది. పూర్ణముగా అపరిగ్రహము పాటించువాని మనస్సు అకలుషమైన పూర్వజన్మలోని వృత్తాంతమునుగూడ తెలిసి కొనుటకు సమర్థమగును. దీనివలన జన్మహేతువు స్పష్టమై జన్మరాహిత్యసంపాదనమార్గము గోచరించును. దీనినే-

'అపరిగ్రహస్థైర్యే జన్మకథంతా సంబోధః'

అని పాతంజలయోగ సూత్రము (2-39) చెప్పుచున్నది. నస్పృహతయొక్క నికృష్టపరిణామము చౌర్యము (స్తేయము) మనస్సులోకూడ పరులసొత్తుల కాశింపనివానికి ప్రకృతి దేవ తయే సమస్తసంపత్తులు క్రమముగ చేకూర్చునని యోగ శాస్త్రము చెప్పుచున్నది.

'అస్తేయ ప్రతిష్ఠాయాం సర్వరత్నోపసానం' (2-37)

ధర్మమునందును, భక్తియందును, మోక్షమునందును కోరిక లేనిచో మానవుడు తరింపలేడు. కావున నీ కోరికలు వదలదగినవి కావు. ఇతర కామములు బంధహేతువులు.

## సత్యము.

పైన తెలుపబడిన యాత్మగుణములలో శౌచనమునం దంతర్భూతమైనది సత్యము.

"సత్యాన్నాస్తి పరోధర్మః" అని మహర్షులు బోధించిరి.

అహింసగూడ నిట్టిదగనుకనే, సత్యాహింసలు జోడింపబడి గీతాదిగ్రంథములలో చెప్పబడినవి.

సత్యము చెప్పుచో కొన్నిపట్ల నితరులకు గష్టముకలుగ వచ్చును. అయినను, సత్యమును వీడరాదు. కాని యితరులకు కష్టమునుగలిగించు సత్యమును వ్యర్థముగా పలుకరాదు. ఒకదరిద్రునిజూచి 'నీవు దరిద్రుడ' వనుట వ్యర్థముగా పలుకబడిన సత్యమగును. ఇట్టి సత్యములను పలుకరాదు. ఒకనికి ప్రియము గలుగునుకదాయని అసత్యము నెన్నడును పలుకరాదు. ఇది సనాతనధర్మమని మనుస్మృతి జెప్పుచున్నది.

సత్యంబ్రూయాత్ప్రియంబ్రూయాన్నబ్రూయాత్సత్యమప్రియం
ప్రియంచ నానృతం బ్రూయాదేషధర్మస్సనాతనః.

(మను 4-138)

సర్వస్వమును పరిత్యజించియైనను, సత్యము గాపాడు కొనవలయును. తన్ను బ్రహ్మర్షి యనునందులకు విశ్వామిత్రుడు

వసిష్ఠుని బాధించుటకై వసిష్ఠుని కుమారులను నూర్గురను చంపెను. తాను నమ్మని విషయమును చెప్పి యసత్యదోషమును కట్టుకొనుటకు వసిష్ఠు డంగీకరింపలేదు. తుదకు విశ్వామిత్రుని రజోగుణము పూర్తిగా నణగిన పిమ్మట నాతని బ్రహ్మర్షి యనెను. 'ముందుగ నే యనియుండిన చో నీకుమారులు బ్రతికి యుండెడివారు కాదా!" యని విశ్వామిత్రుడు పల్కెను. అందులకు వసిష్ఠుడు, "అప్పటికి నీకింకను బ్రహ్మత్వము రాలేదు, కుమారులను బ్రతికించుకొనుట కసత్యమాడదగునా? నూర్గురు కుమారులకంటెను నొక్క సత్యవాక్యము గొప్పది" అని సమాధానము చెప్పెను.

"సత్యం పుత్రశతాద్వరం"

వేదములలో గూడ సత్యము ప్రథమధర్మముగ నే చెప్పబడినది. విద్యను ముగించుకొని గురుకులమును వీడిపోవుచున్న శిష్యునకు గురువు చేయు నుపదేశములో మొట్టమొదట "సత్యం వద" అనియే కలదు. (తై. ఉ. 1-11) కావున హిందూమతములో సత్యముయొక్క స్థానము అద్వితీయము.

ఎన్నడు నసత్యము పలుకని వానినోటినుండి యే వాక్కు వెడలినను నది యథార్థమగును. అట్టివానికి కార్యసిద్ధి కితర సాధనములక్కర లేదు. ఆతని వాక్కే గొప్ప క్రియాసాధనము ఈ యంశము స్వీకరించి పాతంజలి సూత్రము తెల్పుచున్నది.

'సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వం.'

(యో. సూ. 2-36)

## ఇతరగుణములు.

పైన తెల్పబడిన ఆత్మగుణములకు పిమ్మట పేర్కొనదగిన యుత్తమలక్షణము లనేకములు గలవు. శ్రుతిస్మృతీతిహాసపురాణములచేత నవి యనేకవిధముల ప్రతిపాదింపబడి యున్నవి. పితృభక్తి, మాతృభక్తి, గురుభక్తి, అతిథిపూజ, సత్పురుష సహవాసము, వినయము. మున్నగునవెన్నియో గలవు.

తల్లిదండ్రులఋణము నూరు జన్మలలోనైనను తీరదని మనుస్మృతి చెప్పుచున్నది.

"యం మాతాపితరౌక్లేశం సహేతే సంభతే నృణాం
నతస్యనిష్కృతిశ్శక్యా కర్తుంవర్ష శ తైరపి" (మను.2-27)

కావున తల్లిదండ్రులను దైవములుగ భావింపవలెను. తైత్తిరీయోపనిషత్తిట్లు చెప్పుచున్నది.

"మాతృ దేవోభవ. పితృ దేవోభవ.
ఆచార్య దేవోభవ. అతిథి దేవోభవ. (11-2)

(తల్లియేదైవముగాకలవాడవగుము. తండ్రియేదైవముగాకలవాడ వగుము. ఆచార్యుడే దైవముగా కలవాడ వగుము. అతిథియే దైవముగా కలవాడవగుము.)

దానముగూడ నిట్టి యుత్తమగుణములలో నొకటి. ఐశ్వర్యమునుబట్టి దానము చేయవలయుననియు, ఔద్ధత్యముచేగాక యింతమాత్రమే దానము చేయుచున్నామను

సిగ్గుచే దానము చేయవలయుననియు, దానము పుచ్చుకొను వానికి కష్టము కలుగునేమో యను భయముతో దానము చేయవలయు ననియు, పాత్రత నెఱింగి పరమేశ్వరార్పణ బుద్ధితో దానము చేయవలయుననియు తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది.

ఉత్కృష్టులైన బ్రాహ్మణోత్తములను చేరబిలిచియు, చెంత జేరియు, వారిని గౌరవించియు, వారి సహవాసమున మాలిన్యము పోగొట్టుకొనవలెననిగూడ నీఘట్టముననే చెప్ప బడినది. పైన దెల్పబడిన సద్గుణముల కన్నిటికిని సహ కారము జేయునది యే యీ సత్సహవాసము.

## కర్మకాండ - శీలము.

ఈ యధ్యాయమున దెల్పబడిన సత్ప్రవర్తనము అత్యం తము ప్రధానమైనది. నడవడిక సరిలేనివా డెంతవిద్యా సంపన్నుడైనను లాభము లేదు. మరణాంతరమున వానికి విద్య లుపకరింపవు. ఈక్రింది వసిష్ఠశ్లోకము గమనింప దగినది.

"ఆచారహీనం నపునన్తి వేదా
యద్య ప్యధీతా స్సహషడ్భిరంగైః
ఛందాంస్యేనం మృత్యుకాలేత్యజన్తి
నీడం శకున్తా ఇవజాతపక్షాః"

(వేదములు, షడంగములతోడను, అధ్యయనము జేయబడినను, మంచినడవడిక లేనివానిని పవిత్రునిగా చేయవు

రెక్కలు వచ్చిన పక్షులు గూటిని వదలిపెట్టి పోవునట్లు. వేదములుగూడ మరణకాలమున నాతని విడచిపోవును.)

హిందూమతములో సంస్కారరూపమైన కర్మకు చాల గొప్పస్థానమే కలదు. కాని యింతకంటె గొప్పస్థానము పైన తెల్పబడిన యాత్మగుణములకు కలదు. కేవలము కర్మగాని, కేవలము ఆత్మగుణములుగాని రక్షింపజాలవు. కాని, యేమయిన కొంచెములోటున్నచో, నది సంస్కారములలో నుండవచ్చునుగాని, ఆత్మగుణములలో నుండుటకు వీలులేదు. సంస్కారములకును, ఆత్మగుణములకును గల తారతమ్యముయొక్క మీమాంస గౌతమధర్మసూత్రములలో చేయబడినది. బ్రహ్మసాయుజ్య సాలోక్యములను పొందవలెనన్నచో, కర్మకాండాధ్యాయమున దెల్పబడిన నలుబది సంస్కారములను, ఎనిమిది యాత్మగుణములను గూడ గలిగి యుండవలెనని గౌతముని యభిప్రాయము. సంస్కారములు పూర్తిగానున్నను, ఆత్మగుణములులేనిచో వానికి బ్రహ్మసాయుజ్య, సాలోక్యములు కలుగవని గౌతమ ధర్మసూత్రములలో స్పష్టముగా జెప్పబడినది.

యస్యైతే చత్వారింశత్సంస్కారా నచాష్టావాత్మగుణాః
నసబ్రహ్మణః సాయుజ్యం సాలోక్యంచ గచ్ఛతి.

(గౌ. ధ. 8–23)

సంస్కారములలో కొన్నియున్నను; ఆత్మగుణములన్నియు నున్నచో సాలోక్యము గల్గునని యీ క్రింది సూత్రము చెప్పుచున్నది.

"యస్యైఖలు సంస్కారాణా మేకదేశోప్యష్టా వాత్మగుణా
అథ సబ్రహ్మణః సాయుజ్యం సాలోక్యంచ గచ్ఛతి గచ్ఛతి"
(గౌ. ధ. 8-24)

ఇచ్చట వ్యాఖ్యాతలు సంస్కారములును, ఆత్మగుణములును పూర్తిగానున్నచో సాయుజ్యముగల్గుననియు సంస్కారములుగొన్నియు, నాత్మగుణములన్నియు నున్నచో సాలోక్యముగల్గుననియు వివరణము చేసినారు.

కర్మకాండయు, నియమములును ముఖ్యములు. ఆత్మగుణము లంతకంటెను ముఖ్యములు.

ఈయాత్మగుణములు-శీలము-సర్వవర్ణములకును విధింపబడుట గుర్తింపదగిన యంశము. మూడవయధ్యాయమున దయాసత్యశౌచాదులతోగూడిన సత్ప్రవర్తనము సర్వవర్ణ సామాన్యధర్మమని చెప్పబడినదాని నిదికూడ బలపరచును. మను విట్లు చెప్పుచున్నాడు.

"అహింసా సత్య మస్తేయం శౌచమింద్రియ నిగ్రహః,
ఏతం సామాసికం ధర్మంచాతుర్వర్ణ్యేఽబ్రవీన్మనుః."
(10-63)

(అహింస, సత్యము, పరధనము హరింపకుండుట, శౌచము, ఇంద్రియనిగ్రహము- సంగ్రహముగా నీ ధర్మమును మనువు నాల్గు వర్ణములకును విధించెను.)

ప్రకరణమునుబట్టి యీధర్మములు నాల్గు వర్ణములకే కాకసంకరవర్ణములకుకూడ విహితములేమియని కుల్లూకభట్టు వ్యాఖ్యానములో వ్రాసినాడు. కావున పైన వివరింపబడిన

సత్ప్రవర్తనము, ఆత్మగుణములు, సర్వహిందువులును అనుస రింపవలయునని తెలియవగును.

## జన్మాంతరము.

తృతీయాధ్యాయము మొదలుకొని యింతవఱకు తెలుప బడిన కర్మకాండ నాచరించుచు, ఆత్మగుణముల నలవరచు కొనుము. స్వవర్ణాశ్రమధర్మపరులైనవారు మరణానంతరమున పుణ్యలోకములలో సుఖముల ననుభవించుటయేకాక, తిరిగి యీలోకమున జన్మించునపుడు పూర్వజన్మలోకంటె నుత్కృష్టవర్ణములోను, ఉత్కృష్టకులములోను జనింతురు ; వెనుకటికంటె ఉత్కృష్టరూపసంపత్తితోను, అధికాయువు తోను, గొప్పవిద్యతోను, ప్రవర్తనతోను, ధనముతోను, సుఖముతోను, బుద్ధితోను నొప్పుదురు. గౌతమధర్మసూత్ర మీ యంశము నీ క్రిందివిధముగ చెప్పినది.

వర్ణా అశ్రమాశ్చ స్వకర్మనిష్ఠాః
ప్రేత్యకర్మఫలమనుభూయ తతశ్శేషేణ
విశిష్ట దేశజాతి కులరూపాయుశ్శ్రుత
వృత్త విత్తసుఖమేధసో జన్మ ప్రతిపద్యన్తే. (11-29)

కర్మకును, పునర్జన్మకును సన్నిహితసంబంధము కలదు. కర్మనుబట్టియే పునర్జన్మయుండును. ఈయర్థమున ఆత్మగుణ ములుకూడ కర్మలోనికే చేరును.

పునర్జన్మసిద్ధాన్తము హిందూమతమునకు ప్రత్యేకలక్షణము. హిందూమతముపై తిరుగుబాటుగ బయలుదేరిన బౌద్ధజైనమతములుగూడ నీ పునర్జన్మ సిద్ధాన్తము నంగీకరించినవి.

మానవుడీజన్మలో చేసికొనిన కర్మనుబట్టి యాతని తరువాతజన్మను భగవానుడు నిశ్చయించునని కొంతవఱకు వర్ణవ్యవస్థాధ్యాయమున చెప్పబడినది. రమణీయమైన యాచరణముగలవారు బ్రాహ్మణ, క్షత్రియాది రమణీయ యోనులయందు జనింతురనియు, దుష్టమైన యాచరణముగలవారు శూరక చండాలాది యోనులయందు జనింతురనియు ఛాందోగ్యోపనిషత్తుగూడ చెప్పుచున్నది.

తద్య ఇహ రమణీయచరణా అభ్యాశో
హాయత్తే రమణీయాం యోనిమాపద్యేరన్
బ్రాహ్మణయోనిం వా క్షత్రియ యోనిం వా వైశ్య
యోనిం వాఽథయ ఇహ కపూయచరణా అభ్యాశో
హాయత్తే కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం
వా సూరకయోనిం వా చండాల యోనిం వా.

(ఛాం. ఉ. 5-10)

ఈపునర్జన్మసిద్ధాన్తమును శ్రీ భగవానుడు 'గీతలో యోగభ్రష్టు నుదాహరణము తీసికొని యత్యంతము రమ్యముగా చెప్పియున్నాడు. (గీత 6–40 నుండి 45 వఱకు.)

కల్యాణసంకల్పమును, కల్యాణకర్మారంభమును గలవానిని జన్మ జన్మాంతరములయందును, లోకాంతరములయందును గూడ వాను వీడక, వానిని క్రమముగ నుత్తమస్థితిలోనికి తెచ్చెదనని భగవానుడు ప్రతిజ్ఞ చేసియున్నాడు.

భగవానునకు పూర్ణమైన యనుగ్రహము గల్గినపుడు జ్ఞానోదయమై మోక్షము సిద్ధించును. జననమరణరూపసంసారముతప్పి, నిత్యనిరతిశయానందము ప్రాప్తించుట మోక్షము యొక్క స్వరూపము. దీని వివరములను చివఱి యధ్యాయమున చూతము. మోక్షమే పరమ గమ్యస్థానము. కామ్యకర్మలవలన స్వర్గాదిలోకములలోను, ఈ జన్మలలోను, జన్మాంతరములోను సుఖము గలుగవచ్చును; కాని యీసుఖములు శాశ్వతములుగావు. భక్తులును, జ్ఞానులును నీవిధమైన సుఖము నేవగించుకొందురు. నిత్యనిరతిశయ సుఖమే వారి లక్ష్యము. ఎల్లరును దీనినే దృష్టిలో నిడికొని స్వవర్ణాశ్రమధర్మములను వీలైనంతవఱకు నిష్కామముగా నీశ్వరార్పణ బుద్ధితో నాచరించుచు ఆత్మగుణముల నలవఱచుకొనవలయును.



అధ్యాయము ౭

# స్త్రీధర్మము



## స్వాతంత్ర్యము

హిందూమతము స్త్రీపురుషుల కొకేధర్మమును నియమింపదగుననునది యసందిగ్ధమైన విషయము. ధర్మములో స్త్రీకి స్వాతంత్ర్యమే లేదు.

"అస్వతంత్రా ధర్మేస్త్రీ." (గౌ. ధ. 18-1)

అని గౌతమధర్మసూత్రము చెప్పుచున్నది.

పురుషునకుకూడ భార్యలేనిదే యజ్ఞయాగాది కర్మలను చేయుట కధికారములేనిమాట వాస్తవమే.

"అయజ్ఞోవా ఏషః యోఽపత్నీకః."

అని తైత్తిరీయబ్రాహ్మణములో చెప్పబడినది. (2-2-2-6)

కాని భేదమేమన; పురుషుడొకధర్మకార్యమునుచేయ దలచినపుడు భార్య యాతనికితోడ్పడి తీరవలయు నను విధి గలదు. స్త్రీయన్ననో; భర్తయనుమతిలేనిదే యేధర్మము చేయుటకును వీలులేదు. ఉపవాసము, వ్రతము మున్నగునవి కూడ భర్తయనుమతితోనే జరుగవలయును. భర్తయనుజ్ఞలేకుండ చేయబడు వ్రతములు రాక్షసులకు చేరునని స్మృతులు చెప్పుచున్నవి.

అపృష్ట్వాచైవ భర్తారం యానారీకురుతే వ్రతం,
సర్వం తద్రాక్షసాన్ గచ్ఛేదిత్యేవం మనురబ్రవీద్.
(పరాశర 2–16)

దీనియుద్దేశము స్త్రీకి ధర్మములేదని కాదు. స్త్రీకిగల ధర్మములన్నిటిలోను భర్తృవాక్యపరిపాలనము, పతిభక్తి అత్యుత్తమములు అని దీనియర్థము.

"స్త్రీభిర్భర్తృవచః కార్యమేషధర్మః పరఃస్త్రియః."

(స్త్రీకి భర్త్రాజ్ఞను పాలించుట యన్నిటికంటెను గొప్పధర్మము) అని మనువు చెప్పుచున్నాడు.

స్త్రీకి ధర్మవిషయముననే స్వాతంత్ర్యము లేనప్పుడు, లౌకిక విషయములమాట వేరుగ జెప్పనక్కరలేదు. అన్ని విషయములలోను స్త్రీలు అస్వతంత్రలని మనువు చెప్పుచున్నాడు. స్త్రీని బాల్యమున తండ్రియు, యౌవనమున భర్తయు, వార్ధకమున, భర్తవానప్రస్థుడైనచో, పుత్రుడును రక్షింపవలెనని మను వీక్రిందిశ్లోకములో చెప్పినాడు.

"పితారక్షతికౌమారే భర్తారక్షతి యౌవనే,
రక్షన్తివార్ధకేపుత్రా న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి." (9–3)

స్త్రీలు తమ యధీనమున నున్నారుకదాయను భావమున, వారికేవిధమైన సుఖమును కలుగనీయక, యనవసరముగ నిర్బంధములలో నుంచుపురుషులు తమయధికారమును దుర్వినియోగము చేసికొనువారగుచున్నారు. ఆకర్మఫలమును వారనుభవింతురు. అంతియేకాక, యట్టి పురుషుల

వలన ధర్మమునకు హానిగల్గును. అట్టి దుష్టపురుషుల చర్య వలన బాధలను పడలేక స్త్రీలు చివఱకు బఱితెగించుటయు సంఘములో స్త్రీస్వాతంత్ర్యము కావలయునను నాందోళనము బయలుదేరుటయుగూడ జరుగును. కావున, ధర్మము లోకములో నిలువవలయుననిన నెవరిహద్దులలో వారుండవలయును స్త్రీలకు స్వాతంత్ర్యము లేకుండుట వారికి బాధను గల్గించుటకుగాదని గుర్తించుట యవసరము.

దాంపత్యమవిచ్ఛిన్నముగ నుండవలెనన్నచో, భార్యాభర్తలలో నొకరికి స్వాతంత్ర్యము లేకుండుట తప్పదు. ఇరువురకును స్వాతంత్ర్య ముండుటయనగా, నిత్యమును కలహమునకనకాశనుగుటయే. ఒకేవిషయమున నిరువురిలో నొకరి కొకవిధముగా దోచవచ్చును; మరియొకరికి మరియొకవిధముగా దోచవచ్చును. అందువలన నొకరి విధానమునకు మరియొకరి విధానముతో సంఘర్షణము కలుగును. అట్టిపరిస్థితిలో నెవరో యొకరు రెండవవారు చెప్పినట్లు వినవలయునను నియమము లేనిచో, గృహములో శాంతి, సామరస్యము పోవును. దంపతులలో నెవరోయొకరు తమ వ్యక్తిత్వమును రెండవవారిలో లీనము చేసికొనుట యత్యావసరము. ఇట్లెవరు తమ వ్యక్తిత్వమును వదలుకొనవలెనన స్త్రీయే యనుట కనేక హేతువులు గలవు. భిన్నదేశములలోని నాగరికతాచరిత్రలు, వివిధమతముల యాదేశములు, మానవ మనస్తత్వశాస్త్రము, స్త్రీపురుషులకుగల శారీరక

శక్తులు మున్నగునవన్నియు స్త్రీ పురుషునిలో తనవ్యక్తిత్వ మును లీనము చేసికొనుట కనుకూలించును; గాని, పురుషుడు స్త్రీయందు తనవ్యక్తిత్వమును లీనము చేసికొనుట కనుకూలింపవు.

## గృహిణి.

గృహకృత్యములలో స్త్రీకి పూర్ణమైన స్వాతంత్ర్యము కలదు. గృహములోని ద్రవ్యమునకామెయే స్వామినియని వేదము చెప్పుచున్నది.

"పత్నీ పారిణహ్యస్యేశే." (తై. సం. 6-2-1-1)

గృహమే స్త్రీయొక్క స్థానమనుటకు శ్రుతిస్మృతుల లోననేకాధారములు కలవు. "జాయేదస్తం" (భార్యయే గృహము) అని ఋగ్వేదములో (3-53-4) చెప్పబడినది. మనుస్మృతిలో పురుషునకు గురుకులవాస మెట్టిదో స్త్రీకి గృహకృత్యములట్టివని చెప్పబడినది.

## దాంపత్యవిచ్ఛేదము.

పైన తెల్పినట్లు దంపతులలో నొకరు మరొకరి యధీన మందుండి తీరవలయునను నియమమే లేనిచో, సంఘమున వివాహవిచ్ఛేదము లాచరణములోనికి వచ్చును. పాశ్చాత్య దేశములలో నట్లే యున్నది. అభ్యాసవశమున క్రమముగా భార్యభర్తలలో నైక్యమొందుటకు వీలున్నను, వ్యక్తిస్వాతం త్ర్యముపేర పాశ్చాత్యు లావీలు నుపయోగించుకొన కున్నారు. మన ప్రాచీనులు సంప్రదాయబలము చేతను, ఇతి

హాసపురాణ దృష్టసతీమణుల యుదాహరణములచేతను స్త్రీలలో భర్తృతన్మయత్వము గల్గు మార్గములను జూపి యున్నారు.

దంపతులకు మానసికైక్యము గల్గించుటకై మంత్రములు వేదములలో కొన్ని యున్నవి. గృహ్యసూత్రములలో నట్టి యైక్యమును గల్గించువిధానములు సూచింపబడినవి. బోధాయన గృహ్యసూత్రములో జూపబడిన ప్రక్రియ యిట్లుకలదు.

"అథాస్యా ఉపోత్థాయ, దక్షిణేన హస్తేన, దక్షిణమంసం ప్రతి, బాహుమన్వాహృత్య, హృదయ దేశమభిమృశతి. 'మమహృదయే హృదయంతే అస్తు మమచిత్తే చిత్తమస్తు. మమవాచ మేకమనాశ్శృణు మామేవా నువ్రతా సహచర్యామయాభవ ఇతి అథాస్యై దక్షిణేకర్ణే జపతి, 'మాం తేమనః ప్రవిశతు, మాం' చక్షుర్మా ము పేతుభగః, మయిసర్వాణి భూతాని, మయిప్రజ్ఞానమస్తుతే."

(బో. గృ. సూ. 1-4)

(వరుడు కుడిచేతితో వధువుయొక్క దక్షిణాంసమును గూర్చి బాహువునెత్తి. హృదయ దేశమును స్పృశించి యిట్లు చెప్పుచున్నాడు. 'నాహృదయమందు నీహృదయముండుగాక. నాచిత్తమందు నీచిత్తముండుగాక. నావాక్కు నేకమనస్కవై వినుము. నన్ననుసరించియే వ్రతముకలదాననగుము. నాతో

సహచర్యవగుము.' ఆమె కుడిచెవిలో నిట్లు జపించుచున్నాడు 'నీమనస్సు నన్ను ప్రవేశించుగాక. నీనేత్రము, భగము నన్ను ప్రవేశించుగాక. నీకు నాయందే సర్వభూతములు గన్పట్టుగాక. నాయందే నీకు ప్రజ్ఞాన ముండుగాక.)

శారీరకముగ రెండు వ్యక్తులైన స్త్రీ పురుషులు మానసికముగ నొకేవ్యక్తి యగుటయే హిందూదాంపత్య లక్షణము. జీవితగాలములో నేకాక, మరణానంతరమునగూడ నిట్టి యైక్యముతో నుండుటయే ఆర్యదాంపత్యవిశేషము. మరణానంతరమునగూడ దాంపత్యము వీడరాదను నుత్తమాదర్శము వేదములలో ననేకస్థలములలో గన్పట్టుచున్నది.

"దివిజ్యోతి రజరమారభేతా."

పతిపత్నులు ద్యులోకమందున్న జరారహితమైన ఆదిత్యాత్మకమైన జ్యోతిని పొందుదురుగాక.)

అని వేదములో చెప్పబడినది. నేను నాభర్తకు పత్నినై పరలోకములలో కూడ నాతనితో కలిసియుందునని యొక స్త్రీ చెప్పుచున్నట్లు,

"సంపత్నిప త్యాహం సంగచ్ఛే."

తైత్తిరీయబ్రాహ్మణములో (1-10-2) కన్పట్టుచున్నది. అన్ని వేదములలోనుగూడ నిట్టి వనేకములు గలవు.

దంపతుల యీయైక్యమునకు కారణమైన పాతివ్రత్యము ఋగ్వేదములోగూడ స్తుతింపబడినది.

తైత్తిరీయారణ్యకములో పతివ్రతాశబ్దముకూడ కన్పట్టు చున్నది. (తై. ఆ. 1-27) పతి ద్వేషిణులైన స్త్రీలు ఋగ్వేదములో (4-55) మహాపాపాత్మురాండ్రుగ చెప్పబడినారు.

భర్త యెంతదుర్మార్గుడైనను స్త్రీకి పాతివ్రత్యధర్మము వీడదగినది కాదు.

విశీలః కామవృత్తోవా గుణైర్వా పరివర్జితః,
ఉపచర్యః స్త్రియా సాధ్వ్యా సతతం దేవమత్పతిః.
(మను 5-154)

(భర్త యెంత శీలరహితుడైనను, కామప్రవృత్తి గలవాడైనను, ఏసద్గుణము లేనివాడైనను, భార్య యతని దైవముగా పూజింపవలయును.)

ఈహేతువుచే నేపురుషుడైనను భార్యపట్ల క్రూరముగా ప్రవర్తించుచో వాడు తనకును, సంఘమునకును మహాపకారము చేసినవా డగుచున్నాడు.

ప్రతిపురుషుడును స్త్రీకి కూడ కష్టసుఖములు కలవని గుర్తించి "దయా సర్వభూతేషు" అను ప్రథమాత్మగుణమును స్త్రీ పట్ల ముందుగ నాచరణమందుంచుట యత్యావసరము. భార్యను క్రూరముగ చూచుచు లోకమునంతను దయతో చూచినను భగవంతుడు హర్షింపడు. మీదు మిక్కిలి భార్యను ప్రేమతో చూచువానిని దేవత లాశీర్వదింతురని మన శాస్త్రములు చెప్పుచున్నవి.

దేవదత్తాం ప్రియాంభార్యాం విందతే నేచ్ఛయాత్మన',
తాంసాధ్వీంబిభృయాన్నిత్యం దేవానాం ప్రియమాచరన్.
(మను 9-95)

(దేవతలచే నీయబడిన ప్రియురాలైనభార్య నెవ్వడును తన యిచ్ఛచే వివాహమాడుటలేదు. పురుషుడు దేవతలకు ప్రియమాచరించుచున్నవాడై యట్టి సాధ్విని ఎల్లప్పుడును భరింపవలయును.)

సాధ్వియైనభార్యను పరిత్యజించినవానికి ఘోరమైన ప్రాయశ్చిత్తములు విధింపబడినవి. ఆపస్తంబధర్మసూత్రములలో నిట్లు చెప్పబడినది.

దారవ్యతిక్రమీంఖరాజినం బహిర్లోమపరిధాయ దార
వ్యతిక్రమిణేభిక్షామితి సప్తాగారాణిచ రేత్,
సావృత్తిష్షణ్మాసాన్. (1-28-18)

(భార్యను వదలినవాడు గాడిదచర్మమును, వెంట్రుకలు పైకి వచ్చునట్లు కప్పుకొని, "భార్యను వదలిన నాకు భిక్ష వేయుడు" అని చెప్పుచు నారుమాసములు, దినమున కేడిండ్ల చొప్పున భిక్ష నెత్తుకొనవలయును.)

నేడిట్టి దుష్టపురుషులైచ్ఛికముగ నట్టి ప్రాయశ్చిత్తములను చేసికొనకపోయినను సంఘమట్టివారిని బహిష్కరింపవలసిన యావశ్యకత గలదు.

హిందూమతములో దాంపత్య మచ్ఛేద్యమనుటకు మఱొక యంశము చెప్పవలసియున్నది. భర్త భార్యను వదలినను, మఱొక స్త్రీని వివాహమాడినను వారి దాంపత్యము వదలినట్లు, శాస్త్రములు పరిగణింపవు. (మను 1-46)

భార్య భర్తపట్లను, భర్త భార్యపట్లను సంతోష పడుట దాంపత్యమునకు ప్రధానముగ నుండవలసిన లక్షణము. అది లేనియిల్లు గృహముకాదు. స్వభార్యయందానందముపొందుట యుత్తమపురుషలక్షణముగ మనశాస్త్రకర్తల చేతను, కవులచేతను చెప్పబడినది. నికృష్టపురుషులకు స్వభార్యయన్న రోతయు, పరస్త్రీలన్న వ్యామోహము నుండును. ఏదంపతులకైన నట్టి ప్రేమానుబంధము లేనిచో వా రదికల్గుటకై నిత్యము పరమేశ్వరుని ప్రార్థించుకొన వలయును.

సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యాతథైవచ,
యస్మిన్నేవకులేనిత్యం కల్యాణంతత్రవై ధ్రువం.
(మను 3-60)

(ఏగృహములో భార్యతో భర్తయు, భర్తతో భార్యయు నిత్యము సంతుష్టులైయుందురో, యాగృహమున నిత్యమాంగళ్యముండుట నిశ్చయము.)

## పితంతు వివాహము.

---

స్త్రీకి భర్తజీవితకాలములోగాని, భర్తమరణానంతరమున గాని మఱొక వివాహముచేసికొను నధికారము వేదములో కాని, స్మృతులలో గాని యంగీకరింపబడలేదు. స్పష్ట

ముగా పునర్వివాహమును నిషేధించు వచనము లనేకములు కలవు.

వితంతువివాహము శ్రుతిస్మృతి సమ్మతమా తద్విరుద్ధమా యను విషయమును విచారించునపు డీక్రిందియంశములు ముఖ్యముగ గమనింపదగినవి.

(1) అన్ని ధర్మశాస్త్రములును పూర్వ మితరునిచే వివాహము చేసికొనబడని స్త్రీని వివాహమాడవలయునని పురుషున కాదేశించుచున్నవి.

"సవర్ణాఽపూర్వశాస్త్రవిహితాయాం."

(ఆ. ధ. సూ. 2-11-1)

"అనన్యపూర్వికాంకాంతాం" (యాజ్ఞ 1-53) మున్నగు స్థలములను పరికింపదగును.

(2) ఏధర్మశాస్త్రముకాని, శ్రుతికాని స్త్రీకి పునర్వివాహమును విధించుట లేదు.

(3) స్త్రీ భర్తపోయినపిమ్మట మరొకనిని వివాహమాడరాదని స్పష్టముగా స్మృతులలో చెప్పబడినది.

"తం శుశ్రూషేత జీవన్తం సంస్థితంచ నలంఘయేత్"

(భర్త బ్రతికియుండగా నాతనిని సేవింపవలయును. అతడు చనిపోయినను నాతని నతిక్రమింపరాదు.)

అని మనుస్మృతి (3-151) చెప్పుచున్నది.

మరణానంతరమున భర్త యేలోకమున కేగిన నాలోకమున కేగదలచినదై, భార్య భర్త బ్రతికియుండగా గాని,

యినపిమ్మట గాని యాతని క్రియ మెన్నడును చేయరా దని యీక్రింది శ్లోకములో చెప్పబడినది.

"పాణిగ్రాహస్యసాధ్వీ స్త్రీ జీవతోవామృతస్యవా,
పతిలోకమభీప్సంతీ నాచరేత్కించి దప్రియం."
(మను 5_156)

భర్త మరణించినపిమ్మట మరియొకని పేరైనను నెత్తకూడదని మనువు చెప్పుచున్నాడు.

"నతునామాపి గృహ్ణీయాత్పత్యౌప్రేతే పరస్యతు (5_157)

ఇంకను నిట్టివచనము లెన్నియో కలవు. ఇంత విస్పష్టముగా స్మృతులలో చెప్పబడినయంశమును కొందరు వివాదములోనికి దింపుటయే యాశ్చర్యము.

(4) ఇంత విపులమైన సంస్కృత వాఙ్మయములో పురాణ గాథలలోగాని, ఇతిహాసములలోగాని, తుదకు కావ్యనాటకాదులలోగాని, యెచ్చటను నొకవితంతు వివాహమైనను కన్పట్టకుండుట ముఖ్యముగ గమనింపదగిన యంశము. దీని వలన భరతఖండములో నెన్నడును స్త్రీపునర్వివాహపద్ధతి లేదని స్పష్టము కాగలదు. వితంతువివాహములు జరుగుచుండిన ఇంగ్లండు మున్నగు దేశములలో బయలుదేరిన సాహిత్యములలో వితంతు వివాహము లేదోవిధమున కన్పట్టుచున్నవి.

(5) సంస్కరణవాదులు స్త్రీ పునర్వివాహమును సమర్థించుదానినిగా నుదాహరించు "ఉదీర్ష్వనారి" అను ఋక్కు

(ఋ. వే. 10-19-8, అథ. వే. 18-3-2, తైత్తి. ఆ. 6-1) యొక్క వాస్తవికార్థము ప్రస్తుతగ్రంథకర్తచే రచింపబడిన "వేదకాలపు స్త్రీలు" అను గ్రంథములో (పుట 44-50) విపులముగా ప్రదర్శింపబడినది. అట్లే "నష్టేమృతే" అను పరాశరస్మృతిశ్లోకము (4-30) యొక్క అర్థము "స్మృతికాలపు స్త్రీలు" అను గ్రంథములో (పుట 64-47) వివరింపబడినది.

ఆ ఋక్కును, శ్లోకమును గూడ వితంతువివాహము నొంతమాత్రము సమర్థింపవని వాని యర్థములను పరికించిన వారికి స్పష్టమగును.

## వివాహవయస్సు.

స్త్రీల వివాహవయస్సునుగూర్చి యొకింత చెప్పవలసియున్నది.

స్మృతులలో స్త్రీకి రజస్వలకాకముందుగనే వివాహము కావలయునని స్పష్టముగానే చెప్పబడినది. ఏస్మృతినైనను జూచికొనవచ్చును.

"ప్రదానం ప్రాగృతోః. అప్రయచ్ఛన్ దోషీ."
(గౌ. ధ. సూ. 18-21,22)

(రజస్వలకాకుండగనే కన్యాదానము చేయవలయును. అట్లు దానము చేయనివాడు దోషవంతుడు.)

"తస్మాద్వివాహయేత్కన్యాం యావన్నర్తుమతీభవేత్."
(అందువలన కన్యను ఋతుమతి యగులోపుననే వివాహము చేయవలయును.)

అని సంవర్తస్మృతి చెప్పుచున్నది.

రజస్వలావివాహమును నిషేధించు వాక్యము లింకను నెన్నియో స్మృతులలో గన్పట్టుచున్నవి. (ప-స్మృ. 8-6, 7, 8 యాజ్ఞ స్మృ. 1-65, వ. స్మృ. 17-69 మున్నగునవెన్నియో గలవు.) మంత్రలింగములనుబట్టి రజస్వలావివాహమూహ్యమనువాదము ప్రత్యక్షవిరుద్ధస్మృతివలన ప్రతిహతమగును

## గౌరవము

ఇక స్త్రీలగౌరవమునుగూర్చి యొకయంశము చెప్పవలసియున్నది.

స్త్రీకి స్వాతంత్ర్యములేదన, గౌరవములేదనియర్థము గాదు. లోకములో నందరికంటెను, తల్లియే యెప్పుడు పూజ్యురాలని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి.

"ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాంశతంపితా,
సహస్రంతు పితౄన్ మాతా గౌరవే ణాతిరిచ్యతే."
(మను. 2-145)

(పదిమంది ఉపాధ్యాయులకంటె నొక యాచార్యుడు హెచ్చుగౌరవార్హుడు. నూరుమంది యాచార్యులకంటెతండ్రి హెచ్చుపూజ్యుడు. తండ్రికంటె తల్లి వేయిరెట్లు హెచ్చు పూజ్యురాలు.)

పతితుడైన తండ్రిని విసర్జింపవచ్చుననియు, పతితురాలైనను తల్లిని పరిత్యజింపరాదనియు స్మృతులు చెప్పుచున్నవి.

'పతితః పితా పరిత్యాజ్యో మాతాతుపుత్రే నపతతి.'

(వసిష్ఠ 13-15)

పుత్రుని దృష్టిలోతల్లి యెన్నటికిని పతితురాలు కాజాలదు. భార్యకూడ తల్లివలెనే పూజ్యురాలనుటకుగూడనాధారము కలదు. తల్లి తనకు జన్మనిచ్చుచున్నట్లే, భార్యకూడ జన్మనిచ్చుచున్నదని ఐతరేయబ్రాహ్మణము చెప్పుచున్నది.

'పతిర్జాయాం సంప్రవిశతి గర్భోభూత్వే హమాతరం,
తస్యాంపునర్నవోభూత్వానవమే మాసిజాయతే,
తజ్జాయా జాయాభవతి దస్యాంజాయతే పునః.

(ఐ. బ్రా. 7-3-13)

(భర్త భార్యలో ప్రవేశించుచున్నాడు. భార్యనేతల్లిగ జేసికొనుచున్నాడు. తొమ్మిదిమాసములు నిండుసరికామెయందు క్రొత్తగ పుట్టుచున్నాడు. భర్త భార్యయందు జన్మించుచున్నాడు గావుననే భార్యకు జాయయనిపేరు.)

దీనిసిబట్టి భార్యకూడ తల్లివలెనే పూజ్యురాలని తెలియగలదు.

భార్యను సంతసింపజేయుటకు భర్త సర్వవిధముల ప్రయత్నము జేయవలయును. ఆమెపై నధికారమును నిర్వహించుటయే యాతని పనిగాదు. తాను కోరి స్వయముగ

నామెకు తనపైన కొంత యధికారము నీయవలెను. వివాహ మంత్రములలో భర్త భార్యతో "నా నెత్తినెక్కుము" అని చెప్పుమాట నిక్కడ జ్ఞప్తియం దుంచుకొనవలయును.

"మూర్ధానం పత్యురారోహ."

స్త్రీలను పూజించిన యిల్లుశోభించును. దేవతలచ్చట క్రీడింతురు. మను విట్లు చెప్పుచున్నాడు.

"యంత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః,
యత్రైతాస్తు నపూజ్యన్తేసర్వాస్తత్రాఫలాఃక్రియాః."
(3-56)

(స్త్రీ లేగృహములో పూజింపబడుచున్నారో, య చట దేవతలు క్రీడించుచున్నారు. స్త్రీ లేగృహమందు పూజింపబడుటలేదో యాగృహమున చేయబడు సత్కర్మ లన్నియు నిష్ఫలములు.

స్త్రీ లనగా గృహమును ప్రకాశింపజేయు దీపములని యు, వారు సాక్షాత్తుగా లక్ష్మీదేవులేయనియుకూడ మను స్మృతి చెప్పుచున్నది. (9-26)

కావున హిందూమతములో స్త్రీలకు గొప్ప గౌరవ స్థానము గలదని చెప్పవలసియున్నది.

---

ఈజగత్తు నశ్వరమగుటచే నీజగదృష్టితో మన కేర్పడిన విరాట్పురుషునకును, ఈశ్వరునకును ప్రసక్తి లేనికాలమొకటి యుండవచ్చునని మన మూహించుటలో ననౌచిత్యము లేదు. మన యూహకుమాత్రము గోచరమగునట్టియుః లేదా యూహాతీతముగూడ నైనట్టియు నాపరిస్థితిలో, నద్వితీయమై యుండునదియే పరమాత్మ. సజాతీయవిజాతీయ స్వగతభేదరహితమైన యాయాత్మ సచ్చిదానందస్వరూపమై నేడుకూడ మహాజ్ఞానులచే ననుభవింపబడుచునే యున్నది. వారిదృష్టిలో నీజగత్తు మాయాకల్పితము. వాస్తవికము గాదు. ఈవిషయములో హిందూమతములోని వివిధసంప్రదాయములవారు భేదించుచున్నారు. ఇది యద్వైతులమతము. పరమాత్మకును, జీవునకును, జగత్తునకునుగల సంబంధమును గూర్చి ద్వైతాద్వైతవిశిష్టాద్వైతమతములేకాక సాంఖ్యాది దర్శనములుగూడ పరస్పరము భేదించుచున్నవి.

ద్వైతులును, విశిష్టాద్వైతులును జగత్తు సత్యమే యందురు. అందు విశిష్టాద్వైతులు జగత్తు పరమేశ్వరు నాశ్రయించుకొనియున్నదందురు. ద్వైతులును, విశిష్టాద్వైతులును జగత్తులో లేక ప్రకృతిలోనంతటను పరమేశ్వరు డున్నాడని మాత్ర మందురు. అద్వైతులు సమస్తగుణములకు నతీతమైన నిర్గుణ బ్రహ్మపదార్థమునుగూడ నంగీకరింతురు. సగుణ బ్రహ్మనుగూడ వా రంగీకరింతురు. కాని నిర్గుణావస్థయే చరమమందురు.

## విగ్రహారాధనము

వైష్ణవులు విష్ణువు వైకుంఠములో నున్నాడనియు, శైవులు శివుడు కైలాసములో నున్నాడనియు, నిట్లే యితర సంప్రదాయములవా రాయాదైవము లాయాస్థానములలో నున్నారనియు చెప్పుమాట వాస్తవమే కాని యేవైష్ణవు డునుగూడ విష్ణువు వైకుంఠములోనేకాని యిచట లేడని చెప్పడు. విష్ణు వెందుపట్టిన నందే యున్నాడనియే యాతడు చెప్పును. శివుడు కైలాసములోనేకాని యిచట లేడని యేశైవుడును చెప్పడు. శివుడు లేనిచోటు లేదనియే ప్రతి శైవుడును చెప్పును. అట్లే యితరసంప్రదాయములవారును తమదైవము లేనిచోటు లేదందురు. కావున పరమేశ్వరుడు వైకుంఠములోగాని, కైలాసముపైగాని, మరొకచోటగాని యున్నాడని చెప్పువాని కెవ్వనికిని పరమేశ్వరుని వ్యాప్తిని గూర్చి లేశమైనను సంకుచితాభిప్రాయము లేదు. పరమేశ్వ రుడు వైకుంఠములో నున్నాడనుటను, కైలాసములో నున్నాడనుటను పరిహసించు హిందూమత విద్వేషులకు మాత్రమే యీసంకుచితభావ మున్నది. వీరికి పరమేశ్వరుని గూర్చి విశాలభావమే యున్నచో, పరమేశ్వరుడు వైకుంఠ ములోగాని, కైలాసములోగాని యున్నాడనుటను పరిహ సింపరు.

ఏవైకుంఠములోనో యుండువాడు లోకమంతలోను నెట్లుండగలడని యీ హిందూమతవిమర్శకులశంక. ఒకచోట

నుండుచు మఱియొకచోట లేకపోవుట యను శక్త్యల్పత్వము మానవునకే కాని దేవునకు లేదని పీ రెఱుగ లేకున్నారు. ఒక మానవు డొకచోట నున్నాడనుచో, నాతడు మరొకచోటున లేడని వేఱుగ చెప్పనక్కరలేదు. రెండుచోటులను నొకే సమయమున నుండుశక్తి వానికిలేదు. దేవునకుగూడ నీపరిమిత శక్తియేనా? ఒకచోట నుండుచునే మఱొకచోటగూడ నుండలేకపోయినచో నిక వాడు దేవుడేగాదు. 'విష్ణువు రామావతారముగా వచ్చినపుడు వైకుంఠము ఖాళీగా నుండెనా?' యని ప్రశ్నించు ప్రాజ్ఞు లీయంశమును జ్ఞప్తియం దుంచుకొనవలయును. బాగుగ యోగాభ్యాసము చేసిన మానవుడే యేకసమయమున ననేకస్థలములలో నుండగల్గినపు డిట్టిమానవులను కోటానుకోటులుగ పుట్టించి, పెంచి, గిట్టించుచున్న భగవంతున కీమాత్రముశక్తి యుండదా? భగవంతునిగూర్చి యిట్టి స్వల్పాభిప్రాయము మున్నవానికి, భగవంతునిపట్ల హిందువులకు గలదృష్టి విపరీతముగ నర్థమగుటలో నాశ్చర్యము లేదు.

హిందువుని దృష్టిలో భగవంతుడు సర్వవ్యాపి కావున నాత డేవస్తువులోనైనను పరమేశ్వరుని దర్శించి యర్చించును. విగ్రహము నారాధించినంతమాత్రముననే హిందువుడును పరమేశ్వరుడు విగ్రహములో మాత్రమే యున్నాడని తలంపడని గుర్తింపవలయును. విగ్రహారాధన విమర్శకుడు లోకమంతలోను పరమేశ్వరు నెంతమాత్రము చూచు

చున్నాడో, యంతమాత్రము విగ్రహారాధకుడును చూచు చున్నాడు. ఏవిగ్రహారాధకుడును విగ్రహమునకు బయటి ప్రదేశములో భగవంతుడు లేడనడు. విగ్రహారాధకునకు విగ్రహారాధనమును నిరసించువానికుండు పరమేశ్వరవిశ్వ వ్యాపకత్వభావ ముండుటయేకాక, యధికముగ పరమేశ్వ రుని ధ్యానించుటలో నవసరమగు నేకాగ్రతకు తోడ్పడు సాధన మొకటిగూడ గలదు.

విశ్వవ్యాపియైన పరమేశ్వరుని విగ్రహములోనున్నా డని సంకుచితముగ నుడువుట యాతని కవమానముకాదా యని విమర్శకు డనును, కాని పరమేశ్వరుడు మానావమాన ముల కతీతుడని యీ విగ్రహారాధనవిద్వేషులే నుడువుట యొక విశేషము. వారి సిద్ధాంతము ననుసరించియే యీ యాక్షేపణము తొలగిపోవును. మనము భగవంతునకు చేయు సేవ యాతని మేలుకొఱకుగాక మన మేలుకొఱకేకదా! ఉపాసకునిశక్తి ననుసరించియే యుపాసనసాధనము లేర్పడ వలెనుగాని పరమేశ్వరుని శక్తినిబట్టి యేర్పఱచుట సాధ్యమా? కొండంత దేవునకు కొండంతపత్రి వేయగలమా? మనకు దృష్టి నిలుచుటకై విశ్వవ్యాపిని తాత్కాలికముగ విగ్రహ ములో దర్శింతుము. ఇది మనసౌకర్యముకొఱకే యని గుర్తింపవలయును.

అనంతశక్తులను, అపారవ్యాప్తిని గల్గిన పరమేశ్వ రుని తానే సరియైనపద్ధతిలో నారాధించుచున్నానని చెప్పు విగ్రహారాధనద్వేషి లోకవంచకుడో, యాత్మవంచకుడో

యనుటకు సందియము లేదు. ఈ ప్రతిమారాధన ద్వేషి పరమేశ్వరుని నేవిధముగ నారాధించుచున్నాడో చూతుమేని, యాతని వాదములోని లోప మెటనున్నదో తెలియగలదు. "ఓ జగద్రక్షకా," "నా కాహారము నిడు నో తండ్రీ" యని యాతడు దేవుని స్తుతించును. పరమేశ్వరు డవాఙ్మానసగోచరుడని యాతడు చెప్పును. అయినను తాను వాక్కులతో నెందులకు స్తుతించుచున్నాడు? మనస్సునకు చిక్కని పరమేశ్వరుని తా నెందులకు మనస్సులో ధ్యానించుచున్నాడు? ఇట్లు కూడనిపనులను తా నొకవైపున చేయుచు దృష్టికందని వానిని దృష్టితో బంధించు విగ్రహారాధకు నాత డెట్లు నిందించుచున్నాడు?

సామాన్యమానవులలో భగవంతున కేదో యొకవిధమైనరూపము నీయకుండ తప్పించుకొనగలవా డుండడు. నిర్గుణబ్రహ్మోపాసన చేయగలవారిమాట నటుంచుడు. అట్టివారు కొలదిమందియే యుందురు. మిగిలినవారందరు పరమేశ్వరునకు రూపకల్పన చేయుచునే యున్నారు. భగవంతుని 'తండ్రి' యని సంబోధించినంతమాత్రముననే యొకరూప మిచ్చినట్లయినది. ఆరూపముమానసికమే యగుగాక. ఏవిశేషణము నుచ్చరించినను నొకమానసికవిగ్రహ ముదయింపక తప్పదు. పరమేశ్వరు డనంతలక్షణోపేతుడు. గావున నాతని కనంతసంఖ్యాక విగ్రహములను కల్పించుటలో నేమియు నసందర్భము లేదు.

## ఏకేశ్వరోపాసనము.

విశ్వమందు దేనిలో నా పరాత్పరుని మహిమను చూచుటకు వీలులేదు? చెట్టులోను, పుట్టలోను, పశువులోను, మానవునిలోను, శునకములోను, నీటిలోను, నిప్పులోను-అది యిది యన నేల? అన్నిటియందు నీపరమేశ్వరశక్తి నీక్షించి నమస్కరింపవచ్చును. పరమేశ్వరుడు సర్వవ్యాపియని చెప్పు నితరమతములవారు కేవలము మాటవరుసకే యట్లు చెప్పుచున్నారు, కాని యాచరణములో నట్లు చేయుటలేదు. హిందువుని పరమేశ్వర విశ్వవ్యాపకత్వవిశ్వాసము కేవలము మాటలలోనే కాక, చేష్టలలోకూడ వెల్లడియగుచున్నది. హిందువు అశ్వత్థవృక్షమును చూచి, నమస్కరించి, ప్రదక్షిణముచేసి భగవద్భావన వెల్లడించును. ఇట్లు చెట్టులోనేకాక పుట్టలోకూడ హిందువు పరమేశ్వరుని చూచును. సుబ్రహ్మణ్యషష్ఠినాడు హిందూస్త్రీలు పుట్టలో పాలుపోసి, సర్పమును పూజింతురు ఆవును పూజించి హిందువులు పశువులలోగూడ పరమేశ్వరుడున్నాడని వ్యక్తముచేయుదురు. అభిరుచులను, వాసనలను బట్టి హిందువులు సాధారణముగా గోవునందే పరమేశ్వరుని చూచినను, శునకాదులలోగూడ వారు పరమేశ్వరుని చూడకుండలేదు. "కుక్కలకును, కుక్కలను కాచుకొనువారికిని నమస్కార"మని (శ్వభ్యశ్శ్వపతిభ్యశ్చవోనమః) వేదములో చెప్పబడినది.

మన పూర్వజన్మవాసనలను, అభిరుచులనుబట్టి మనకు కొన్నిటియందే పరమేశ్వరునిచూచి ధ్యానించుటకు మనస్సెక్కును* కాని వాసనలను, అభిరుచులను నతిక్రమించి బ్రహ్మాది స్తంబపర్యంతము, క్రిమికీటకాదులలోకూడ, నేనాడు భగవల్లీలను చూడగల్గుదుమో, యానాడే పూర్ణమైనభగవద్భావన గల్గినదని చెప్పవచ్చును. ఆభావన నలవరుచుకొనుటకు సాధనము లనేకములు హిందూమతమునకలవు. గోవు,అశ్వత్థము. ఉత్తమబ్రాహ్మణుడు మున్నగువానిలో పరమేశ్వరునిచూచుట అట్టి అభ్యాసములలోనొకటి. ఇట్లభ్యాసముచేయువాడు క్రమముగ నన్నిటియందును పరమేశ్వరుని, పరమేశ్వరునిలోనే సమస్తమును గుర్తించును. అట్టివా డమరత్వము నొందునని గీత చెప్పుచున్నది.

యో మాం పశ్యతిసర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
దస్యాహం నప్రణస్యామి సచ మే న ప్రణశ్యతి. (గీత 6–30)

ఈయుత్తమస్థితిని పొందదలచిన హిందువులుమేఘుడు వర్షించుటలోను, గాలి వీచుటలోను, నదులు ప్రవహించుటలోను, పరమేశ్వరునిశక్తి చూతుగనుటలో నాశ్చర్యము లేదు. ఈశక్తులను వారు ఇంద్రవరుణాది నామములతో వ్యవహరింతురు. ఇట్లే వారు రామకృష్ణశివాది దైవతములనుకూడ పూజింతురు.

ఇంద్రవరుణ, యమ సూర్యాది దేవతలను గూర్చి హిందువులలో రెండభిప్రాయములుకలవు. 1. ఈ దేవతానామము

లన్నియు పరమేశ్వరునకీయబడిన నామములే, ఇది జ్ఞానదృష్టి 2. ఈ దేవతలన్నియు పరమేశ్వరునకు లోబడిన శక్తులే. ఇది కర్మదృష్టి. ఈ రెండభిప్రాయములలో దేనియందును పరమేశ్వరు లనేకులున్నారను భావము లేదు. ఈ రెండునుకూడ నేకేశ్వర భావమున కనుకూలములే.

ఇందు మొదటిసిద్ధాంతమును ముందు విచారింతము.

ఏకేశ్వరోపాసకులమని చెప్పుకొనుచు, ఇంద్రవరుణాది దేవతల నారాధించుట యనేకేశ్వరోపాసనమని నిందించు వారు తాముకూడ వాస్తవముగ నట్టి బహుదేవతారాధనమే చేయుచున్నామని గుర్తింపలేకున్నారు. వారీశ్వరునకు 'వర్షముకురిపించువాడు', 'పాపవిమోచకుడు', 'సంహారకుడు', 'ఆరోగ్యప్రదాత' మున్నగు విశేషణములను వాడుచున్నారు కదా! ఆవిశేషణముల యర్థమే ఇంద్రవరుణాది పదములలో గలదు. పై విశేషణములను వాడు నేకేశ్వరోపాసకుని దృష్టిలో నీవిశేషణములు భిన్నములేయైనను, నొకే దేవున కెట్లు చెల్లునో, యట్లే హిందువుని దృష్టిలో నీనామములు వేరే యైనను నివియన్నియు నొకేదేవునకు చెల్లును. ఈ దేవతలు భిన్నులనుటకు వీరి కచ్చకచ్చట పురాణములలో గన్పట్టు వివాదములు, వైరుధ్యములు సాక్ష్యములని యేకేశ్వరోపాసకు లందురు. కాని యట్టిదోషము వారిపద్ధతిలోను కలదు. వారు పరమేశ్వరునకు ప్రయోగించు 'రక్షకుడు', 'సంహారకుడు', అనువానికి వైరుధ్యములేదా ? ఇందొకవిశేషణము

చెల్లినచో, మఱొకటి వ్యర్థము కావలసివచ్చునుకదా! ఈదోషమును పరిహరించుటకు వారేసమాధానము చెప్పుదురో యాసమాధానమునే ఇంద్రవరుణాదులకు గన్పట్టు వైరుధ్యమునకు చెప్పుకొనవలయును. ముఖ్యవిషయ మేమనగా, మనమనస్సులు పరిమితశక్తులగుటచే పరమేశ్వరుని యన్ని లక్షణములను నొకేసారి మనస్సులో నారోపించుకొని ధ్యానింపలేము. పర్యాయముచేత మాత్రమే మన మాతని లక్షణములను ధ్యానింపగలము. పర్యాయముగ నైనను, మనము కొన్ని లక్షణములనే పేర్కొనగలము, కాని యన్నింటిని పేర్కొనలేము. ఏకేశ్వరోపాసకుడనని చెప్పుకొనువాడు పరమేశ్వరుని రక్షకసంహారకాదులైన కొన్ని విశేషణముల నేకరువుపెట్టి సంతుష్టుడగుచుండగా, హిందువంతమాత్రమున సంతృప్తినొందక యిందొకొక్క విశేషణముపైన కొంతనిలచి పరమేశ్వరుని ధ్యానించును. ఆతడు రక్షకవిశేషణముతో తృప్తిచెందక యారక్షక లక్షణమునకు సంబంధించిన యంశములన్నిటిని ప్రోగుచేసి వానికి సాముదాయికముగ విష్ణుప్రశంసయని పేరిడును. ఇట్లే సంహారకలక్షణములను క్రోడీకరించి వానికి సాముదాయికముగ శివప్రశంసయని పేరిడును. దేవతాస్తోత్రముల యొక్కయు, పురాణ గాథలయొక్కయు, తత్త్వమీవిధముగ నేకేశ్వరోపాసకుని ఈశ్వరవిశేషణ లక్షణములతత్త్వముకంటె భిన్నమైనదికాదు. కాని యీహిందూపద్ధతివలన పరమేశ్వరభావము మఱింత దృఢముగ మనస్సునకెక్కు నవకాశముగల్గును. కేవలమువిశేషణముల నేకరువుపెట్టినవాని కేసదుపాయము లేదు.

ఏకేశ్వరోపాసకుడనని చెప్పుకొనువా డీశ్వరునకు రక్షక విశేషణమును వాడి, పిమ్మట సంహారవిశేషణమును వాడుచో, వానిని మనము "రక్షకత్వము గొప్పదా ? సంహారకత్వము గొప్పదా ?" యని ప్రశ్నించుచో నాతడు 'రెండు నొకే దేవునకు చెందునవగుటచే రెంటిలో నొకటి తక్కువకా' దనును. అట్లే శివు నారాధించునపు డొక హిందువు శివుడు దైవమని భావించి, విష్ణువు నారాధించునపుడు విష్ణువు దైవమని భావించినను నొకనికే యీలక్షణములు చెందుటచే వీరలకు తారతమ్యముండుట యసంభవమని యాతడు తలంచును.

వైష్ణవులు శివు నర్చింపకుండుటయు; శైవులు విష్ణు నర్చింపకుండుటయు జూడ నీహిందువులకు పరమేశ్వరునిపట్ల సంకుచితభావము వెల్లడియగుటలేదాయని యడుగవచ్చును, ఇట నొకయంశము జ్ఞప్తియందుంచుకొనవలయును. వైష్ణవులు తమదైవతమునకు శివుని ముఖ్యలక్షణములు లేవనికాని, శైవులు తమదైవతమునకు విష్ణువుని ముఖ్యలక్షణములులేవని కాని చెప్పుటలేదు. అట్లు చెప్పినపుడే వారి భగవద్భావమునకు సంకుచితత్వమేర్పడును. విష్ణునకు లోకరక్షణము ముఖ్యలక్షణముగా వైష్ణవులచే భావింపబడుచున్నను, లోకసంహారకత్వము విష్ణువునకు లేదని యేవైష్ణవుడును చెప్పడు. అట్లే లోకరక్షకత్వము శివునకు లేదని యేశైవుడును చెప్పడు. శైవులు, వైష్ణవులుమాత్రమే కాక మిగిలిన యన్ని సంప్రదాయములవారును గూడ తమతమ దైవములకు సృష్టిస్థితిలయ

కారకత్వము నంగీకరించి బ్రహ్మవిష్ణు మహేశ్వరుల నేకాక యితరదైవములను గూడ నం దేకము గావింతురు.

ఇక నామవిషయమున, నెవని కేది రుచించునో వాడు దానిని గైకొనును. శివలక్షణములకంటె విష్ణులక్షణములు భిన్నములు కావని యంగీకరించినపుడు, పే రేదియైన నేమి? వ్యక్తి యభిరుచికి కొంతతా వొసగ వలెనుగదా! అభిరుచినిబట్టి నామముండుగాక!

అట్లే గుణములలోగూడ కొన్ని కొందఱకు నచ్చ వచ్చును. ప్రసంగము వచ్చినపుడు వైష్ణవులు తమతమ దైవముల కన్నిలక్షణములు నున్నవని చెప్పినను, సాధారణముగ వారు భావించుగుణములు తమ యభిరుచులనుబట్టియే యుండును. వైష్ణవులు కల్యాణగుణములను భావింతురు. శాక్తేయులు తీవ్రగుణములను భావింతురు. ఇం దేమియు దోషము లేదు. ఇచటగూడ నభిరుచియే ప్రధానము. సామాన్యమానవు లెవ్వరు నీయభిరుచిని దాటిపోజాలరు. కనుక నే మానవస్వభావమును బాగుగ గుర్తెఱిగిన హిందూమత మీయభిరుచికి తగిన యవకాశము నొసగినది.

హిందూమత విమర్శకులు తీవ్రరూపారాధకులైన శాక్తేయుల నాక్షేపించుట కలదు. దానికి శాక్తేయులు చెప్పు సమాధాన మేమన: "నీభౌతిక దేహమున కేది ప్రియమో, దానినే నీవు పరమేశ్వరునియందు చూడగల్గి,

యితరములను చూడలేక పోయినచో నీకు పరమేశ్వరుని పట్లగల భావ మసంపూర్ణమగును. తన స్థూలదృష్టికి లాభకరములుగ గన్పట్టు లక్షణములను పరమేశ్వరునియందు చూడగల్గుట ప్రతిమానవునకును సులభము. నిజమగు పరమేశ్వరభావము గలుగవలెనన్న చో, ననంతగుణోపేతుడైన పరమేశ్వరునిలో మనకు నప్రియములై, భయంకరములైన లక్షణములనుగూడ చూచుట కలవాటు చేసికొనవలెను. మన భౌతికదేహములకు మేలొనగూర్చు పరమేశ్వరు నర్చించుటలోని విశేషభక్తి వెల్లడికాదు. మనప్రాణములను దీయు లక్షణములోగూడ దేవు నారాధింప గల్గినపుడే భగవద్భావన విషయమున మనము కొంత యున్నతస్థితికి వచ్చినామని తెలిసికొనవలయును.” ఈ సమాధానము నెవ్వరును ప్రత్యాఖ్యానము చేయలేరు.

హిందువులలో నధికసంఖ్యాకులు నామరూపభేదములను పాటింపక, పరమేశ్వరు నే నామరూపములోనైనను నర్చించువారే కలరు. అట్టివారు కూడ నాయాకాలములలో తమ మనస్థితినిబట్టి యేదోదైవమును ధ్యానింతురు. ఏనామరూపములలో మనము పరమేశ్వరుని గ్రహించినను, సర్వ నామరూప లక్షణోపేతుడు, లేదా సర్వనామరూప లక్షణాతీతుడు అగు పరమేశ్వరు డీసాకర్యార్థము గ్రహింపబడిన పరమేశ్వరునికంటె భిన్నుడుకాడను నంశమును మనము గ్రహించుచో నట్టి పూర్ణ పరమేశ్వరుని పూజించినట్లే

యర్థము. ఈవిధముగ పరిమిత నామరూపలక్షణమును పూర్ణ పరమేశ్వరునకును సమన్వయము కుదురుట యసంభవము కాదు, అసంఖ్యాకులైన మహాభక్తుల జీవితములే యిట నిదర్శనము. సుప్రసిద్ధమహాభక్తుడైన రామదాసు శ్రీరాముని దశరథపుత్రునిగను సీతాపతిగను పాణిపాదాదులుగలవాని గను తనహృదయములో ధ్యానించుచుండెను. కాని యీ శ్రీరాముడే విశ్వజనకుడును, విశ్వపతియు, విశ్వవ్యాపియు నైన పరమేశ్వరు డనుభావ మాతని నెన్నడును నెడబాయ కుండెను. ఈవిధముగ నేదేవత నారాధించినను, నది పూర్ణ దేవతారాధనమే యగును. హిందువులలో సర్వసాధారణ ముగ గన్పట్టు నారాధన మిద్దియే.

ఇక నింద్రవాయువరుణాదులు పరమేశ్వరునకు లోబడిన శక్తులను సిద్ధాన్తమునుగూర్చి యొకమాట చెప్పవలసియు న్నది. దీనినిబట్టి యీ దేవతలు పరమేశ్వరసృష్టిలోని యొక యున్నతమైన యంతరమునకు చెందినవారనియు, మానవులు వారి నారాధించుచో, వారు సంతుష్టులై మానవుల సంకల్ప ములను తమశక్తి కొలదియు తీర్తురనియు విశ్వసింపబడు చున్నది. దివ్యజ్ఞానసమాజమువారుకూడ సృష్టిలో నిట్టియం తరముల నంగీకరించియున్నారు. ఈభావముతో నింద్రవరు ణాదుల నారాధించుట పూర్ణపరమేశ్వరారాధనము కాజా లదు. ఇట్లారాధించువారి కాయాదేవతలపట్ల పూర్ణమైన శ్రద్ధాభక్తు లుండవచ్చును. ఆరాధనఫలితముగ నా దేవతలు

వారికోరికలను తీర్పవచ్చును. కాని యిట నారాధకున కారాధిత దైవతముపట్ల సర్వశక్తి మత్వ సర్వవ్యాప కత్వాదిభావములు లేకుండుటచే నిది పరమేశ్వరాతిరిక్త దేవతారాధనమగును. కాని లోకములో నన్నిశక్తులును పరమేశ్వరునివే కాదా ? కనుకనే శ్రీకృష్ణు డిట్టివా రన్య దేవతారాధకులేయైనను, తుదకు వారును తన్నే యపమార్గ మున నారాధించుచున్నారని చెప్పినాడు.

యేప్యన్య దేవతా భక్తాయజన్తే శ్రద్ధయాన్వితాః.
తే పి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకం.
(గీత 9-23)

కావున నేదేవత నారాధించినను, విశాలభావముతో నారాధించుటయే శ్రేష్టము. పరిమితశక్తిగల దేవత నారా ధించుటలో నేకాగ్రత కవకాశము హెచ్చుగనున్నమాట వాస్తవమే కాని యాపరిమితశక్తిగల దేవత యనంత పర మాత్మశక్తులలో నొకటియను భావముతో నారాధింప దగును.

ఇంద్రవరుణాది దేవతల స్తుతులతోనిండిన విశాల వేద సంహితా వాఙ్మయముయొక్క పరమబోధయేమన, 'సత్ప దార్థ మొక్కటియే. ఇంద్రవరుణాది నామములతో నాపర మాత్మనే పండితులు వ్యవహరించుచున్నారు.' ఈయంశము విస్పష్టముగా ఋక్సంహితలో చెప్పబడియున్నది.

'ఏకం సద్విప్రా బహుధా వదన్తి'

పరమేశ్వరానుగ్రహమును సంపాదించుటకై భక్తాగ్రేసరుల నారాధించుట యొకమార్గమని కొన్నిసంప్రదాయములవారు నమ్మెదురు. స్థూలదృష్టితోచూచిన నిది పరమేశ్వరాతిరిక్తారాధనముగనే యుండును. గాని సూక్ష్మముగ బరికించిన నిందలితత్త్వ మేకేశ్వరోపాసనమేయని తెలియగలదు.

## ఆరాధనపద్ధతులు.

ఇక హిందూమతములోగల భగవదారాధన విధానములను కొన్నిటిని పరికింతము.

1. స్వవర్ణాశ్రమ విహితకర్మ నీశ్వరార్పణబుద్ధితో నాచరించుట భగవదారాధనవిధానములలో నొకటి. ఇది తప్పక సిద్ధినిచ్చునని భగవద్గీత చెప్పుచున్నది.

యతఃప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతం,
స్వకర్మణా తమభ్యర్చ్యసిద్ధిం విందతి మానవః (18-46)

గీత నిష్కామకర్మను బోధించుచున్నదనియు, తామేమియు ఫలము నపేక్షింపక, దేనినాచరించినను, నది తమ్ము బంధింపదనియు నాధునికులు కొందరు చెప్పుచున్నారు. కాని గీతామతము, నేదియో యాచరించినచాలదు; శాస్త్రసమ్మతమైన కర్మనే యాచరింపవలయును. మరియు గీత శుష్కని

ష్కామకర్మనుబోధించుటలేదు; ఈశ్వరార్పణబుద్ధితో కర్మ చేయవలయునని చెప్పుచున్నది. శుష్కనిష్కామకర్మను బోధించునది బౌద్ధమతముకాని గీతామతముకాదు. గీతామతమున భగవద్భావన యత్యంతము ముఖ్యము. స్వవర్ణాశ్రమ కర్మ నీశ్వరార్పణబుద్ధితో చేయుట హిందూమతములో ముఖ్యమైన యారాధనవిధానమని చెప్పదగును.

2. నామస్మరణము, మంత్రజపము అనునవికూడ ముఖ్యములైన పరమేశ్వరానుగ్రహ సంపాదనమార్గములే. నామస్మరణమువలనను, మంత్రజపమువలననుగూడ చిత్తైకాగ్రత సులభముగ గల్గును. మంత్రముల యక్షరసంపుటిలో ఋషులు ప్రవేశపెట్టిన గొప్పశక్తి కలదని యిదివఱలో చూచియుంటిమి. మంత్రముయొక్క యక్షరములనుగాని, యది వైదికమైనచో స్వరమునుగాని మార్చుటకు వీలులేదు. మఱియు, మంత్రమును గురుముఖమునుండియే గ్రహింపవలయును. ఆమంత్రము నిదివఱలో హెచ్చుగా జపించి, దానిమహాత్త్వమును అనుభవపూర్వకముగ గొంత తెలిసికొనిన మహాపురుషుని ముఖమునుండి గ్రహించిన దానికిని, ముద్రిత గ్రంథములోనుండి కాని, లిఖితగ్రంథములోనుండి కాని గ్రహించినదానికిని ఫలితములో చాలభేదముండును. కావున మంత్రములను సద్గురువులనుండి యుపదేశముపొంది జపించుట యవసరము.

3. హిందువులలో సాధారణముగ నాచరణములో నున్న భగవదారాధనవిధానములలో షోడశోపచార పద్ధతి యొకటి. షోడశోపచారము లెవ్వియన ; ధ్యానము, ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, స్నానము, వస్త్రము యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, నీరాజనము మంత్రపుష్పము. మానవుడు సాధారణముగ మానవవాసనల నతిక్రమింపజాలడు, గావున నాతని పరమేశ్వరు నర్చించుటలో నీపద్ధతి యెంతయు సహజమైనదియే కాక న్యాయమైనది కూడ నని చెప్పవలయును.

"పరమేశ్వరునియందు భక్తియుండుచో దానిని లోపల దాచుకొనరాదా ? అర్ఘ్యపాద్యాదులరూపమున నెందులకు వ్యక్తముచేయ వలయును ?" అనుట యర్థములేనిమాట. భక్తియనునదియొకటి లోపలున్నచో, నది యేదోవిధముగ బయటకువచ్చును భక్తుల నిర్దుష్టభక్తి ప్రకటనవిధానములను వెక్కిరించుట వెఱ్ఱిపని. భిన్నమానవుల మనఃప్రవృత్తులనుబట్టి భక్తిప్రకటన విధానములుండును. కుమారునిపై తండ్రికి ప్రేమయుండును. ఒకొక్కడు కుమారుని దూరము నుండి చూచియే యొకచిరునవ్వు నవ్వును; మఱొకడు కుఱ్ఱవానిచెంతకేగి వానివీపుపై చఱచి యానందమును వ్యక్తపఱచును ; ఇంకొకడు పిల్లవాని నెత్తికొనిననేకాని తృప్తి నొందడు ; వేఱొకడు బిడ్డను ముద్దిడుకొనిననేకాని తనియడు; తనివితీర పిల్లవానిని కఱచిననేకాని విడువని తండ్రులు కొంద

ఉందురు. భక్తుని భక్తికూడ నీ ప్రేమవలెనే యనేకవిధముల వ్యక్తమగును. అట్టి భక్తిప్రకటన విధానము నాక్షేపించుట భగవంతు నాక్షేపించుటయే యగును.

"టెంకాయలు, మంత్రపుష్పములు దేవున కెందులకు? వీనికొఱకై దేవుడు మొగమువాచియున్నాడా?" యను కువిమర్శకులుగూడ గలరు. ఈకువిమర్శకులుగూడ భగవద్ధ్యానము చేయువారే. వారు కన్నుమూసుకొని, మోకరించి భగవద్ధ్యానము చేయవచ్చును. "నీకన్నుమూతలకొఱకును, మోకరింపుల కొఱకును భగవంతుడు మొగమువాచియున్నాడా?" యని యడిగిన నాతడేమిసమాధానము చెప్పును? "ఇది నామనస్తృప్తికొఱకే చేయుచున్నాను" అని చెప్పును. షోడశోపచారములను గూడ నితరుడు తన మనస్తృప్తికై చేయకూడదా? భగవంతునకు టెంకాయలు లేవనుభావముతో నొకభక్తుడైన నిచ్చుచున్నాడా? ఇట్లు సనాతన భగవదారాధన విధానమును దేనిని తీసికొనినను, అది యాధునికుల కువిమర్శలకు లొంగునది కాదని నిశ్చయముగ చెప్పవచ్చును. ఈషోడశోపచారపద్ధతి యేవిధముగను దూష్యముకాకపోవుటయే కాక హిందువులలో భగవదారాధన పద్ధతికి జీవనముగల్పించిన దీవిధానమేయని చెప్పవలయును.

4. మంత్ర తంత్రాగమశాస్త్రవిధుల ననుసరించి గృహములలోను, దేవాలయములలోను జరుగు నర్చనవిధానము హిందూమతములోని మఱియొక ప్రత్యేకలక్షణము. మంత్ర తంత్రముల ప్రశంస యిదివఱలో కొంతగావింపబడినది.

హిందూదేవాలయములు కేవలము ప్రార్థనమందిరము లను కొనరాదు. హిందూదేవాలయములలో ఆగమవిధానముచే మంత్రరూపమునను, యంత్రరూపమునను, తంత్రరూపము నను, అపారమైనశక్తి ప్రవేశపెట్టబడును. అంతటను భగవంతుడున్నను, మహాపురుషులలో నాతనియంశము హెచ్చుగనున్నదని యాధునికులుగూడ నెట్లంగీకరించుచున్నారో, యట్లే యన్నిప్రార్థనమందిరములలోను పరమేశ్వరుడున్నను, ఆగమవిధానము ననుసరించి నిర్మింపబడి నిర్వహింపబడుచున్న దేవాలయములో భగవచ్ఛక్తి హెచ్చుగనున్నదని యంగీకరింపవలయును. ఆగమానుసరణముచేత మహత్త్వమును పొందిన దేవాలయములలో నేవర్ణము వారెంతవఱకు రావచ్చునో, ఏవిధముగా నర్చన చేయవలయునో యను విషయమున ఆగమములు విధించిన నియమములను పాటింపక యన్నివర్ణములవారికిని, అవాంతరవర్ణములవారికిని దేవాలయమున నొకేవిధమగు స్థానమునొసగుట వెఱ్ఱిపనియేకాక, దేవాలయములలో ఆగమమూలకముగ ప్రవేశపెట్టబడిన మహిమను పోగొట్టుటకును, విషమమార్గమున త్రిప్పుటకును కారణమనికూడ చెప్పవలయును.

5. అనంతరూపలక్షణోపేతుడైన శ్రీపరాత్పరు నుపాసించుటలో ననేకవిధములైన మార్గములు ఉపనిషత్తులలో చెప్పబడినవి. ఆయుపాసనలన్నియు నియమపూర్వకముగ ........ ......దేశము ననుసరించి చేయదగినవి. ఏవిధ

మైన యారాధనకైనను, చిత్తైకాగ్రత యవసరము. కావున నన్నిటికిని పాతంజలయోగసహాయము తప్పకయుపకరించును

## ఆ రా ధ న ప్ర యో జ న ము

పరమేశ్వరుని మన మేవిధముగ నుపాసించిన, నావిధమైన సిద్ధియే మనకు గల్గును. ఈసిద్ధిని గల్గించుశక్తి పరమేశ్వరునిలో నున్నదా? మనలో నున్నదా? యన, నిత్యము పరమేశ్వరునిలోనున్న యీశక్తిని మన మనస్సు గ్రహింపగల స్థితిలోనికి రావలసియున్నది. ఒకేపాముమంత్ర మొకడు వేసిన ఫలించును; మఱొకడు వేసిన ఫలింపదు. అది మనశ్శక్తులలోని భేదము. ఉపాసననియమములలోని తారతమ్యముగూడ కావచ్చును. ఎట్లయినను శ్రద్ధానియమము లత్యవసరములు. పరమేశ్వరుని మనమెంత యుత్తమలక్షణములలో, నెంత దృఢమైన శ్రద్ధతోను, తన్మయత్వముతోను నర్చింతుమో, యంత యుత్తమత్వము మనకంత శీఘ్రకాలములో లభించును. పరమేశ్వరుని ధనప్రదాతగ నర్చించువానికి ధనమే వచ్చును; విద్యాప్రదాతగ నర్చించువానికి విద్యయే వచ్చును; స్వర్గప్రదాతగ నర్చించువానికి స్వర్గమే వచ్చును; మోక్షప్రదాతగ నర్చించువానికి మోక్షము వచ్చును.

నాల్గు విధములైన పుణ్యాత్ములు తన్నారాధించుచున్నారని భగవానుడు గీతలలో చెప్పుచున్నాడు.

"చతుర్విధాభజంతే మాం జనా స్సుకృతినోర్జున,
ఆర్తోజిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ." (7-16)

(ఓ యర్జునా! నాల్గు విధములైన పుణ్యాత్ములు నన్నారాధించుచున్నారు. వా రెవ్వరన: బాధలో నున్న వాడు, నన్నెఱుగదలచినవాడు, లౌకికప్రయోజనము నపేక్షించినవాడు, జ్ఞాని.)

ఆర్తత్రాణపరాయణుడను బిరుదము పరమేశ్వరునకు గలదు. ఆర్తునకు పరమేశ్వరునియందు విశ్వాసమెంత దృఢముగనున్న, అంత త్వరలో నార్తివిముక్తిని పరమేశ్వరుడు కల్గించును. పరమేశ్వరవిశ్వాస మత్యంతము దృఢమైనపుడు మానవుడు పౌరుషమునుకూడ పరిత్యజించును. వస్త్రాపహరణ సమయమున ద్రౌపదియు, మకరగ్రహణసమయమున గజేంద్రుడును ఆర్తులై యట్టి విశ్వాసముచేతనే రక్షింపబడిరి.

లౌకికప్రయోజనము నపేక్షించికూడ పరమేశ్వరు నారాధింపవచ్చును. వేదములలోకూడ ధనాదులనిమిత్తమైన ప్రార్థనలుకలవు. ఇందలి యున్నతాభిప్రాయములు రెండు. (1) హిందువుని దృష్టిలో తనకేది లభించినను, అది నిమిత్తమాత్రముగ మనుష్యునినుండియే వచ్చినను, దాని కాదికారణము శ్రీపరమేశ్వరుడనియే. అట్లే హిందువు ఇతరునకేదైన దానముచేసినను, ఆప్రతిగ్రహీతకూడ నాతని దృష్టిలో భగవంతుడే. ఈయున్నత విశ్వాసమును పురస్కరించుకొనియే యట్టి ప్రార్థనలు బయలుదేరినవి. (2) ధనాదికమును భగవంతునినుండి సర్థించుటలోని మరియొక యాశయమేమన: తన కేది లభించినను, నది పరమేశ్వరునకు సమ్మతమైన మార్గ

ములో లభింపవలయును, కాని యన్యాయమైనమార్గములో లభింపరాదను భావ మిందున్నది.

లౌకికప్రయోజనముల నుద్దేశించికాని, స్వర్గాదిసుఖముల నుద్దేశించికాని, జన్మాంతరములోని సుఖము నుద్దేశించికాని చేయబడుకర్మలు ఫలించుననుటలో హిందూమత గ్రంథములలో నభిప్రాయభేదము లేదు. గీతలలో భగవానుడు నిష్కామకర్మ నెంత బోధించినను, కామ్యకర్మల ఫలితము నంగీకరించుచునే యున్నాడు. జ్యోతిష్టోమాదిక్రతువుల నాచరించి, స్వర్గాదిసుఖముల ననుభవింతురనియు, స్వర్గములో పుణ్యభోగము లించుమించుగా పూర్తియైనపుడు భూలోకమున జనింతురనియు, భగవానుడు గీతలో చెప్పుచున్నాడు.

"త్రైవిద్యామాం సోమపాః పూతపాపా యజ్ఞైరిష్ట్వాస్వర్గతింప్రార్థయంతే॥ తే పుణ్యమాసాద్య సురేంద్రలోక మశ్నన్తి దివ్యాన్దివి దేవభోగాన్॥ తేతం భుక్త్వాస్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి!" (9-20-21)

ప్రయోజనము నుద్దేశించి చేయబడు కర్మలన్నియు, స్వార్థములేయని తలంపరాదు. కొన్నిపదార్థము లుండవచ్చును. యజ్ఞయాగాదు లనేకములు కర్తృశ్రేయస్సుకొఱకే గాక, లోకశ్రేయస్సుకొఱకుకూడ చేయబడుచున్నవి. అనేక ప్రార్థనలు లోకముకొరకై యుద్దేశింపబడినవి. ప్రతిదినమును పూర్వాచారప్రియుడైన హిందువు ఈక్రింది శ్లోకమును పఠించునుగదా.

"స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేనమార్గేణమహీంమహీశాః,
గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తునిత్యం
లోకాస్సమస్తాస్సుఖినోభవంతు.

ఏవిధముగను భగవంతు నర్చింపనివానికంటె, ప్రయోజనముకోరి భగవంతు నర్చించువాడు శ్రేష్ఠుడు. అట్టి యర్థార్థికి భగవద్భక్తి విశ్వాసములుండుటచే నవి యెన్నటికైన, నుత్తమలక్ష్యముపైకి పోవచ్చును. భక్తి ధనకాంక్షతోనే ప్రారంభమైనను, కొంతకాలమున కిట్టి తుచ్ఛవిషయములకై భగవదనుగ్రహమును వినియోగించుకొన నేల? అనితోచును. ధ్రువుడు ప్రారంభములో లౌకికార్థప్రేరితుడయియే తపస్సునకు గడంగినను, తుద కాతని కట్టికోరిక నశించి పరమేశ్వర సాన్నిధ్యవాంఛయే కలిగెను.

పరమేశ్వరతత్త్వము తెలిసికొనుటకు, లేదా పరమేశ్వర ప్రీతికొఱకుగాడ భక్తుడు పరమేశ్వరారాధనము జేయవచ్చును. వెనుకటి రెండుపద్ధతులకంటె నిది యుత్కృష్టమైనది. ఇట్టి యుద్దేశముతో నారాధనము చేయువానికి భగవంతుడు సులువుగ సహాయము చేయును. ఆనాటికానాడు వానికి పరమేశ్వరజ్ఞానము కలుగజొచ్చును. ఒకయుదాహరణము తీసికొందము. పరమేశ్వర ప్రీతికొఱకు నిష్కామకర్మ నాచరించువానిపట్ల పరమేశ్వరుడు సంప్రీతుడై, యా నిష్కామకర్మకు ఫలితముగ నింకను నిష్కామకర్మజేయు బుద్ధి నాతనికి బుట్టించును. ఇట్లు క్రమక్రమముగ నాతని జీవిత

మంతయు పరమేశ్వరప్రీత్యర్థమైన నిష్కామకర్మలతో గూడి నది యగును. స్వల్పముగ ప్రారంభింపబడినదైనను, నిట్టి ఈశ్వరార్పణబుద్ధితో జేయబడిన కర్మ గొప్పభయమునుండి రక్షించునని గీత చెప్పుచున్నది.

"స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్."
(గీత 2-64)

జ్ఞానముతో తన్ను సేవించువాడు తనస్వరూపుడేయని గీతలలో పరమేశ్వరుడు చెప్పియున్నాడు.

అద్వైతులమతములో జ్ఞానమువలన ముక్తి కలుగును; జీవాత్మ పరమాత్మల యైక్యమే ముక్తి. ఈజ్ఞానము పరమేశ్వరానుగ్రహమువలన గల్గును. పరమేశ్వరానుగ్రహము కొఱకు నిష్కామకర్మ నాచరింపవలెను. ముక్తుడైనవానికిక జన్మలేదు. నిత్య నిరతిశయానందమే ముక్తునిస్వరూపము. సచ్చిదానందస్వరూపమైన పరమాత్మకంటె నితరమెద్దియు సత్యములేదు.

ద్వైతులమతములో ముక్తినిచ్చునది భక్తి, భక్తిని దృఢపరచునది జ్ఞానము. వీరిమతములోగూడ కర్మాచరణమీశ్వరానుగ్రహ సంపాదనమున కవసరమే. ద్వైతులముక్తిలో జీవుడు పరమేశ్వరునితో నైక్యమునొందడు; నిరంతర పరమేశ్వరసేవలో జీవుడానందమును బొందుచు పరమేశ్వర సన్నిధి నుండును. ద్వైతులమతములోగూడ ముక్తుడు జనన మరణముల కతీతుడు.

విశిష్టాద్వైతులమతమునకూడ మోక్షము పరమేశ్వర భక్తి చేకల్గునదియే. విశిష్టాద్వైతములో ప్రపత్తి, యనగాపర




మేశ్వరున కాత్మార్పణము గావించుకొనుట, యను భక్తి [illegible]ముఖ్యసాధనము కలదు. విశిష్టాద్వైతులును, [illegible]లనే జీవుడు పరమాత్మకంటె భిన్నుడనియే యందురు. కాని గుణములలో జీవుడును పరమాత్మవంటివాడే యందురు; ద్వైతులన్ననో జీవులకును, పరమేశ్వరునకును వాస్తవికమైన గుణభేదము కలదందురు.

అన్ని సంప్రదాయములలోను జననమరణరాహిత్య లక్షితశాశ్వతానందము నొందుటకు భగవత్సంసేవన మెంత యావశ్యకమో తెల్పుటకనియే పైన వేదాన్తసంప్రదాయముల ప్రశంస యించుక గావింపబడినది, కాని వివిధ వేదాన్తసంప్రదాయముల స్వరూపమును వివరించు నుద్దేశముతో కాదు. హిందూమతములోని వేదాన్తసంప్రదాయముల విచారము చాల పెద్దవిషయము. దాని కీగ్రంథమున నవకాశము లేదు.

ఇట్లు హిందూమతము ననుసరించి తప్పించుకొనుటకు గాని, పరలోకములో సుఖముల ననుభవించుటకుగాని, జనన మరణరూప సంసారమునుదాటి శాశ్వతసుఖము ననుభవించుటకుగాని పరమేశ్వరానుగ్రహ మమోఘమైన సాధనమని తెలియగలదు స్వవర్ణాశ్రమ విహితకర్మనాచరించుచు, పరమేశ్వరానుగ్రహము నపేక్షించుచు, నితరవాంఛలను వీడుటయే ప్రతిహిందువును నిత్యము నభ్యసింపవలసిన యుత్తమ సాధన మనునదియే సమస్త హిందూమతగ్రంథముల పరమోపదేశమని చెప్పదగ[illegible]



శ్రీ పరమేశ్వ[illegible]